# భారతి

## సచిత్రమాసపత్రిక ... ౧౨౪ ౧౨౫-౧౨౭

ప్రతిచాంద్రమాసాదిని ప్రచురింపబడును

సచిత్రమాసపత్రిక-ప్రతిసంచిక యందును 3, 4 రంగులపటములు కలిగి ఇతర చిత్రపటములతో ప్రమ రింపబడును. వాఙ్మయము, చిత్రకళలు, గానము, కథలు, నాటకములు మున్నగు అనేక విషయములతో ప్రతిమాసమునను 200 పుటలు కలిగియుండును.

సంవత్సర చందా రూ 6-0-0 అర్ధసంవత్సరము రూ 3-0-0 విడిప్రతిక రూ 0-10-0

☞ ప్రస్తుతపు పోస్టలు రూల్సు ప్రకారము. 0-2-0 రిజిస్టరుచార్జి, 0-3-0 తపాలుచార్జి అధిక మగుచున్నది. మీరే సొమ్ము మాకు ముందుగ మనియార్డరుపంపిన ఈఖర్చు తగ్గును. వీ. పీ. లు పంపినచో ఒక్కొక్కప్పుడు ఆలస్యముగ చేర్చుటయు పత్రికలు పంపుట ఆలస్య మగుటయు సంభవించును.

ప్రకటన ధరలు:—ఒక నెలకుమాత్రము సాధారణపుట 1-కి రూ॥ 25. 6 నెలలకు అంతకుపైన పుట 1-కి రూ॥ 20. వ్యాసములకు మధ్యపుట 1-కి రూ॥ 30. ఇతరవివరములకు వ్రాసిన తెలుపబడును.

మేనేజరు, భారతి, తపాలపెట్టె నెంబరు 212 మద్రాసు.

# భారతీ ప్రశంస

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు

భారతిపుట్టి యిప్పటికి
    వత్సరమయ్యెను దెల్గువారి ధీ
సారము తీరులన్ బలుకు
    జాడలఁ జిత్తరు వ్రాఁతరీతులన్
నేరిమి పోకడల్ గలిగి
    నెల్లెలఁ జెంగొదవెన్ మనోహరా
కారము మీఱె నింకఁ
    గలకాలము నిట్లభివృద్ధిఁ జెందుతన్.

ఉ. అల్పపు పొత్తులొత్తఁ దెపు
    డుండిన దెల్లను గుంపనంబుగాఁ
జల్పను మాతృదేశహిత
    పత్త్రికలందును ముందు నిల్చి నీ
వు ల్పరమార్థబుద్ధి నెఱపున్
    మెఱమెచ్చులఁ బోఁడు సిద్ధసం
కల్పుఁడు భారతీపతి య
    ఖండ సుఖాభ్యుదయంబు లందుతన్.

# శంకర దివ్యమూర్తి

కొణిదెన బాలకృష్ణయ్య గారు

ప్రాలుగారుచున్న ఫాల దేశంబున
బూదిరేకలు మూఁటిఁ బోల్పరాక
బోమల మధ్యమునందుఁ బొలుపొందు తిలకంబు
చిచ్చుఱకను నేర్చి చెప్పరాక
కుదురుగా మెడ వ్రేలు రుదురాక పేరులు
పాపదండలు నేరు పరచరాక
సంజకెంజాయలఁ జల్లఁ గప్పిన శాటి
పులితోలు వివరించి పలుకరాక
గీ. వలులు మైచాయయును, మిన్ను వాకకాంతి
చందురుని వెల్గు వివరణ సలుపరాక
జటి యనంగను, నెంచ ధూర్జటియనంగ
భవ్యమై పొల్చు, శంకరు దివ్యమూర్తి.

# కడుపుతీపు

వేటూరి ప్రభాకరశాస్త్రి గారు



(మాపటి వేళ)

ద్యోగకార్యములు సూచుకొనుచుఁ గుర్చిపై నిలువఁడు గూర్చుండెఁ
వెంటను బిడ్డలు సందడింపఁ, జెంతఁ దాంబూలమిచ్చుచుఁ గాంతయుండె.
తి సుస్నానసౌభాగ్య మాటలాడు, చిఱుతనిసుఁగుల మురిపముల్ చిత్తమునకు
సన్నతఁగూర్ప నా సుదతి విభుని, మాటపై మాటముచ్చట మరగుటయును.

టపాబంట్రౌతు జాబులఁ గొనివచ్చెను. వానిలో నుద్యోగప్రసక్తములను
డుకుదినములు గాన యాత్రమతో నాతఁ డారసెను. అందొకటి యాత
గ్యత నుగ్గడించుటతో నించుక జీతముపెంపును, మద్రపురమునకు మార్పును,
నుండెను.

చ్చుజీతము పైవారి మెచ్చుకోలు, కొంత సంతోషమును మునుగొలిపె గాని
సుఖముఁగూర్చు నచ్చోటు వెడలమార్చు, టరయ నాతని మెద దిగుల్ నెఱయఁజొచ్చె.
ము నిల్లాలి కాతఁడు చదివిచెప్పె, దప్పకొనరానిదని తను దానిఁ దెలిపె,
క విచారంబు లేగ శోక, ముద్రితాస్యయై యాసాధ్వి ముదలకించె.

మెక్కువే యవును చెన్నపురంబు వ్యయంబు పైపయిం
లాభమేమి? యిహమో పరమో యెదో నాకుఁ గాకుళ
సన్నిధిం బడయఁ జేయుఁడు వేఁడెద; నెల్లవెంట సా
వహ మీపురంబు విడి యావలఁబోవఁగఁ జాలనయ్యెదన్.

మెక్కువే సరియె, చెన్నపురంబుననున్న క్షేమమున్
మల్పమూనని వచింతు రెఱుంగుదు లేకదా! సుఖా
ము సంకటస్థల నివాసము కృత్రిమవస్తుభోజనం
పైతుమోకద యెటు నిది త్రిప్పకొనంగఁ జూడుఁడీ!

టయు.

ముమీఁద మార్చిరి వైటో పడియె, వేతనము హెచ్చుచేసిరి వెల్లితిఁ
; నిఁక నీవో వంటింటివార్తలేవో, పల్కుదును నిర్వహింపఁగాఁ జుల్కగాదు.

గీ. నాకు నీకంటె హెచ్చు చీకాకు గలదు, పని యధిక మింకఁ బయిని రాఁబ
చెన్నపురమందు నుద్యోగ మెన్న దంపి, నమ్మకమను బాక్కీనదె ఖాలి యా

వ. మఱియు.

సీ. అవగాహనస్నానమా! అబ్బెనని ముక్కు, మూసికోవలెఁ గూపమునదిఁ
కమ్మనికూరలా! కలవని తలయూఁప, వలెఁ దిర్వలిక్కేణిపాలము నరసి
చల్లనిగాలియా! చాలుఁ బొమ్మని తల్పు, గడవేయవలె దొడ్డికంపు సోఁ
ఆరోగ్యమా! తక్కువా యేమి యనిపొంగి, పొరలఁగావలెను డాక్టరుల

గీ. భాగ్యభోగ్యాభిలాష మభ్యధికపఱచి, తదుపభోగోపపత్తి దుర్బలతచే న
వస్థఁగూర్చు సామాన్యగృహస్థునకును, జెన్నపురము కాపుర మెట్లు చేర

సీ. చేకూరునో లేదొ శ్రీకాకుళేశ్వర, స్వామిదర్శనమహోత్సవము మరల
లభియించునో లేదొ యుభయ సోమేశ్వర, క్షేత్ర యాత్రా భాగ్యసిద్ధి మ
దొరకునో లేదో మధురవర్తనముగల్గు, తెల్గుగేస్తుల చెల్మితీరు మరల
కలుగునో లేదో సుఖశ్రీదమైనకృ, ష్ణోపకంఠోద్యోగయుక్తి మరల

గీ. సంఘటిల్లునో లేదో ప్రశస్తవస్తు, భరిత మగు నాంధ్రభూమి కాపురము ప
నెవ్వ డెదివచ్చునో యెవ్వఁ డెఱుఁగు నిపుడు, తిరుగ దొరకమాత్ర దక్షిణ

వ. అనుటయు నా యువిద వల్లభుని పలుకుజాడ నిట్లు వాపోయెను.

సీ. ఎన్నఁడు చూతునో యింకొక్కమాటేను, దివ్య కృష్ణాస్రవంతీప్రవాహ
మెన్నఁడు నోఁతునో యింకొక్కమాటేను, శ్రావణ శుక్రవార వ్రతంబు
ఎన్నఁడు విందునో యింకొక్కమాటేను, తేటతేనియయమాట తెలుఁగుమ
ఎన్నడు తిందునో యింకొక్కమాటేను, వాయూరి లంకవంకాయకూర

గీ. ఇంక నెన్నఁడు వత్తునో యీ గృహమున, కీపురము కాపురము సరియే
నాకులమ్మయ్యొ మనసు శ్రీకాకులమ్ము, విడిచి దక్షిణదేశంబు వెడలుటన

ఉ. ప్రాఁకెను సూర్యరశ్మి చొరఁబాఱఁగ నీయక యల్లిబిల్లిగా
నాకులచాటునం గనుల కందఁగనీయక చిట్టిపొట్ల నా
వ్రేకనఁ గాచుచుండె; నెడత్రవ్వపు మవ్వపుఁగాయ; లిప్పు డీ
కాఁకరపాదు వీడి కడఁగా నడఁ నడుగాడ దయ్యయో!

గీ. పయరకూరవేచి పచ్చిమిరెప పండ్ల, నుక్కలించి పోసి యూరనిచ్చి
కొంతగొంత పొగిపి కొను గోఁగుబచ్చడి, చవికి నింక నోరు చివికి లేదు.

---




ల్గాము పడమటిదిశయందు 2500 అడు
గుల ఎత్తుగల దక్షిణ పీఠభూమియందు
శ్రీ పర్వతముల కటకభాగమునందు గల
రాతన పట్టణము. బెల్గాముమండలమునందు
ష్ణ ఘటప్రభ మాలప్రభ నదులు ప్రవహిం
చు భూమిని సారవంతము చేయుచున్నవి.
ప్రాంతమునందు దొరికిన రాగిశాసన
లు కాదంబు లీమండలమును పాలించిన
తెలుపుచున్నవి. చాళుక్యులు 550-760
ను పాలించిరి. తదనంతరము 1250 వరకు
ష్ట్ర కూటులును గోవా కాదంబులును
పాలించినటులు శాసనములు తెలుపుచున్నవి.
తదనంతరము యాదవులు, మహమ్మదీ
యులు, విజయనగర రాజులు, మహారాష్ట్రులు,
మహమ్మదీయులు, మహారాష్ట్రులు, ఆంగ్లేయు
వరుసను పాలనముచేసిరి. బెల్గాము
(...విబ్బది గ్రామములు) పుష్పఫలవృక్షావృతమై
ఆరోగ్యప్రదమైన శీతోష్ణస్థితిని గలిగి నివాస
యోగ్యముగ నున్నది. మామిడిపనస
తోటలు, గులాబి పుష్పవాటికలు, వంశవన
ములు, సస్యశ్యామలశోభితములైన కేదార
ములు బెల్గామునకు శోభను గలుగజేయుచు
న్నవి. మహామారిజాడ్యము ప్రజానాశనమును
చేసినను బెల్గాము తిరిగి కోలుకొని ప్రస్తుతము
...320 ప్రజలను గలిగియున్నది. దుర్గము
జైన హిందూదేవాలయములు దర్శనయోగ్య
ములు. దుర్గమునందును దుర్గప్రాంతములం
దును నాంగ్లేయ పటాటోపమును ప్రకటిం
చుటకు సైన్యముగలదు. బెల్గాము చరిత్రము
సూక్ష్మాకృతిని భారత దేశ చరిత్రమును
తెలుపుచున్నది. రాజవంశములు గతించినవి.
రాజ్యములు మారినవి. యుద్ధములు జరిగినవి.
వృత్తులు మారినవి. మతములు ప్రబలినవి.
భారతసభ్యత్వసంస్కారబీజాంకురములు సజీవ
ముగనున్నవి. ప్రజాహృదయము దుఃఖపరం
పర లనుభవించినను భక్తివిశ్వాస భరితమై
విరాజిలుచున్న విధమును ప్రకృతి సంపదలు,
ప్రజాశీలము వ్యక్తముచేయుచున్నవి.

కాకినాడయందు ఎల్విన్ పేట ప్రజాసం
కల్పబలమునను గాంధినగరమైనది. బెల్గాము
నందు తాలక్వాడ్ విజయనగరమైనది. రెండుస్థల
ములును ననుభవించిన భోగమునంభ్రమమును
గలుగజేయుచున్నది. కాకినాడయందునిర్మింప
బడిన పటమహామంటపము బెల్గామునందమర్చ
బడి సన్మానసంఘమువారి శ్రమను కొంత
తగ్గించినది. ఆమంటపము నావరించుకొని వసతి
కుటీరములు, దుకాణములు, చరకామందిరము,
మహాత్మునిశిబిరము, భోజనశాలలు, సభామం
దిరములు, స్నానశాలలు నిర్మింపబడి కాంగ్రెసు
యాత్రాసేవనముసుఖారాధ్యమైనది. కాంగ్రెసు

మంటపమునకు సింహద్వారము గోపురాకృతిని దాల్చి శిల్పనైపుణ్యమునుగలిగి సుందరముగనున్నది. గోపురనిర్మాణము హిందూ మహమ్మదీయ క్రైస్తవ శిల్పసంయోగమును గలిగి భారతజాతీయ తత్త్వారమును విశదము చేయుచున్నది. సకలమతములకును నాకరమైన భరతవర్షము మానవసౌభ్రాతృత్వమును స్థాపించుటకు గాంధిమహాత్ముని యుపదేశముల నాలకించి పాటుపడుట లోకకల్యాణమునకు శ్రేయస్కరము. గోపురద్వార వివరములను దెలుపగల పటముల సందర్శనము శిల్పి మనోభావమును విశదముచేయుచున్నది. సన్మాన సంఘము ధనాభావమువలనను గోపురనిర్మాణమున కనంగీకారమును దెలిపినను శ్రీయుత గంగాధర దేశపాండ్యగారి యౌదార్యము శిల్పి మనోరథమును సఫలముచేసి విజయనగర శిబిరమున కనిర్వచనీయమైన గాంభీర్యమును శోభను గలుగజేసినది.

బెల్గాము సామాన్యమైన పట్టణమైనను కర్ణాటక సోదరులుచేసిన యేర్పాటులు సలక్షణముగ నున్నవి. నీటి వసతికిగాను చేసిన యేర్పాటులును మలమూత్ర విసర్జనాదులకు జేసిన యేర్పాటులును ప్రేక్షక ప్రతినిధుల సౌకర్యముల కనుకూలముగ నున్నవి. ప్రతినిధులకు గావలసినసామానులు సులభముగను లభించినవి. చరకాశాలను స్థాపించుట మహాత్ముని సంకల్పమున కనుకూలముగనున్నది. స్వచ్ఛందసైనికు లాంగ్ల హిందీభాషలను మాటలాడలేకపోయినను కర్ణాటకులకు సహజమైన వినయస్వభావముతో ప్రతినిధుల సౌకర్యములకుశక్తివంచనలేకను పాటుపడి కాంగ్రెసు యాత్రికుల మన్ననలకు పాత్రులైరి. గాంధిమహాత్ముడు స్వచ్ఛందసైనికుల విన్యాసములను జూచి సంతసమును దెలిపినవిధమును గనుపఱచెడి ఛాయాపటము వేరొకచోటను ప్రచురింపబడినది. కర్ణాటకసోదరుల సరళస్వభావము, వినయప్రవర్తనము, అభిమానాభావము, స్వచ్ఛందసేవకులందును, కాంగ్రెసు అధికారులందును, అశ్వారూఢుడై విజయనగరమునందంతటను స్వధర్మనిర్వహణమునకై సంచారముచేయుచుండిన శ్రీయుత గంగాధరదేశపాండ్యగారియందును, ప్రత్యక్షమగుచు జవియనగరమునందు గూడిన 39-వ కాంగ్రెసు సమావేశము కాంగ్రెసు సమావేశములందు సంస్మరణీయముగ నున్నది.





మహాత్మా గాంధి

39-వ దేశీయ మహాసభాధ్యక్షులు, బెల్గాము



శ్రీయుత గంగాధర బాలకృష్ణ దేశపాండే

౩౯ వ అఖిలభారత జాతీయమహాసభ ఆహ్వానసంఘాధ్యక్షులు, బెల్గాము




మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు

దప్పికలేనివానతఱి దగ్గఱఁజేరి జలంబు లానుఁ డం
చొప్పగ నోరువెట్టి మము నూర్మికరంబులు చాఁచి కోరి యీ
దప్పిక హెచ్చు వేసవిని దవ్వులకుం జని మోము ద్రిప్పి బల్
తిప్పలఁ బెట్టి ద్రిప్పెదు బళీ యిది యెక్కడి యావి గౌతమీ!

ఉ. నీయెడఁ దీరవాసులు వినీతులు గారని కోపగించితో
వేయివెలుంగువేల్పు నిను వేఁపఁగ నాతని కప్పులిచ్చితో
తోయధిఁ జేరు నిన్ను నడుత్రోవ నలంచుట నీరసించితో
యేయదియైన నే మిపుడు హీనతఁ జెందితివమ్మ గౌతమీ!

ఉ. వేలకువేలు లక్షలకు వేపదిలక్షలు జీవరాసు లే
వేళల నిండునందనక వేసవి వేఁడికిఁ దాళలేక నీ
నీళులు త్రాగి జీవనము నిల్పుకొనం జనుదెంచు నుస్సురం
చేలొకొ యింక దూరముగ నేగెదు జీవనదాయి గౌతమీ!

ఉ. చేలకుఁ జెట్లకుఙ్ జలము చేఁదుచుఁ బోయఁగలేక కర్షకుల్
కాలువ లెండిపోయెనని గ్రామనివాసులు కుందుచుండి రి
క్కాలము దుస్సహంబగుటఁ గంఠము లెండఁగ బాటసారులుం
దూలుచు సోలుచుండి రిఁక దూరము పోయెదవమ్మ గౌతమీ!

చ. హితమును జెప్పి రాదిమమునీంద్రులు వేఱొకచోట శర్కరా
యుతమగు పాయసంబయిన నొల్లక నీదరిఁ జేరి నీజలా
మృతమును గ్రోలి యుండుటయె మేలని, యొడ్డులనుండుమమ్మ నీ
గతి నడఁ జాసిపోవుటకుఁ గారణమేమగునమ్మ గౌతమీ!

గీ. కలియుగంబున జనులు దుష్కర్ములగుచు, దయయు సత్యంబు శౌచంబు దప్పియుండు
రపుడు నదు లింకునని చెప్పి రాతపసులె, గౌతమీ! యదియేమయిన హేతువమ్మ?



# లక్షణ గ్రంథ విశేషములు

విద్వాన్, దువ్వూరి వేంకట రమణ శాస్త్రి గారు

## (1) బాలవ్యాకరణము

మన దేశములో నిప్పటికి వెలువడియున్న యాంధ్రవ్యాకరణములలో బాల వ్యాకరణము ప్రణాళికవిషయమున నుత్తమస్థానము నలంకరించునదని యందఱకును దెలిసిన విషయమే. ఈ వ్యాకరణమునకు సుబ్బార్థప్రకాశిక యను నొక వ్యాఖ్య బయలువెడలినది. ఆవ్యాఖ్యను విమర్శించుచు మాగురువర్యులగు శ్రీ జ్ఝల చినసీతారామస్వామిశాస్త్రులవారు పెక్కు వ్యాసములను బరిషత్పత్రికలోఁ బ్రకటించియున్నారు. ఇంకను బ్రకటింపనున్నారు. ఇట్లు ప్రౌఢమునను బండితజనాదరణీయమునగు నీవ్యాకరణమును రచించిన శ్రీ పరవస్తు చిన్నయసూరిగారు మన యాంధ్రులకృతజ్ఞతకెంతయుఁ బాత్రులను వంశము గూడ నేనిపుడు క్రొత్తగా విన్నవింపఁ బనిలేదు. ఈ సూరిగారి చరిత్రము సాకల్యముగఁ బరిషత్పత్రికలో నీ వఱకే ప్రకాశితమై యుండుటచే నద్దాని నిపుడు మరల వివరింపవలసిన యావశ్యకత కానరాదు. బాలవ్యాకరణ కర్తృత్వవిషయమున నీమధ్య మన పండితులలో నొక వివాదము ప్రబలియున్నది. శిష్టు కృష్ణమూర్తిశాస్త్రుల వారికిని సూరిగారికిని విద్యావిషయమున నేదో యొక వాదము జరిగెననియు, నందు వారికిఁ బరస్పరము ద్వేషభావము తటస్థించెననియు, నాసందర్భమున శాస్త్రులుగారు రచించిన హరికారికావళికిఁ బ్రసిద్ధిలేకుండవలయునను నూహతో సూరిగారద్దాని నాంధ్రీకరించి బాలవ్యాకరణమను పేరితోఁ బ్రకటించిరనియు, నీ కారికావళి యెప్పటికేని బయలువడినచో లోకము సంశయించునని సూరిగారు బాలవ్యాకరణపీఠికలోఁ దాము సంస్కృతభాషలో సూత్రగ్రంథ మొకటి కావించినట్లు వ్రాసి తిరిగి గ్రంథాంతమున "మును మదుపజ్ఞంబగు సంస్కృత వ్యాకృతిని సూత్రతతి యొక్క కొంతెం దెనిఁగించి యిట్లు ఘటించితి ....." అని వ్రాసికొనిరనియుఁ గాన నిద్యది యాంధ్రీకరణమాత్రమే కాని స్వతంత్ర గ్రంథము గాదనియుఁ గొందఱు పండితులు తలంచుచున్నారు. ఇట్లు గాక వీరిరువురికిని జరిగిన వివాద సందర్భమున శాస్త్రులుగారే సూరిగారి బాలవ్యాకరణమును జూచి దానికిఁ దగిన ప్రసిద్ధిలేకుండఁ జేయవలయునని తలంచి దానిని గారికారూపమున సంస్కృతీకరించిరనియు, మనదేశములో నాంధ్రగ్రంథములను సంస్కృతీకరించుటకంటె సంస్కృతగ్రంథముల నాంధ్రీకరించుట హెచ్చుగా నున్నందునఁ గారికావళియే మూలగ్రంథమనియు బాలవ్యాకరణ మాంధ్రీకరణమాత్రమే యనియు జనులు విశ్వసింతురను తలంపుతో లోకమును భ్రమపెట్టుటకై యిట్లు వీరు చేసియుందురనియు మఱికొందఱు పండితు లూహించుచున్నారు. ఇట్టి యూహలపై నాధారపడియుండక యీరెండు గ్రంథములను గలిపి విమర్శించినఁగాని వీని పౌర్వాపర్యము నిర్ణయించుటకు వలనుపడదు. కాని పైనిజూపినరీతిని బండితుల కిన్ని వికల్పములు పుట్టుటకు సూరిగారికిని శాస్త్రులుగారికిని వివాదము జరిగినట్లు కింవదంతి యుండుటయే ముఖ్యకారణము. ఈకింవదంతి యథార్థమగునా కాదా యని పెక్కుమంది సంశయించుచున్నారు. కాని వారిరువురికిని వివాదము జరుగుట యథార్థమే కావచ్చును. సూరిగారికి శాస్త్రులవారియందే కాక బ్రాహ్మణజాతియందే ద్వేషభావము కలదని వీరు రచించిన బాలవ్యాకరణమువలననే తేలుచున్నది.

సూరిగారు సిద్ధాంతకౌముదిని సావధానముగ నన్వయనముచేసి సంస్కృత వ్యాకరణ నియమములను

ప్రకరముపై లసత్ప్రణయ బంధనలీలల వింతవింతయ
ల్లికలసాబంగు (?) లొల్కు లవలీలతికాతతు లొప్పచుండగా౯.

చ. తళుకుల జిమ్ముచున్ మరకతంబులు మౌక్తికహారపంక్తులు౯
మిళితములైనయట్ల పసమించినవెన్నెల తేటశాద్వల
స్థలినటియింప భూమిగతస్వర్గమనంగ సజీవరత్నకం
బళమున గప్పినట్లు కనుపట్టె వసుంధర నేత్రపర్వమై.

ఉ. నీలపురాల భాసురమణీరమణీయత లీను నాణెము
త్యాలసరాలనంగ యమునాంబువులన్ సితచంద్రచంద్రికా
జాలము వ్రాలి భావమయ చాలనలీలల మాధురీరసో
న్మీలనకాంతి పుంజముల నీనె ననూన మనోజ్ఞవైఖరి౯.

ఉ. ఫుల్లసిత ప్రసూన నవమోహనసౌరభసంభృతంబు, ల
ల్లలనవీచె మందమలయానిల వీచిక లా స్రవంతి జల్
జల్లునపూలురాల, మృదులాచ్ఛ కుమారతరంగ రాజి రా
జిల్లగ తుంపురుల్ గలయ జిమ్ముచు జాడ్యికి వేడ్క సేయుచు౯.

చ. హృదయసువర్ణపేటి నిదురించెడి భావఫణీశు భోగము౯
కదలిచివైచు నా కుసుమగంధము బీల్చి మదాంధవృత్తిమై
జిదిమిన పూలగుత్తి లొక చేత ధరించి యనల్పకల్పనా
స్పదనవభావభాసురరసాలసమానసలాలసుండనై.

శా. ఉల్లాసంబెసలార బద్యరచనోద్యుక్తుండనై భావపు౯
వల్లి౯ మున్గుచు౯ దేలుచు౯ పదము లన్వేషించుచున్ జొక్కుచో
నల్లంతంబొడగట్టె బాలుడొక డుద్యత్కాంతి శోభిల్ల, పై
జల్లె౯ డెందము జల్లనంగ మురళీసంజాతగీతాంబువుల్.

సీ. నీలదేహమున వెన్నెలనిగ్గు ప్రసరింప, ననమానలావణ్య మంకురింప
హరినీలమణికాంతు లడరించు మోమున, ధవళాక్షియుగళసౌందర్య మొలయ
నరసీటుజాలుడి నిటలతటంబున, కుటిలాలకంబులు కొమరుమిగుల
నరుణాధరంబుపై నటియించు తెల్లని, ముక్కరముత్యంబు మురువుజూప
వామభుజసీమ మోమర వ్రాల్చి యొడమ, కాలికడ్డంబుగా కుడి కాలుపుడమి
పైన నంగుళిమోపెడుపగిది మోపి, విశ్వమోహనముగ నొక్క వేణువందు.

శా. ఆలాపింపదొడంగ వేదగణవేదాంగాళి వేదాంతనా
దాలంకారములైన రాగములు; బ్రహ్మాండోత్కరోద్యత్ప్రభా
జాల ప్రాపణకారణంబులగు తేజస్స్ఫూర్తు లాత్మీయ దృ
గ్జాలోన్మీలనకాంతి చాలనములన్ గన్పట్ట నప్పట్టునన్.

సీ. ఆరోహణావరోహణ నాదములతోడ, నాకాశపథమంటి యవనికిదిగ
జక్కగా రాగంబు సాగుచో హాయిగా, కువలయాంతముదాక గూడిచనగ
వింతగా స్వరములు విసరివేసెడుపట్ల, గాలునిలువక వెఱ్ఱిగంతులిడగ
కళదేరువెలలేని కళలనుజిల్కుచో, మరగికడునార్ద్రమై కరగిపోవ
గీ. నయ్యొ; నవరసములు నాట్యమాడుచుండె; నెన్నిభావంబు లప్పు డున్పన్నమయ్యె
నన్ని భావంబులకు మామకాంతరంగ, మాశ్రయంబయి తా లీన మయ్యె నందు.

గీ. నిర్మలోజ్జ్వల గగనవి నీలిమప్ర, భావిభాసితమైన బృందావనాంత
వీథిబుట్టిన యా కృష్ణువేణుగాన, మలమికొన మారుమ్రోసె బ్రహ్మాండమెల్ల.

చ. ఒకతరి నబ్ధిఘోషము మరొక్కతరిన్ ఘనమేఘ నిస్వనం
బొకతరి జండమారుత రవోద్భటనాద మిఁకొక్కవేళ, పా
వకపరిదగ్ధపర్వత విపాటనభూరి చటచ్చటధ్వని
ప్రకరము లొక్కపట్టున విభగ్నధరాతల కంపనధ్వనుల్.

చ. శుకపికశారికా భ్రమర సూక్తికలాపమనోజ్ఞ గీతికా
ప్రకరములొక్కవేళ, నొకపట్టున మంగళరాగమాలికా
నికరములొల్కు కృష్ణు కమనీయవికస్వర గీతికా ప్రపం
చకమున భూతపంచక నినాదములున్ జెలువొంది మ్రోసెబో.

క. రసమునకు నిలయమై నలు, దెసల విసరి మునరికొనియె దేనియపోనల్
నసుమతి తద్గానామృత, రసపారావారజలతరంగితముఖగాన్.

సీ. గంధర్వభామినీ గానమో యనజాలి, శ్రావ్యమై చెవుల కుత్సవముచేసె
మన్మథుసౌందర్య మహిమమో యనసుంద, రంబయి నేత్రపర్వం బొనర్చె
అమృతరసముకన్న నధికమాధుర్యయు, క్తంబయి జిహ్వకు తనివినొసగ
బాలామణీపరి ష్వంగసుఖంబునా, దనువునకెంతొ మత్తతను దెచ్చె
తావులకు దావలంబైన తావియగుచు, నాసికేంద్రియమునకు నానందమొసగె;
అవల నట్టిట్టిదనియన నలవికాని, తన్మయత కప్పి నాదు చిత్తము హరించె.

# రుక్మిణీ పరిణయము - కూచిమంచి తిమ్మకవి

భమిడిపాటి పెద రామ సోమయాజులు గారు

పదునేడవ శతాబ్దారంభమునం దుండిన యాంధ్రమహాకవులలో కూచిమంచి తిమ్మనామాత్యుఁ డొకఁడు సుప్రసిద్ధుఁడు. భాషాసేవయం దీతఁడు కేవలము నూతనమార్గ మవలంబించి నీలాసుందరీపరిణయము మున్నగు నచ్చతెనుఁగుగ్రంథములను రచించినవాఁడు. ఈతని కృతిగ్రంథములలో నెల్ల సర్వలక్షణ సారసంగ్రహమను నొకలక్షణగ్రంథమును, నచ్చతెనుఁగు రామాయణ మొకటియు, ముఖ్యమయినవి. గ్రంథప్రాశస్త్య మెట్టులున్నను, బహుళగ్రంథనిర్మాణమే యొక మహాకవిలక్షణ మగునేని, యీతిమ్మనామాత్యుఁడును మహాకవి యనదగినవాఁడు. ఇమ్మహాకవికి సంబంధించిన వివిధవిషయములను బ్రహ్మశ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు తమ యాంధ్రకవులచరిత్రలో సవిస్తరముగా వివరించియున్నారు. కాన నాయప్రస్తుతాంశముల నిట విడచి, యీతనికృతి యగు "రుక్మిణీపరిణయము" నాశ్రయించి నాకు దోచిన యొకటి రెండు విషయములను నే నీవ్యాసమున జర్చింపబూనుకొంటిని.

మోక్షప్రాప్తికి కేవల భక్తిమార్గమే ముఖ్యసాధనమని యేగ్రంథ ముద్ఘోషించుచున్నదో, ఎద్దాని శ్రవణమాత్రమున నెట్టిదుర్మతియైనను భగవద్భక్తి సాపేక్షపరవశుఁడగుచుండునో, నేపురాణాంధ్రీకరణ మహాభాగ్యవిశేషమున సహజపాండిత్యశోభితుఁడగు బమ్మెరపోతనామాత్యుఁడు దనజన్మసాఫల్యముం బడయఁజాలెనో, యట్టి శ్రీమదాంధ్రమహాభాగవత పురాణరాజము నెఱుంగని వారక్షరాస్యులగు నాంధ్రులలో నరుదు. ప్రస్తుత విమర్శనీయమగు నీ "రుక్మిణీపరిణయ" కథాభాగ మాభాగవతపురాణాంతర్గత దశమస్కంధములో సుమారు నూరు పద్యములలో సంగ్రహముగా జెప్పబడి మన తిమ్మనామాత్యుని రచనాపాటవంబున మిగుల విస్తృతికెక్కి యీయయిదాశ్వాసముల మహాప్రబంధరూపముం గాంచినది.

ఆంధ్రభోజుఁడని విఖ్యాతిఁగన్న శ్రీకృష్ణరాయలకాలముననే మనయాంధ్రభాషలో స్వతంత్ర ప్రబంధరచన ప్రారంభింపబడెను. ఈకాలపుకవులు తమతమ రసపోషణమే ప్రధానలక్ష్యముగా నుంచుకొని, రామాయణ మహాభారతాది పురాణములనుండియో, తదితరసంస్కృత గ్రంథములనుండియో స్వల్పముగా కథను గ్రహించి, స్వతంత్రప్రబంధరచన చేయసాగిరి. ఈకాలపుకవులలో నొకరగు మాదయగారిమల్లనకవి తన "రాజశేఖరచరిత్రము" న

క. చెప్పదగుఁగవితరసముల్
చిప్పిల నప్పప్పబళిబళీ యన లేదా
యొప్పుడు చెప్పక యుండుట
యొప్పగుసుమీ సుకవి యెంతయుఁ జతురుం డొకో!

అని యిట్లు కావ్యలక్షణములను వివరించియున్నాఁడు. ఈకవులెల్లరును సంస్కృతభాషలో నధిక పాండిత్యము గలవారగుటచే వారికావ్యములే నిదర్శనములు. ఈకాలములో బుట్టిన మను, వసుచరిత్రాది ప్రబంధములే మనయాంధ్రభాషలో సాహిత్యభూషణములుగ నెన్నబడుచున్నవి.

ఇట్లు ప్రబంధరచన ప్రారంభింపబడినతోడనే, లక్షణవేత్తలగు కవులు మహాకావ్యలక్షణములను వివరించు లక్షణగ్రంథములను నెలకొల్పసాగిరి. ఈ లక్షణవేత్తలలో నొకఁడగు భట్టుమూర్తి మహాకవి తన నరసభూపాలీయములో:

తే. ఇంకఁ గావ్యప్రభేదంబు లేర్పరింతు
నరసు నష్టాదశవిశిష్టవర్ణనములు
గలుగవలయు మహాకావ్యతిలకమునకు
నెలమిఁ దన్నామధేయంబు లెట్టివనిన.

క. పురసింధునగర్తుశశీ
సరసీజవనమధురతిప్రసంగవిరహముల్

కావల పగంధపవన కోకిలమరాళ
కీరసారంగముల వ్రాసి చేరి చెలులు.

(వసు. ఆ 3. ప 169)

తే. కంవలిరుసెజ్జ రచియించి యందు నొక్క
మేలిలవలీదళంబుపై మృగమదమున
కుసుమశరుని వ్రాసి వామభాగమున రతిని
నిలిపి వ్రేవలఁ దన్ప్యలంబుల లిఖించి.

(రుక్మి. ఆ 3. ప 61)

ఈమన్మథపూజా విషయికవర్ణన మాద్యంతమును గేవలము వసుచరిత్రములోని మన్మథపూజావర్ణనము ననుసరించియే వ్రాయబడినది. రామరాజభూషణుని యీవర్ణనమునకు మనతిమ్మకవివర్ణనము ప్రతిబింబమనియే చెప్పవచ్చును. పయిన నుదహరింపబడిన పద్యముల నరసినచో నందు మనతిమ్మకవి పద్యములకన్న వసుచరిత్ర పద్యములే మిగులసరసములుగను, భావసంభితములుగను, నున్న వనుసంగతి చదువరులకు బోధపడగలదు. ఇక విజయవిలాసములోని యనుసృతులనుగూడ నొకటి రెండు మాత్రము చూపెద.

ii విజయవిలాసములోని యనుసృతులు.

ఉ. పున్నమరేలఁ దప్పరముపొంతిని పో శిఖరాళి దాకి
క, ఛిన్నగతిన్ సుధారసము చిందిపయిం దిగు
వాఱ వంతనుం,డి చ్చెన్నల పన్నగిల్లు నది నిక్కము
గాదని రేని యూపదా, ర్వన్నెపసిండిమేడలపఁ రాఁబ
సరయ్యె మిల ఖొగవావమాల్ .

(విజయవిలాసము. ఆ 1. ప 72)

ఉ. ఆనగరంపుద్రోవను దినాధిపుఁ డేఁగుచు నారికడ్డమై
పూనికమున్న కోటఁగని పోవఁగ లేకయురాలు మేడలం
దా నటు దిడ్డునాటిచనెఁ దన్యముగాదని యంటిరేని
యా, భానుని ద్వాదశాత్ముఁడని పల్కఁగఁ గారణ
మేమి నిచ్చలున్.

(రుక్మి. ఆ 1. ప 43)

సీ. మకరకేతనుఁ గూర్చి మకరికాలతలు నీ
చెక్కుల వ్రాయంగ మెచ్చుకొంటేఁ
గుసుమాకరునిఁ గూర్చి కుసుమమాలికలు నీ
వేనలి దుఱుమంగ వేఁడుకొంటె
గంధవాహనుఁ గూర్చి గంధసారంబు
నీకుచ్చులఁబూయంగఁ గోరుకొంటె
మృగలాంఛనునిఁ గూర్చి మృగమదంబున నీదుఁ
దిలకంబు దిద్దఁ బ్రార్థించుకొంటె
నిన్ను వరియించునప్పుడే యన్ని నేరు
వాఁడనని మున్ను శృంగారవనములోన,
నలపెళ్ళిఁగి రేలుకోగదే కలికి యనుచు
గేలి సేయించె నమ్ముద్దరాలి నపుడు.

(విజయవిలాసము. ఆ 2. ప 82)

సీ. లఁన నీకలుద సబ్బులపై నిలువఁగోరి
తమిక్తమొగ్గలు నిరంతరము నోచగి
తరళాక్షి, నీసుధాధరము గ్రోలఁగఁ గోరి
తియ్యనిజాంటీగ లేచె లోపఁగ
చెలువ నీలేతఁనవ్వులు గనుంగొన గోరి
రమణ కర్పూరహారతు లొసంగి
యెలనాఁగ నీముద్దుఁబలుకులు వినఁగోరి
మధురవాక్యములఁ జిల్కలు నుతించి
పంచనము లేక యిష్టదైవంబు నిల్లు
పూజ గావించినాఁడ నీపొందుఁగోరి
జాగుసేయకుఁగఁ దగదింకఁ జలముమాని
........................మన్మథసన.

(రుక్మి. ఆ 5. ప 117)

ఇట్టియనుసృతుల నింకను నెన్నియేని జూపవచ్చును

పూర్వకవికృత కావ్యములలోనయితే నిట్టి యనుసృతు లుండకపోలేదు. ఆంధ్రకవితా పితామహుండనఁ బరగు అల్లసాని పెద్దనామాత్యుని "స్వారోచిషమనుసంభవము" లోని వర్ణనములును కథపట్టులును, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని శృంగార శాకుంతలమునను, శ్రీనాథమహాకవి కృత శృంగారనైషధమహాకావ్యమునను నెక్కువగా గానబడుచున్నవి. అటులనే వసుచరిత్రములోని వర్ణనములకును వసుచరిత్రవర్ణనములపోలికలు గలవు. ఈయా గ్రంథమునకేల, పూర్వకవుల గ్రంథము లన్నిటిలోను నిట్టియనుసృతులు గానబడుచునేయున్నవి. చూడంబోడ నీయనుకరణముగూడ నొక కవిసమయమువలె

చ. మనమునఁ గొన్న నెవ్వగల మాన్పి ఘటింతురు కావ్య
సమ్మదం, బనఘకథాముఖంబున హితాహితబోధ
మొనర్తురింపుగా, గనుఁగొనుకంబె నద్భుతముగా
నెఱిఁగింతు రతీంద్రియార్థముల్, ఘనమతు లెల్లవారికి
నకారణబంధులు గారె సత్కవుల్.

ఇట్టికావ్యములవలన గవికిని నందుకీర్తింపబడిన వారికిని గూడ చిరంబగు యశం బబ్బగలదు.

పయిన వివరింపబడిన సత్కావ్యలక్షణము లీ "రుక్మిణీపరిణయము"న నెంతవరకు పాటింపబడెనో పరిశీలింతము. ఇందు నాయికామణియగు రుక్మిణీరమణి స్వరూపస్వభావాదులను గవి యెంతచక్కఁగ వర్ణించినాఁడో చిత్తగింపుడు! నీతిదాయకమును, భక్తిరసభరితమును నగు నీపతివ్రతామణిపావనచారిత్ర మంగనామణు లెల్ల ననుసరణీయమై యుండవలెనుగదా! అట్టియీమె శ్రీకృష్ణునియందు బద్ధానురాగయై, మోహాతిరేకంబున శయనంబున నిద్రవిడచి, రోదింపసాగెనదట!

(రుక్మి. ఆ 2. ప 76,77,78 చూడుఁడు.)

మానవతులగు మానినీమణుల లక్షణ మిట్టిదియే కాఁబోలు. ఎట్టికులటకైన నిట్టి మనోభావము లుద్భవించునా! ఈమెకు కామోద్రేకమే ఘనముగా నటుగాని మానముపై దృష్టియే లేదు. శ్రీకృష్ణుడు "మదనకళాతంత్రకోవిదు"డనియే యీమె వరించినదిగాని యతడు పరమపురుషుఁ డను పవిత్రభావముతో గాదు. ఈపాత్రవర్ణనమున తుదవరకును నీస్వభావమే స్పష్టముగా గానబడుచున్నది. రుక్మిణి విరహార్తిం జెంది ధైర్యంబుసడల, "సకలసంతాపశాంతిహేతుక మటంచు, హరిపదధ్యానలాలసయగుచు" వినసహింపరానిపలుకులఁ బలికినదట!

ఆహా! యేమి యీరీతి యీశృంగారరసవిజృంభణము! వినసహింపరాని యంశములను హద్దుమీరి వర్ణించినాడు. ఉత్తమపాత్రములయందు నీచస్వభావమును గనుపరచిన యీకవిపుంగవుని మనమెంతని గొనియాడ గలము! ఈతడు తనగ్రంథమును శృంగారరసనిలయముం గావింపనలచి, తుదకు శృంగారాభాసముం గావించినాడు. శృంగారవిషయములో నీకవి యున్నతములగు భావములు గలవాడుగాడు. తుచ్ఛశృంగారమే రసరాజమగు శృంగారరసమని యీకవి భావించియున్నాడు. అరయనరయ నిట్టియుత్తమపాత్రములయం దతినీచస్వభావమును గనుపరచిన మనకూచితిమ్మకవికన్న నీచపాత్రములకు దగిన నీచస్వభావమునే యెంతయో సొగసుగ వర్ణించిన శశాంకవిజయగ్రంథకర్తయగు శేషము వేంకటపతియు, శుకసప్తతికారుఁడగు కదిరీపతినాయకుఁడును, నెన్నియోరెట్లధికులని చెప్పవలసియున్నది.

ఇట్టి నీపాత్రమును భక్తాగ్రేసరుండగు బమ్మెర పోతనామాత్యుఁ డెంతరమ్యముగా వర్ణించినాడో చిత్తగింపుడు. ఈమె గుణవర్ణనమును, నీమెకు శ్రీకృష్ణునిపై గల ప్రేమాతిశయమును నీతఁ డీదిగువపద్యమున నెంత చక్కఁగ బ్రదర్శించినాడో పరికింపుడు.

సీ. ఏనీగుణంబులు కర్ణేంద్రియంబుల సోఁక
దేహతాపంబులు దీఱిపోవుఁ
నేనీశుభాకార మీక్షింపఁ గన్నుల
కఖిలార్థలాభంబు గలుగుచుండు
నే నీచరణసేవ లే ప్రొద్దు సేసిన
భువనోన్నతత్వంబుఁ బొందఁగలుగు
నేనీలసన్నామ మే ప్రొద్దు భక్తితోఁ
దలఁచిన బంధసంతతులు వాయు
తే. నట్టినీయందు నాచిత్త మనవరతము
నచ్చియున్నది నీయాన నానలేదు
కరుణఁ జూడుము కంసారి! ఖలవిదారి!
శ్రీయుతాకార మానినీచిత్తచోర."

శ్రీకృష్ణుఁడు సర్వలోకారాధ్యుఁడగు సర్వేశ్వరుం డనుపూజ్యభావముతో నీమె వరించినదిగాని, మనతిమ్మనార్యుని రుక్మిణివలె నాతఁడు "మదనకళాతంత్రకోవిదు" డను నభిలాషచేగాదు. ఈమె ప్రేమ చాలపవిత్రమయినది. తుచ్ఛములగు విషయవాంఛల కిట దావులేదు. ఈమె మనోభావములా పరమపావనములు; చర్యలా, సకలనారీలోకకళ్యాణప్రాప్తికారణంబులు. ఇంద్రియ సుఖములకొరకుగాక, కేవలము భక్తిరసభరితమగు మనంబుతో నీమె శ్రీకృష్ణుని వరించి, కర్మబంధములం బాసి ముక్తిం జెందగోరుచున్నది. ఈపాత్రవర్ణనమునకును, పయిన నుదహరింపబడిన మనతిమ్మకవి వర్ణనమునకును నెంతయోవ్యత్యాసమున్నది. ఈకవిపుంగవుని వర్ణనాకర్ణన

మున మానవహృదయసీమల పావనభక్తినదీప్రవాహములు ప్రవహించి, యానందానందతరంగపరంపరలు లేచుచుండును.

శృంగారప్రబంధములలో జుగుప్సాకరములయిన యంశములను మితిమీరి వర్ణించుటలో నల్లసాని పెద్దనామాత్యుడే మొదటివాడు. ఇటీవలి ప్రబంధకవులెల్లరును నీదురాచారమునే యవలంబించి, తమగ్రంథములను పచ్చిశృంగారముపాలు గావించిరి. నే నిట్లంటినని చదువరులలో జాలమందికి నాపై నాగ్రహము గలుగవచ్చును. అట్లని నా యభిప్రాయమును దెలియజెప్పకుండుట పాడిగాదు. ఈ పెద్దనార్యకృతి మనుచరిత్రమును నిష్పక్షపాతబుద్ధితో బరిశోధించినయెడల నాయీ వ్రాత సత్యమున కంతదూరముగాదని వారికి విశదముకాకపోదు. మరియు నీ సందర్భములో, సుప్రసిద్ధవిమర్శకులగు బ్రహ్మశ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు వ్రాయించిన వాక్యరత్నములు నాయీయభిప్రాయమును బలపరచుచున్నవి. వీరు తమ "అల్లసాని పెద్దనార్యకవిత్వతత్త్వ"మను వ్యాసములో నిట్లు వ్రాసియున్నారు. "మన పెద్దనార్యుడు శృంగారరసప్రియుడే కాని, దాని నేపలువిధముల బాడుచేసినవాడు. పచ్చిశృంగారమును హెచ్చుగా వర్ణించినాడు. నిక్కముగ శృంగారమింతని గ్రంథమున లేదు. ఈతనిని మార్గదర్శినిగా జేసికొని మనకవులు మనవాఙ్మయమును బచ్చిశృంగారరసభూయిష్ఠము గావించిరి." అట్లు మనుచరిత్రములోని శృంగారవర్ణనముల ననుసరించి తమగ్రంథములను బచ్చిశృంగారముపాలు గావించినైన యాంధ్రమహాకవులలో మనయీతిమ్మకవి ప్రథమగణ్యుడు. ఈత డిమ్మహాప్రబంధమును పీఠికాపురనివాసియు, దనకిష్టదైవమును నగు కుక్కుటేశ్వరున కంకితము గావించి కృతార్థుడాయెను. ఈగ్రంథము కృతినంది యద్దేవతాసార్వభౌము డెంత యానందించెనో కాని, అసీతిదాయకములగు నిందలి శృంగారవర్ణనములు నాకుం బలె జదువరులను నేవ బుట్టింపక మానవు. ఎంతశోధించినను నాకుమాత్ర మిందుత్తమ శృంగారప్రబంధముల నుండదగిన యుత్తమ శృంగారరస మగపడుటలేదు.

పయిన నుదహరింపబడిన యసభ్యవర్ణనములతో తృప్తిజెందక తుదకీతడు సంభోగవర్ణనమును గూడ విరివిగా గావించి దనగ్రంథమును శృంగారరసార్ణవము గావించినాడు. రుక్మిణీమనోభావ ప్రకటన సందర్భములోనయిన నీవర్ణనము చేయబడియేయున్నది. నవవధూవరులశయనంబులలో నప్రీతికరములగు నూహ బుట్టించు వ్రీడాకరమగు నీవర్ణన ముత్తమప్రకృతులవిషయమున నెన్నడును జేయరాదని పూర్వలాక్షణికులెల్లరును శాసించిరి. మనకవిమాత్ర మీనియమములను పాటించినవాడు గాడు.

ఇందు కుపోద్ఘాతముగా సఖీజనలాలితయై కేళీమందిరప్రవేశ మొనర్పబోవు రుక్మిణికి మనకవి యెట్లు బుద్ధులను గరపించుచుండెనో చూడుడు:

సీ. ప్రియునియొద్దకు నీవె చిరచిగ నరుగక
కలన నొక్కెడ నిల్వవలయుఁ జుమ్మ
చెలువుఁడు దమకించి చేపట్టి తిగిచిన
దెనఁగుదు వెక్కుడుఁ జనెదు సుమ్మ
పతి తనతురువుల పై వసింపుమటన్న
నొదిగికూర్చుండుట యొప్పుఁజుమ్మ
విభుఁడు నన్నపురంపువిడె మొసంగిన సిగ్గు
పడక కైకొనుటయె పాడిసుమ్మ
సరసు......సంభ్రమించి
బిగికౌఁగిటఁ గదియించి చిగురుమోవి
యాని వలపూని యిక్కువ లంటునపుడు
విసువక మెలంగవలయుఁజూ పసిఁడిబొమ్మ!
(రుక్మి. ఆ ౮, ప 108.)

ఇట్టిసందర్భముననే విజయవిలాసములో సుభద్రకు చెలులు బుద్ధులు గరపినట్లు చేమకూర వేంకటకవి రచియించిన యీదిగువ పద్యమునకు బ్రతిబింబముగా మనకవి యీపద్యమును రచియించినాడు చూడుడు:

సీ. ప్రియముతో రమ్మనిపిలిచినఁ జేరఁబో
యెదవుగా కూరకుండెదవు సుమ్మ
చెంతఁ గూర్చుండఁగఁ జేసూపఁ గూరుచుం
డెదవుగా కూరకుండెదవు సుమ్మ
విడెము చేతి కొసంగ వినయంబుతోడ నం
దెదవుగా కూరకుండెదవు సుమ్మ
మధురోక్తి వినఁగోరి మాటాడ మాఱువ
ల్కెదవుగా కూరకుండెదవు సుమ్మ.

గీ. కాక విభుఁడైన గొంతసిగ్గరితనంబు
గడలుకొనియున్న గ్రక్కునఁ గడకురాక
చిక్కుఁగ నొకింతసే పటుసముత్సుకమున
నిలువుమీ రత్నపాంచాలి! చెలువుమీఱ.

(విజయవిలా. ఆ 3. ప 198)

ఈపద్య మెంతసరసముగనున్నదో పయిన నుదహరింపబడిన ముక్తిముక్తకవిపద్య మెంతవిరసముగ నున్నదో, యీ రెండుపద్యముల కడరెండుపాదములం దిలకించిన జనులకు తెలియఁబడును.

ఈవిజయవిలాసకృతికర్తయగు చేమకూర వేంకటకవి నిరుపమానమయిన కవితాశక్తి గలవాఁడు. ఆపదముల కూర్పును, నాయనమాన భావనాశక్తియు, నాప్రతిపద్యరసాస్పదంబగు కవితామాధురియు, నీతని కలవడిన ట్లితరుల కలవడనేరవని నిశ్చయముగా జెప్పనగును. ఇంతటి యసాధారణప్రజ్ఞావంతుఁడయ్యు, నీతఁడును మితిమీఱి శృంగారవర్ణనములం గావించి తనగ్రంథమును విపరీతశృంగారముపాలు గావించుట మనదౌర్భాగ్యమే కాని, యీతనిదోషము గాదు. ఈవిజయవిలాసకృతిభర్తయగు రఘునాథరాయల శృంగారరసాభిరతియే యీవిపరీతమునకు మూలము. రాజాశ్రయము లేనిదే కవిత యభివృద్ధి నొందనేరదుగదా! గాన నప్పటిప్రభువుల యభిరుచి ననుసరించి, యాకాలపుకవు లెల్లరును, రసపోషణమునకును ప్రాధాన్యంబునకును, శృంగారరసమే ముఖ్యమనియెంచి, తమగ్రంథములను పచ్చిశృంగారరసభూయిష్ఠములు గావించి వ్రాసిరి. ఈగ్రంథములలో, శేషము వేంకటపతికృత శశాంకవిజయమును, ముద్దుపళనియను వారాంగనచే రచియింపబడిన రాధికాసాంత్వనమును, నీచుచ్ఛశృంగారరసవర్ణనమున నగ్రస్థానము గైకొనియున్నవి. ఈకావ్యకర్తల రచనాకౌశలము సంస్తవనీయమై గంగాంబుఝరీప్రవాహంబువలె ననర్గళధార గలిగియున్నను, నందలి కథానియమము లసహ్యకారణంబులయి దుర్నీతికమూలము లగుటంజేసి, యీగ్రంథములు విసర్జింపవలసిన వాయెను. ఈశేషము వేంకటపతి దనపాండిత్యమును, ననర్గళధారయు, నీతారాశశాంకవిజయ కృతిమూలమునగాక, మఱియొకవిధంబున వినియోగపఱచెనేని యీసారస్వతము మిగుల ధన్యతం గాంచియుండును. ఈగ్రంథములం జదువువారల కెల్లరకును "నీతిపథమార్గుండైన భ్రష్టుండుం బోలె, మద్యపానవ్యభిచారాదిమాలిన్యంబులకు సందుగొందులయందు గవిత పతితకావలసివచ్చెగదా యని పరితాపము కలుగకమానదు."

నీతిబోధయే కావ్యప్రయోజనము. కామాదిదుర్గుణమాలిన్యంబులకు మానవమనస్సుల జ్ఞానకళలం బ్రసరింపజేసి, వానిని పవిత్రములుగను కలసపన్నములుగను, జేయగల సామర్థ్యము కావ్యమునకే కలదు. సత్కావ్యపఠనప్రభావమున మానవులకు విహితకర్మలయందు ప్రవృత్తియు నిషిద్ధకర్మలయందు నివృత్తియు గలుగుచుండును. కావుననే కావ్యములలోని వర్ణనములును, బోధనలును నందు ప్రతిపాదింపబడిన సిద్ధాంతములును సత్యమునకును, నీతికిని, వ్యతిరేకముగనుండరాదని యాలంకారికులు సిద్ధాంతీకరించిరి. దుర్నీతిదాయకములగు దుష్టగ్రంథములను జదువుటవలన హృదయమునం దపవిత్రభావము లుదయించుననుటకు సందేహము లేదు. నీతిదాయకములగు గ్రంథములను జదువునప్పుడు, హృదయము సద్భావపూరితమగుననుటలనే, అనీతిదాయకములగు గ్రంథములను జదువుటవలన, నీచభావపూరితమగుననుట వింతగాదు. పయిన పేర్కొనబడిన శేషము వేంకటకవికృత శశాంకవిజయములోని కథయును, వర్ణనములును, నీతిబాహ్యములుగ నుండుటచేతనే కదా యాగ్రంథమును కవులచరిత్రకారులు నిందించి వ్రాసిరి. ఈసిద్ధాంతము ప్రకారము మనయాతిమ్మనామాత్యుని "రుక్మిణీపరిణయము"గూడ విషపుష్పమువలె బరిత్యజింపవలసియున్నది. దుర్నీతికాలవాలమగు నిందలి శృంగారవర్ణనము పాఠకులను దుర్మార్గగాములం గావింపుచున్నది.

పూర్వలాక్షణికుల మతానుసార ముత్తమపురుష నాయకత్వగౌరవముగల యుత్తమకావ్యములలో సంభోగవర్ణనము లుండరాదని యీవఱకే మనవిచేసియున్నాను. అయినను కొందరు నవనాగరికులు మాత్రము లోకసామాన్యమునకు సుబోధము గాకుండునట్టుల సంస్కృతదీర్ఘసమాసములతో గావింపబడిన నదియొకతప్పుగా దనుచున్నారు.

(రుక్మి. ఆ 5. ప 115,119 చూడుఁడు.)

మనతిమ్మకవి గావించిన సంభోగవర్ణన ముత్తమదేవతాసంబంధ మయినది. మూఁడులోకములకును తల్లి



బాబు రాజేంద్ర ప్రసాదు
స్వదేశ వస్తు ఖద్దరు ప్రదర్శనోత్సవ ప్రారంభకులు



కట్టమంచి రామలింగారెడ్డి
భారత విద్యార్థి మహాసభా అస్పృశ్యత మహాసభాధ్యక్షులు



కెప్టను బి. శ్రీనివాసమూర్తి
ఆయుర్వేద మహాసభాధ్యక్షులు, బెల్గాము



సర్ శంకరన్ నాయరు
భారత సంస్కరణమహాసభాధ్యక్షులు, బెల్గాము



ఏ. రామస్వామి మొదలియారు
భారత బ్రాహ్మణేతర మహాసభాధ్యక్షులు, బెల్గాము



డి. కే. భరద్వాజ
ప్రచురణశాఖాధికారి,
గ్రంథాలయమహాసభ సహాయనపంఘాధ్యక్షులు- బెల్గాము

దంప్రతులయిన రుక్మిణీ శ్రీకృష్ణులను గూర్చి యిట్టివర్ణనము కావించుటత్యంతానుచితముగదా! అందుచే నది కేవలము పరిహరణీయమని నేను వేరుగ చెప్ప నవసరము లేదు. అట్టిచో నీత డీనవనాగరికుల నియమములైనను చాటింపక యెల్లరకును సులభముగాబోధపడునట్టుల తేటతెనుగు మాటలతో, బట్టబయలుగా వర్ణించి తనరసగ్రహణ పారీణత సువ్యక్తము గావించినాడు. వినసహింపరాని విషయములను మర్యాద నతిక్రమించి యిట్టుల విపరీతముగా వర్ణించిన, రస మూసువారికాదు నేమోకాని, రసికులకుమాత్ర మసహ్యకరముగనే కాన్పించును. ఈయనుచితపు వర్ణనము లే లేకున్న నీకావ్య మెంతయో సరసముగ నుండియుండును.

ఈకూచిమంచితిమ్మనామాత్యు డాంధ్రలోకమున జాలసుప్రసిద్ధమహాకవిగా నెన్నబడుచున్నాడు. కవుల చరిత్రకారు లగు బ్రహ్మశ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగా రితనిని ప్రాథమికవులలో జేర్చియున్నారు. కవిత్వవిషయములో నీతని కెన్నియో రెట్లధికుడని చెప్ప దగిన శేషము వేంకటపతికృత తారాశశాంకవిజయమును గర్హించివైచియు, "నీరుక్మిణీపరిణయము"ను మన పంతులుగారు నిందింపకుండుట కేమిహేతువో నే నూహింప జాలకున్నాను. ఇతరసుగుణము లెన్నియున్నను, నసీతికరములగు వర్ణనములతో నిండియుండిన యీప్రబంధము పెద్దమనుష్యుల కించుమాత్రమును పఠనయోగ్యము గాదని నాయభిప్రాయము. విమర్శనీయమగు గ్రంథముయొక్క విలువ ననుసరించియే విమర్శనమునకు గౌరవము గలుగుచుండును. నన్నయతిక్కనాదిమహాకవి నిర్మితములయి సర్వలక్షణసమగ్రములయియున్న మహాభారతాద్యుద్గ్రంథములను విమర్శించినయెడల విమర్శకునకు మన్నె కెక్కును. సువిమర్శకు డట్టిగ్రంథములయందలి సుగుణములను గ్రహించి యభినందించి, యాగ్రంథకర్తల యత్యద్భుతకల్పనాకౌశలమును, నిరుపమానవాక్ప్రౌఢియు, సమయోచితరసపుష్టియు, కథాసంవిధానచమత్కారమును, ప్రపంచమునకు దెల్లముగావించి, గ్రంథకర్తలకు చిరంజీవయశంబబ్బజేయును. జ్ఞానదాయకములును, నీతిబోధకములును నగు నిట్టి సత్కావ్యములే విమర్శనయోగ్యములు. మన తిమ్మనార్యుని యీ "రుక్మిణీపరిణయము" బోలిన గ్రంథములన్ననో, దుర్నీతికాలవాలములగు దుష్టగ్రంథములుగావున విమర్శనయోగ్యములు గావనియు, కేవలము పరిహరణీయములనియు, నా యుద్దేశము.

గ్రంథవిమర్శనము చాలనిష్ఠురమయిన కార్యము. విఖ్యాతకవులగ్రంథములలో దోషము లున్నను లోకు లొప్పుకొనరు. జంకుకొంకులకు లోనయి విమర్శకు డా దోషములను వెల్లడిచేయకున్న నిజముగ సారస్వతాభివృద్ధి గానేరదు. "ప్రమాదో ధీమతామపి" యనునట్టుల సుకవులగ్రంథములలో నయితము దోషము లుండకపోవు. ఈసందర్భములో సుప్రసిద్ధాంధ్రకవిమూర్ధన్యులగు బ్రహ్మశ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులుగారి యీదిగువ పద్యరత్నమును మనము మరువరాదు.

క. తనమొగము దనకు నగపడ
దనువుగ నద్దమునఁగాక యటులనట మహా
ఘనుడైనను గవి యొరుచే
తన తెలిసికొనగనగును తనతప్పొప్పుల్.

విమర్శనమూలముననే సుప్రసిద్ధకవుల దోషములు లోకులెఱుంగుటయు, గవికిగల నిజమయినమహనీయత పైకివచ్చుటయు తటస్థించును. అట్లుగాకున్న నీదోషముల నుగూడ గుణములుగనే భావించి వానిని సామాన్యము లోకు లనుసరింతురు. ఇది చాల యనర్థహేతువు గాన విమర్శకుడు ఆగ్రంథములలోగల దోషములను బైటబెట్టి సారస్వతాభివృద్ధికి దోడ్పడవలయును. అట్లని దోషముల నెన్నుటయే విమర్శకునిపనియని నాయభిప్రాయము గాదు. గుణాగుణనిరూపణమే విమర్శనము. గుణదోషములను రెండింటినిగూడ నిష్పక్షపాతబుద్ధితో బహిరంగము గావించి, గ్రంథముయొక్క నిజమయినవిలువను నిర్ధారణము చేయగలప్రావీణ్యమే విమర్శన మనబడును. ఇట్టి విమర్శనముచే సారస్వతాభివృద్ధికి దోడ్పడగలదు.

సారస్వతాభివృద్ధికి సత్కావ్యనిర్మాణ మెంతయావశ్యకమో దానివిమర్శనమును నంతయావశ్యకమయినది. మనయాంధ్రభాషలో నీవిమర్శనాభాగము చాల తక్కువ. అయినను కొలదిలక్షణగ్రంథము లయినను, నిజమయినకవితాసార మెట్టులుండవలయునో నిరూపించుట లేదు. పాశ్చాత్యభాషావేత్తలగు విద్యాధికులీకొఱంత దీర్చవలసియున్నది. స్వదేశస్వభాషాభిమానములు మెండుగనున్నయిక్కాలమున నీవిషయమయి నేనువిశేషముగ వ్రాసి మనయాంధ్రసోదరులను బురికొల్పవలసినయవసరము లేదు.




ఉమర్ అలీషా గారు

లేఖినీ నీదుసౌందర్యలీలఁ గాంచ
కలమ! నీసౌమ్యరూపవైఖరులఁ గాంచ
నేదియో చెప్పరానియామోదవార్ధి
పొంగి పొరలుచు వచ్చి నాముందునిలుచు
అందు నే నొకనావనై యుందు నాదు
హృదయము రసార్ద్రమైపోవు నేదో జ్యోతి
వచ్చి నానావలోఁ జొచ్చి, బహుదినాలు
గల మహాగాఢతమసంబు, వెలికిఁ ద్రోయు
నీవు నాజ్యోతికంబమై నిలిచియుందు
వాసరంజ్యోతికీనీడనైన నిడదు
అన్నియును తానెయైఁ నాకు దెన్నొసంగు
భావమను మారుతము వీవ నావ బయలు
దేఱుచున్నది యానందతీర్థమునకు
వెడలుచున్నది విజ్ఞానజడధులకును
ఇట్లు శరవేగముగ జలగ్రహము కలఁచి
తేలిపోయెడునావకు తెడ్డు నీవె
కదలిపోయెడునావ చుక్కాని నీవె.

నడుపువా రెవ్వరో యగుపడర దేమి?
గడుపువా రెవ్వరో యేరు నుడువరేమి?
నావ నడచినదారిలో నవనవప్ర
ఫుల్లహల్లకములు కల్వపూలు జలజ
పుంజములు రాజహంసలు, పులుఁగుగములు
ఝషజలగ్రహములు మేటిజాళువాప
సిండి పురుడించుమీలు విచిత్రచిత్ర
శిల్పరత్నాలు కడుతార, సిల్లె నంత
పంజకెంజాయ లలమె నిశావధూటి
నల్లవలువలు ముసిఁగిడి, నాట్యమాడె
జ్యోతితిమిరంబులోపలఁ జొచ్చె నిద్ర
నీలమణిమంటపముల రత్నాలదీప
ములు తటంబుల రాజిల్లు, మోహనాంగి
కురుల దురిమిన మల్లెపూసరులపగిది

చీఁకటులు క్రమ్మె దిశలు చీకాకు పడియె
నానౌకదలదు కలమ! విన్నావ దీని
నీవునో చూరువైపోయినావు ప్రకృతి
సాగరమునందు హర్షాబ్ధి సన్నగిల్లె
విశ్వసదనంబు ముంగట వెఱ్ఱులమయి
నీవు నేనును నొకసారి నిలిచినాము
చలనమును దక్కి యొకచోట నిలిచినాము

శాంతిగీతంబు శార్వరీ కాంతపాడె
ఆరుతిక్కిఁ దోఁడు శ్రుతివేసె తారయొకతె
యొకతె సవ్వెన్నెలాస్యంబు, "నొకతె చేసె
యిట్టులె తక్కినచుక్కలు వెసఁగె నంత
కలఖగోళంబు నాట్యరంగముగ మాఱె
ఆవినోదంబు లేఖినీ, యరసినావె.

ఆవిలాసంబు తూలికా, యరసినావె
ఆమనోహరశబలగీ, తావధాన
సతతసుధారసంబు వసంతగగన
భాగమున మాత్రమోయుచు పగలు రేయి
యనక తేజంబుతో నైక్యమై ధరిత్రి
నిలిచిపోవు నీవును నేను నిలువలేము.

బడు "తేవారము" కర్త యని యాంధ్రకవులచరిత్రమున నుండవలసిన విషయముకదా. ఇట్టి విషయము లనేకములు ఆంధ్రభాషను గూర్చిగాని చరిత్రమును గూర్చిగాని వ్రాయువా రెఱుఁగవలసినవి గలవు.

ఈవ్యాసమున ద్రావిడవాఙ్మయమున నాంధ్రదేశమునందలి ప్రధానపురుషులను గూర్చియు రాజకీయ విషయములఁ గూర్చియు కొన్ని విషయము లుదహరించఁబడును.

ద్రావిడభాషను తెలుఁగున నుండు 'అఱవ' మనుపదము భాషలోని వాఙ్మయములో సాధారణముగా లేనట్లే 'తెలుఁగను'పదమును నఱవములో సాధారణముగా లేదు. ఈపదమునకు బదులుగా వాడబడుమాట 'వడుగు'. 'ఆఱువర్' 'అఱువాళర్' అను ప్రాచీనజాతివారు ఆంధ్రులకు సమీపమున దక్షిణభాగమందు ప్రాచీనకాలమున నుండుటచే వారిక్కడనుండి వారు మాట్లాడుభాషనే మాట్లాడు సంఘములను ఆఱవలని పేరైనది. అట్లే ద్రవిడులకు కన్నడభాషలో 'తిసులు'లని పేరు. ఇట్లే కేరళభాషయందు కర్ణాటకుల నుదహరించునపుడు వారిసమీపమందా భాష. కొంగుదేశమున (ఇప్పటి సేలం కోయంబత్తూరు మండలములు) వ్యవహరించుటచే నాభాష మాట్లాడువారందఱను 'కొంగర్' అను పేరైనది. 'తెలుంగు' అను పదము యొక్క ప్రాచీనతమ మగుచు ప్రయోగము ద్రావిడ భాషకు మూలవ్యాకరణ మనఁదగు 'అగత్తియమ్' అను గ్రంథమునఁ గలదు. ఈవ్యాకరణ మిప్పుడు లేదు. అయిన వెనుక వెలువడిన వ్యాకరణములలో నిందుండు కొన్ని వాక్యములు సూత్రములు నుదహరించఁబడినవి.

భాషల వెన్నచో నీక్రిందియగ ప్స్యవ్యాకరణ పఙ్క్తి ముఖ్యమైనది. "కొడ్డుకన్నడకొల్లం తెలుఙ్గం" దీనిని యనుకరించి పదునొకండవశతాబ్దిని వెలువడిన 'నన్నూల్' అను వ్యాకరణమునకు వ్యాఖ్యాన మొకదాని యందు 'కన్నడమ్ వడుకు కలిఙ్గ తెలుఙ్గమ్' అని యున్నది. 'వడుగ' అను పదమిప్పు డఱవములో తెనుఁగు భాషకును దేశమునకును వ్యవహారమునందినను మొట్ట మొదట యట్లు కాదనియు నాంధ్రదేశమునకుఁ బశ్చిమమున నిప్పటి బళ్ళారిజిల్లా ప్రాంతభూమికి పేరనియు నాదేశపు ప్రజలకే 'వడుగ'శబ్ద ముండెననియు నిప్పటి కచ్చుటనే బడగవారివా రనుజాతివా రున్నారనియు స్థలాంతరమున వ్రాయుచున్నాను. కాలక్రమమున నా పదముయొక్క యర్థము మారి యిప్పుడు తెనుఁగు కన్నడము రెండుభాషలకును అర్థమిచ్చుచున్నది.

ద్రవిడవాఙ్మయము ఆంధ్ర కర్ణాటకములకంటెఁ జాలప్రాచీనమైనది. అందలి ప్రథమయుగమునకు సంఘయుగమని (Sangham Period) పేరు పెట్టినన్చును. ఆ కాలమున ద్రవిడదేశము చోళ చేర పాండ్యులను ముగ్గురు రాజుల క్రింద యేడెనిమిదిచిన్న ప్రభువులను లోనై యుండెను. వీరికిఁ బరస్పర మనేకయుద్ధములు సంబంధములు కలుగుచువచ్చి వారిలో నప్పుడప్పు డెవరో ఒకరాజు ప్రముఖుఁడై యితరుల నెల్లఁ దనయాజ్ఞకు లోఁబఱచుకొనుచుండును. ఆకాలములో ననేకకవు లుండిరి. వారు నాకాలపురాజుల యాస్థానములకుఁ దిరుగుచు వారికిఁ దమగ్రంథముల నంకితమిచ్చియు వారిపై (తనిప్పాడల్) చాటువులను చెప్పుచును వచ్చిరి. ఇట్టి చాటువు లనేకము లాకాలములందే సుభాషితములుగా చేర్చి ప్రాకృతమున గాథాసప్తశతి, సంస్కృతమందలి అమరుశతకమువంటి ద్రవిడగ్రంథములలోఁ జేర్చఁబడెను. ఈకాలమున ద్రావిడమునకును ఆంధ్రదేశమునకును రాజకీయవిషయమున నధిక సంబంధము లేమింజేసి అందుకు సంబంధించిన విషయము లేవియు లేవు. పిదపకాలపు శాసనములయందు ప్రసిద్ధులైన పల్లవరాజుల పూర్వికు లీగ్రంథములలో 'తొండమాన్' అను పేరితోఁ గనఁబడుచున్నారు. వీరిదేశము కంచి, తిరుపతి (వేంగడము) మొదలగు ప్రదేశము చుట్టు నుండెను. ఆదేశమునకు 'తొండమండల'మని పేరు. తొండమండల మప్పుడు ఇప్పటి తెనుఁగు దేశములో దక్షిణభాగమునకుఁ గూడ వ్యాపించి యుండెను. ఈతొండమాన్ రాజులలో నొకరివర్ణించుచు వరిని రాజధాని 'పవత్తిరి' యనియు నది రేవుపట్టణమనియుఁ జెప్పఁబడినది. ఈపవత్తిరి ఇప్పటి నెల్లూరుజిల్లాలో దక్షిణభాగమం దుండి నట్లు తెలియుచున్నది. చోళులకాలపు శాసనములలో నాప్రాంతమున 'పవత్తిరికోట్టం' అని యొకకోట్టమును 'కడల్కొండపవత్తిరి'యని రేవుపట్టణము నుండినట్లు నెల్లూరుశాసనములవలనఁ దెలియును. ఈపవత్తిరి రాజధానిగా నుండిన 'సంఘు'కాలపు తొండమానురాజు అజప

ములలో నొక చిన్న ప్రభువు. సంఘకాలమునఁ గంచిలో రాజులుగాఁ జెప్పఁబడిన తొండమానులందఱును చాల చిన్న ప్రభువులు. చేర, చోళ పాండ్యులలో నెవరికో ఒకరికి సామంతులుగాను అప్పుడప్పుడు స్వతంత్రులుగాను కూడ నుండిరి. వీరినిగూర్చి సంఘవాఙ్మయమున ననేక చాటుగాథలు గలవు. 'కరికాలుఁ'డని ప్రసిద్ధిగన్న చోళ చక్రవర్తి యీ సంఘకాలములోనివాఁడే. ఆకరికాలున కంకిత మీయఁబడిన "పట్టినప్పాలై" అను గ్రంథమును వ్రాసిన 'కడియలూర్ ఉరుత్తిరంకణ్ణనార్' అను కవి ఆకాలపు కంచిరాజైన 'తొండమాన్ ఇళందిరైయన్' అను రాజుపై 'పెరుంబాణాట్రుప్పడై' అను గ్రంథమును వ్రాసెను. ఈగ్రంథము సంఘవాఙ్మయములో ముఖ్యమైన గ్రంథములలో నొకటగు 'పత్తుప్పాట్టు' లో నేకరించఁబడియున్నది. ఈగ్రంథమునం దాకాలపు పల్లవ రాజధానియగు 'కాంచీపుర' వర్ణన చాల మనోహరముగా నున్నది. గ్రంథమందలి ప్రజల యాచారములు గ్రంథము యొక్క ప్రాచీనతను చెప్పక చెప్పుచున్నది. మిరియములు మొదలగు సామానులు దూరదేశమునుండి పట్టణమునకు మోసుకొనివచ్చు కంచర గాడిదలు, మార్గములలో వర్తకులయొద్ద సుంకము గొను చావళ్లు, ధనుష్పాణులైన యోద్ధ భటుల శిబిరములుండు గ్రామములు, నీగ్రంథమున నుదహరింపఁబడియున్నవి. ఇంకొకప్రదేశమున నడవియేనుఁగులను వేటకాండ్రు గొప్పగొప్పగోతులు తీసి పట్టుకొనుట వర్ణించియున్నది. కంచిలో నాకాలపు ముఖ్యదేవాలయము 'వెహ్కా' అను విష్ణ్వాలయము నుదహరించి యందలి దేవునిపై కవి కొన్ని మంచికృతులు పాడియున్నాఁడు. ఇందు వర్ణించిన తొండమాన్ రాజు చిన్నరాజు. అతని రాజ్యవిస్తీర్ణము కూడా స్వల్పముగానే కనుపడును. ఇట్టే యింకను గొందఱు తొండమానురాజులుకూడ నీగ్రంథములలో నగుపడుచున్నారు. ఈతొండమాన్ వంశములోని వారే పిదపఁ గొంతకాలమునకు అనఁగా దక్షిణమునఁ జోళరాజ్యము నుత్తరమున నాంధ్రభృత్యరాజ్యమును ప్రభలిన్నప్పుడు వారి రాజ్యముల నాక్రమించుకొనిరి. ఇట్లాక్రమించుకొన్న తర్వాతనే వారు సంస్కృతమున గొప్ప బిరుదములు వహించి తామ్రశాసనములు చెక్కించ నారంభించిరి. "తొండైప్పల్లవర్" అను నొకరాజు "వడుగవ్యత్తై" అను ప్రదేశమున శత్రువుల నోడించినట్లు నచ్చినార్కినియర్, అను వ్యాఖ్యాత తనతొల్కాప్పియ వ్యాఖ్యానమున నొకప్రాచీనపద్యము నుదహరించియున్నాఁడు. 'వడుగవ్యత్తై' అనునది ముందుచెప్పినట్లు వెనుకటికాలపు బడగనాడు. ఇందే 'అగిరి' అనునది యున్నది. దాని పేరిప్పుడు 'హగిరి'. ఇవన్నియు నిప్పటి బళ్లారిజిల్లాప్రాంతమున నున్నవి. ఇట్లుత్తరమునను దక్షిణమునను రాజ్యమాక్రమించినతర్వాత పల్లవులు తమపేరిటనే తామ్రశాసనములు చెక్కించఁదొడఁగిరి. తామ్రశాసనములలో మన మెఱిఁగిన ప్రాచీనరాజగు 'శివస్కందవర్మ', రాజ్య ముత్తరమున కృష్ణాతీరమున ధాన్యకటకము రాజధానిగా గల్గినయాంధ్రాపథమున అనఁగా పశ్చిమోత్తరమున నిప్పటి బళ్లారిప్రాంతములలోని హిరహడగల్లి ఆదోనిసమీపమందలి మేకదోని మొదలగు ప్రదేశములఁ గల్గిన శాతవాహనీరాష్ట్రము వఱకును వ్యాపించెను. ఈకాలమునకు పిదపనే నీపల్లవుల శాసనము లాంధ్రదేశములో నమరావతి, దర్శనపురము, మెన్మత్తూరు, పాలక్కడ, ఇట్లనేకస్థలముల వ్రాయఁబడినవి. శాసనములు దొఱికినప్రదేశమంతయు నాయాకాలముల పల్లవసామ్రాజ్యమునకు లోనై యుండెను. ఆ కాలమున పల్లవులు చాలప్రసిద్ధులై యుండిరి. అయిన నప్పటి కాంధ్రభాషలో వాఙ్మయము పుట్టి యుండకపోవుటచే మనకావిషయమును దెల్పు గ్రంథము లాంధ్రములో లేవు. ద్రావిడమందును గీర్వాణమందును పల్లవుల కాలమున వెల్వడిన వాఙ్మయము చాలనున్నది. చాలకాల మాంధ్రదేశముపై ప్రభుత్వముచేయుటచే నీపల్లవుల వంశమునఁ బుట్టినవారు కొందఱాంధ్రులే యయిపోయిరి.

ఆంధ్రమున నిప్పటి వాఙ్మయము పుట్టుకాలమునకు ద్రవిడదేశమున మిక్కిలిప్రసిద్ధిచెందిన చోళచక్రవర్తులు పాలించుచుండిరి. వీరిలో మిక్కిలి ప్రసిద్ధిచెందిన 'రాజరాజు'ను అతని కుమారుఁడు 'రాజేంద్రచోళుఁడు'ను గొప్పదిగ్విజయములుచేసి చోళరాజ్యమును గంగాతీరమువఱకును వ్యాపింపఁజేసిరి. ఆకాలమందలి యుత్తర రాజు లందఱును వారికి సామంతులైరి. ఈదిగ్విజయ కాలమున నాంధ్రదేశమున రాజులై యుండినది పూర్వ చాళుక్యులు. వీరిలో దానార్ణవుఁడనువాఁడీయుద్ధములో మృతినొందిన ట్లగపడును. అతని కుమారుఁడు విమలా

దిత్యుఁడు వీరికి లోఁబడి చోళరాజైన మొదటిరాజ రాజసూతు వివాహమై చోళులక్రిందనే తనపూర్వికరాజ్యమున కధిపతియయ్యెను. అప్పటినుండి నాలుగైదుతరముల వఱకును చోళరాజ్యమును ఆంధ్రరాజ్యము నొక్కప్రభువునకే లోఁబడియుండెను. దౌహిత్రబాంధవ్యముఁ గొని చాళుక్యరాజగు రాజేంద్రచోళుఁడు చోళరాజ్యమున కధిపతియయ్యెను. ఆకాలమున వెలువడిన వాఙ్మయమందు చరిత్రమున కుపయోగించు వంశములు కొన్ని వెలువడును.

వీరరాజేంద్రుఁ డనుచోళరాజు ఆంధ్రదేశమును జయించెను. ఈయుద్ధములో నతఁడు విజయవాడ (బెజవాడ) యొద్ద వేంగిరాజైన విజయాదిత్యుని జయించెను. వీరరాజేంద్రుని కంకితమై వెలువడిన వీరచోళీయ మను వ్యాకరణము వ్యాఖ్యానములో నీపద్యమున్నది.

"[1] వేఙ్గైనన్ నాడన్ విజయవాడై క్కధిపన్
ఓఙ్గుపుగఙ్జుదాయా దిత్తమక్కుత్తొఙ్గుకడల్
నేరామెన్ హ్నాలునిఱత్తాలవన్యెయ్యక్
కారార్ నిఱ మాక్కడల్"

ఈపద్యమున కర్థ మిది:—వేఙ్గిరాజును, విజయవాడ (బెజవాడ) కధిపుఁడును ప్రసిద్ధుఁడు నగు నుదయా (విజయా) దిత్యునకు సముద్రము సరివచ్చునుగాని యతఁడు ఎఱుపు చాయవాఁడు, సముద్రము నీలవర్ణము. ఈపద్యము వేంగిరాజైన విజయాదిత్యున కంకితమైన యేదో ద్రవిడ గ్రంథమునుండి యెత్తఁబడి యుండవలెను. ఇందలి ఉదయాదిత్యశబ్దమునకు 'విజయాదిత్య' అను పాఠాంతరమును గలదు.

చాళుక్యరాజరాజకుమారుఁడు విష్ణువర్ధనుఁ డను నామాంతరము గలిగిన రాజేంద్రచోళుఁడు కొంతకాలము వేంగిదేశము నేలిన పిదప చోళరాజ్యమున కలిగిన రాజ్యవిప్లవముచేఁ బ్రజల కిష్టుఁడును శత్రురాజుల బారినుండి రాజ్యమును కాపాడఁగలవాఁడు నైన రాజు లేనందున తానే రాజయ్యెను. ద్రవిడమున కవు లితని మాతామహుఁడే దత్తపుత్రుఁడుగా స్వీకరించి యుండెనని యొక యైతిహ్యముఁ గూడఁ గల్పించిరి. ఇతఁడు చోళరాజ్యము నేలిన మిక్కిలి ప్రసిద్ధులలో నొక్కఁడు. తండ్రివంక చంద్రవంశమునఁ బుట్టినవాఁడైనను సూర్యవంశమునకుఁ జేరిన చోళరాజుచే స్వీకృతుఁడైనందున నితనికి ద్రవిడ కావ్యములలో 'సుభయకులోత్తముఁ' డను పేరు కలిగినది. ఇతనికే 'అభయ' 'విజయధర' 'కులోత్తుఙ్గ' యిత్యాది బహుబిరుదులుండెను. ఇతనిఁగురించి యాకాలపు ద్రవిడకవి యొకఁ డీక్రిందిపద్యముఁ జెప్పియున్నాఁడు.

"ఇరుణ్ణ్పుత్తుమకట్టు మిఙ్గుకులత్తోన్ఱి
యికల్వళర్త్తు తపనకుల త్తి రాజరాజన్
అరుడికువి త్తిరువయిత్తిల్ వన్దు తోన్ఱి
అరిశైయి లవతరిత్తా నవనే మీళ"
"తిఙ్గళ్ నిళఙ్గువి శెయ్కలి వసెన్ఱుమ్
శెయ్యపర తిక్కుత్తవిర్తై యనివ శెన్ఱుమ్
తఙ్గళ్ వర్కహిపశ్ శెన్దుర కుల త్తిర శర్త్తాముమ్
తని త్తని యుంపప్పదోర్ రకప్పయను మొత్తే"

"అంధకారమును బోగొట్టు స్వభావముగల చంద్రునివంశమందుఁ బుట్టిన రాజుదేవికిని తపనకులమునఁ బుట్టిన రాజరాజు కూతునకును పుత్రరత్నం దవతరించిన విష్ణువే మరల [కులోత్తుంగుఁడై] యవతరించెను."

"చంద్రవంశమునఁ బుట్టినవాఁడని కొందఱును సూర్యవంశమును వృద్ధిచేయఁబుట్టినవాఁడనియు రెండు వంశముల రాజులును ప్రత్యేకముగా సంతోషింతురు."

ఒకకాలమున నీకులోత్తుంగుఁడు తనకు సామంతుఁడై యనిఘేయుఁడైన అనంతవర్మ చోడగంగునితో గొప్పయుద్ధముఁ జేసి జయించెను. ఈజయమునే యీ రాజునాస్థానియందలి 'జయంగొండార్' అనుకవి 'కళిఙ్గత్తుప్పరణి' యను కావ్యమున జక్కఁగా వర్ణించెను. ఈకావ్యమున చరిత్రమున కుపయుక్తమైన యనేక గ్రంథభాగములు లున్నవి. అందు చోళసేనల తాకుడునకు నెదురీఁదఁ పరుగిడు కళింగసేనను గూర్చి యిట్లున్నది.

"అరుకవరుకర్ ఎనాది క్కెళ్ళవర్
అభియ పయమె నానవుక్కిదే"

౧. ఈ వ్యాసములో నుదహరించిన ద్రవిడపద్యము లన్నియు మిత్రులును ద్రవిడభాషాసాధారణపండితులును చాలకాలము 'హిందమిత్ర' పత్రికాధిపతులునై యుండిన శ్రీమాన్ మ. రాఘవయ్యంగారి 'సెంతమిళ్' పత్రికలోని వ్యాసమునుండి తీయఁబడినది.

ఆకాలముననే వెలువడిన ద్రవిడాలంకార గ్రంథము దండియలంకారమున నీయర్థముగల పద్యమే మఱి యొకటి కలదు.

ఒరువరోడవ శ్శేల్ వీషక్ నెదువడవా డర్
అరువరువరెనవజ్ఞి వెరువన్దు
శ్రీ శ్రీ శ్రీయెన్ర యర్వర్ శెన్నిపడెవీరర్
పోర్క్కిగ్గవిా దెజ్ఞున్దపోదు"

పైరెండుపద్యములయందును చోళసేనలు కళింగసేనలను తాకినప్పుడు కళింగసైనికులు పలాయితులైనది వర్ణింపఁబడినది. వారు పరుగిడునప్పుడు 'అరవలు' 'అరవలు' అని యఱచుచు పరుగిడిరట. అరవశబ్ద మాభాషలో లేదు. తెనుఁగువారు వారిని అరవలనుటచే నీప్రదేశమున వారిని జూచి మీ 'రరవలరవ' లని పరుగిడి రనియున్నది. ఇచ్చటనే రెండవపద్యమందలి 'శ్రీ శ్రీ శ్రీ' అనునది తెనుఁగు మాట త్రోవతీయుమని యర్థము.

ఈ కులోత్తుంగుని వెనుక చోళరాజ్యము నేలిన యతనికొడుకు మనుమడు మునిమనుమడునైన విక్రమచోళ, ద్వితీయకులోత్తుంగ, ద్వితీయ రాజరాజచోళుల కాలములో ద్రవిడులలో నత్యంతప్రఖ్యాతి కెక్కిన "ఒట్టకూత్తర్, శెక్కిళార్, కంబర్, పుగళేంది" యను గొప్ప కవు లుండిరి. వీరిలో 'ఒట్టకూత్తర్' అనుకవి ఈచాళుక్య చోళరాజులపై 'ఉలా' అను పేరుగల్గిన కావ్యములను వ్రాసెను. వీనిలో 'కులోత్తుంగచోళనులా' 'విక్రమచోళనులా' అనునవి ముఖ్యములు. వీనిలో చరిత్రమునకు ముఖ్యములైన యనేక విషయములున్నవి. 'శెక్కిళార్' అనుకవి ద్రావిడశైవాచార్యులయొక్కయు వారిభక్తులయొక్కయు చరిత్రములన్నిటినిఁ జేర్చి 'పెరియపురాణమ్' అను గొప్పపురాణము వ్రాసెను. ఈగ్రంథము జైనగ్రంథముల వ్యామోహమునఁ బడిన తనరాజును శైవమునకు ద్రిప్పుటకై వ్రాసిన ట్లొక యైతిహ్యము కలదు. 'పుగళేంది' అనుకవి 'నళవెణ్బా' అను నళచరిత్రమును మఱికొన్ని గ్రంథములను వ్రాసెను. వీరి సమకాలీనుఁడే 'రామావతార'మని పేరుగల ద్రవిడరామాయణము వ్రాసిన ప్రసిద్ధుఁడైన కంబకవి. ద్రవిడులకీ గ్రంథమునందు సంస్కృత రామాయణమందు కంటె యధిక గౌరవము. ఆంధ్రకవులలో కొందఱవలెనే యీకవులకు పరస్పర స్పర్ధలుండి యొకరిపై నొకరెత్తిపొడుచుచుఁ జెప్పిన పద్యములు, రాజసమ్మానము పోయినపిదప కవులు చెప్పినవియు ననేకపద్యములున్నవి. ఇందులో రాజాస్థానకవియైన ఒట్టకూత్తరును కంబనికి సంబంధించిన కథ లనేకములుగలవు.

ఈ కాలమందు వెలువడిన వ్యాకరణములయందీ క్రిందియుదాహరణ మగపడుచున్నది. 'వడుగరశెక్కచ్చి రద్దార్ శోణైయు వరశర్' దీని యర్థము 'చోళరాజులు తెలుఁగు రాజులను లోఁబఱచుకొనిరి' అని.

రెండవరాజరాజచోళుని కాలమునందుండి కంబకవికిని ఆరాజునకు నేకారణముచేతనో ప్రబలవిరోధ మేర్పడెను. ఆవిరోధముచే రాజుపై కోపగించిన కంబకవి చోళరాజ్యమును వదలి అప్పుడే యుత్తరమున నాంధ్రదేశమున ప్రబలుచుండిన కాకతీయరాజ్యమున ప్రతాపరుద్రునియొద్ద కేగినట్లు తెలియుచున్నది. ఈవిషయము 'తమిళ్ నావలర్ చరితై' అనుగ్రంథమందున్నది. అందలి వాక్య మిది. 'కంబర్ ప్రతాపరుద్రనిడత్తిల్పోయ్ అవన్ అడైప్పైక్కట్టెవరప్పాడియవెణ్బా'

"అవని ముష్ణాదుణ్డు మయిరావతత్తుక్
పవనితోష్ణవర్ పడుత్తుమ్-బువని
ఉరుద్రిరానిన్ను డెయటిరణనాట్టిల్
కురుత్తిరావాశైక్కష్టామ్"

ఇది కంబకవి కాకతీయాస్థానమునఁ జేసిన సమస్యాపూరణము. ఈసమస్యకర్థము 'అరటిచెట్లకు మోవులు లేకపోయెను' అని. ఈసమస్యను కంబకు పూర్తిచేసిన విధ మిది. "అవనియంతయు నీప్రతాపరుద్రుని సమారాధనలలో భోజనము చేయుటచేతను ప్రతాపరుద్రునిపై విరహబాధకు శైత్యోపచారములకు నుపయోగించిన పిదప ఓరుగల్లు నాటిలోని యరటిచెట్లకు మోవులు లేకపోయెను," అని.

ఇట్లు బలవంతుఁడైన ఆయాంధ్రరాజు కడకేగి తనకవిత్వముచే నతని స్వాధీనపఱచుకొని యాతని చోళునిపై రాఁజేసి తనయొక్క బంధమును దీర్చుకొనెను. అటుపై కంబకవి యథాపూర్వము చోళరాజ్యమున రాజునకిష్టుఁడుగా నుండెనట. అయినను పూర్వవిరోధము మఱువని చోళరాజు ఒకనాఁడు భోజనమండి

తప్పించుకొని యొక పెద్దపులిని కొట్టి మీద పెట్టి కవిసే కొట్టెనట. అట్లు కొట్టినపిదప తన ప్రాణము లింకను పోకమునుపు రాజునుగూర్చి కవి తిట్టినపద్య మొకటియు నా గ్రంథమం దున్నది. ఆకవి శాపముచేతనే యారాజునకు పిదప చోళరాజ్యము ప్రభలెల్ల తఱిగి కొద్దికాలముననే నిర్వంశమై పోయెననియు ద్రవిడదేశమున నైతిహ్య మొకటి కలదు.

కంబకవి గ్రంథములలో నచ్చటచ్చట యిప్పటి యాంధ్రభాషనుండి తెచ్చుకొనబడిన వనఁదగు పదప్రయోగములు కలవు. వీనిలో కొన్ని తమ్మి=తామర, అక్కటా=దుఃఖార్థము" మానరథము=మృగతృష్ణ. ద్రావిడభాషలలో నాంధ్రమునకు అఱవమునకు ప్రాచీనకాలమునుండి సంబంధముండియు నీపదము లీయర్థముతో నంతకుఁ బూర్వము దొరకనందునను, వ్యాఖ్యాతలు చెప్పుటచేతను ఈ పదములు తెనుఁగునుండియే తీసికొనియుండవలయును.

ఈ చోళకాకతీయులకాలమందే ఆంధ్రభాషకనేక క్రొత్తవిషయములు వచ్చెను. ఆకాలమున నఱవభాషయందలి ప్రాచీనశైవమత సంప్రదాయములును ఐతిహ్యములును కర్ణాటభాషయందలి ప్రాచీనశైవమత సంప్రదాయములును గాథలు నాంధ్రదేశమందలి శైవములలోనికిఁ జొచ్చెను. పాల్కురికి సోమనాథుఁడు పండితారాధ్యుఁడు మొదలగువారి గ్రంథములలో నంతయు నిది స్పష్టముగా తెలియును. పాల్కురికి సోమనాథుని పండితారాధ్యచరిత్రములో ననేక ప్రదేశములయందు ద్రవిడ శైవ గ్రంథముల యనుకరణము స్పష్టముగా నున్నది. ఒకచోట పండితారాధ్యుఁడు పూర్వశైవభక్తుల స్తోత్రము చేయు నవసరమున తాను వారికడియుడని చెప్పుచో నఱవమందు సుందరమూర్తి నాయనారు వ్రాసిన 'తిరుత్తొండత్తొగై' అను గ్రంథములోని యర్థము యథాక్రమముగా నున్నది. వెనుకటికవులు ద్రవిడశైవగాథలు విస్తరముగానుదహరించుట కీకాలమందు ద్రవిడాంధ్ర రాజ్యములకుఁ గలిగిన సంబంధమే కారణము. 'పన్నీట గంధజలమున,' నన్నయరెల్లప్రధాని యభిషేకింపఁగ, కన్నప పుక్కిటి నీటను, గన్నయారోచికము మాన కిఱుకంతునికిఁగ' ఇట్టి ద్రవిడశైవగాథ లెన్నిచోట్లనో యుదహరింపఁబడినవి.

ఈకాలమునకు కొంతపిదప నవఁగా కాకతీయ చోళరాజ్యము లంతరించిన పిదప కర్ణాటక దేశమం దుదయించిన విజయనగరరాజ్య మాంధ్రద్రావిడ దేశము నాయూలాగ్రము వ్యాపించెను. ఆకాలమందును ఆంధ్రమునకును ద్రావిడమునకు సంబంధ మెక్కువగా నుండెను. ఆ గ్రరాజులును సేనాధిపతులును ద్రవిడదేశమున కధిపతులుగా నియమితులై యచ్చటికవుల నాదరించి వారిచే మెప్పు వడసిరి. మతాధిపతులైన యనేక ద్రవిడగురువుల నాశ్రయించి వారియందు ప్రపన్నులై తమ గ్రంథములందు వారిని పొగడియున్నారు. 'తలకుఁగ్ మద్గురువిద్యానిలయుఁ ......శఠగోపయతిఁ' అని అల్లసాని పెద్దనయు, 'భట్టపారశరదేశికేంద్రు'నని సంకుసాలనృసింహకవి, 'విశ్రుత తిరుమలతాతార్యశ్రేష్ఠాన్వయ సుదర్శనాచార్య' నని వెన్నెలకంటి సూరనయు, 'వాక్యాంతాశ్రయభట్టరు చిక్కాచార్యుల మతిఁదలంచెద' నని తెనాలిరామకృష్ణుఁడును, 'కందాళభావనాచార్యుల' వందను శ్రీరంగగురుని' అని యిట్లనేకకవు లనేక ద్రావిడాచార్యుల స్తోత్రముచేసినది ప్రసిద్ధము. ఆముక్తమాల్యదయందు కృష్ణరాయలు తనకావ్యమునకు కథను ద్రవిడభాషనుండి తీసికొని వదేకాక యందనేక ద్రావిడగ్రంథముల యర్థములఁ జెప్పియు, 'ద్రావిడీపరిచితిన్ చెందా డునందంబునఁగ' 'ద్రవిడకుటుంబిను ల్పసవు దాచిన రన్నపుఁ దాఁపక్రింద' 'దివ్యప్రబంధ యనుగాన్యల్ ద్రవిడాంగవల్' అనియుఁ దద్దేశీయుల వర్ణించియుఁ దురకు ద్రవిడు లాళ్లను బోవుచవుకు 'పారిబిళింగాయల' దీసికొనిపోవుదురని కూడ వర్ణించెను. వైజయంతీవిలాసమున సారంగుతమ్మన కథనంతయు నఱవమునుండియే కదా తీసికొన్నది. తాళ్లపాక తిరువేంగళనాథుఁడు, సిద్ధిరాజ తిమ్మరాజును వ్రాసిన పరమయోగివిలాసముల కథలట్లే ద్రవిడగ్రంథముల యనుకరణములు.

(సశేషము)






భమిడిపాటి రామసోమయాజులు గారు, బి. ఏ.

విజయనగరం కస్బాలో కాపురంచేసే వారిలో చాలామందికి, నారాయణ రావుగారికూతురు 'లక్ష్మి' చిరపరిచయురాలే. ఆపెచిన్ననాటనుండీ, ఆచుట్టుపక్కలవారియిళ్లలోనే తిరుగుతూండేది. చిన్నపిల్లలకి తరచుగా, తమయీడుపిల్లలతో ఆటపాటలు జరుపుకుంటూ కాలక్షేపం చేయడమనేది స్వాభావికం. కాని 'లక్ష్మికి మాత్రం నేస్తానికి తన యీడువారే కావాలని మాటలేదు. వయస్సెంతైనా సరే, తనకి కావలసిన బుద్ధితత్వం కుదిరినవారైతే, వారెవరైనాసరే, యేజాతివారైనాసరే వారితో నేస్తం కలిసిందన్నమాటే.—

—"మీయింట్లో బంతిపువ్వులున్నాయా?"—అంది 'లక్ష్మి' ఒక పెద్దమనిషితో ఒకనాడు నారాయణరావుగారి యింటివద్ద. —"ఉన్నాయమ్మా! మాపెరటినిండా బంతిపువ్వులే, వస్తావా?" అన్నాడాయన. మరో కపావుగంటలో ఆబంతిమొక్కలమధ్యని మేలుబంతియై పోయియేవేవో సంగతులు చెప్పుతోంది ఆయనతోటా వేళ. అదీ ఆపిల్ల స్వభావం. అందుచేత ఆపిల్ల నెరుగనివారావీథులలో చాలా తక్కువమంది. ఆ వీథుల్లో ఆదక్షిణాదిపరికిణీ, ఆగీతల జుబ్బా, ఆ మెడలో జిగినీనాను అన్నిటికిపైన చంద్రబింబాన్ని ధిక్కరించే ఆనవ్వుమొగమూ, అందులోనూ, ఆకన్నులూ, —"అవికన్నులు కావు, కలువరేకులే!" అనేవారు. —అవి, కానరాని గడియ ఉండేదికాదు. తాణా ఆఫీసులో పనిచేస్తూ ఉన్న కామేశ్వరరావుగారికీపిల్లంటే ప్రాణం.—ఆయనకి రమారమీ యాభై యేళ్లుంటాయి. పిల్లల్లేరు. నల్లగా పొడవుగా లావుగా, యెప్పుడూ మాసినగడ్డాంతోటే వుండేవాడాయన.—ఆఫీసునుండి యింటికి పోయే ముందు లక్ష్మిని చూడాలి, వెళ్లాలి! లేకపోతే ఆయనకి తోచేది కాదు. —"లక్ష్మీ! లక్ష్మి! ఇవిగో పిప్పరుమెంటుబిళ్లలు!" అని వీథిగుమ్మంలో వినబడేసరికి, నారాయణరావుగారి భార్యకి, అయిదు గంటలైందని రోజూ తెలిసేది.

నారాయణరావుగారికి కూడా తాణా ఆఫీసులోనే ఉద్యోగం. ఆయన చాలా యోగ్యుడు, చిన్నవాడు, ఆ ఆఫీసులో అందరితోనూ మంచిగా స్నేహంగా కాలక్షేపం

చేసేవాడు. ఆయన కీపిల్లే కాని మరిపిల్లలు లేరు. అయినా, కొడుకులు లేరనే విచారం ఆయనకి ఉండేది కాదు. ఉండేది కాదేమిటి—ఆపిల్ల అట్టివిచారం ఉండనిచ్చేది కాదు. ఫంట్లామూ, కోటూ టోపీ, జోడూ, కట్టిస్తేనే కాని ఊరుకుంది కాదు. ఒకొక్కప్పుడు లక్ష్మి యీదుస్తులతో మగవేషం వేసుకుని తిరుగుతూ ఉండేది. ఊరిలో వారికే విపరీతమైన ప్రేమ ఆపిల్లపై నున్నాదన్నప్పుడు ఆతల్లిదండ్రులకు ప్రేమ ఉన్నాదని చెప్పేదెందుకు? అందులో ఒక్కపిల్ల. పాటలు, పద్యాలు, కథలు, —చిత్రమైన సంభాషణలు! ఆతల్లిదండ్రుల యానందము వర్ణింప శక్యంగాదుకదా!

రాత్రి అయిందంటే తండ్రి ప్రక్కని భోజనం చేయాలి. తానూ సంధ్యవార్చాలి. విస్తరాకుచుట్టూ నీరుపోయాలి. అన్నము కొంచెము కొంచెము ముందుతినాలి. భోజనమైన తరువాత తండ్రితో సంభాషణ—ఒకనాడు—

"ఆకాసెమ్మీద చుక్కలెందుకున్నాయి నాన్నా?"

"మనం చూడాలని"

"అవెందుకు మెరుస్తున్నాయి నాన్నా?"

"మనకి సంతోషం యివ్వడానికమ్మా"

"అవేమిటి నాన్నా?"

"చచ్చిపోయిన వాళ్లంతా చుక్కలైపోయి అలా ఆకాశమ్మీద మెరుస్తారమ్మా—చూసేనా, కొందరు పెద్దవాళ్లు, కొందరు చిన్నవాళ్లూ, యెలా కనపడుతున్నారో?"

"అవును— అడుగో! అదుగో! మన తాతయ్య, అందరికంటె పెద్దవాడు,"

ఇంత అమాయికముతో ప్రక్కను కూర్చుని, మాటలాడుతూన్న కూతురుని చూచి నారాయణరా వుప్పొంగిపోయేడంటే వింతయేముంది? అతనికున్న అల్పసంతుష్టి లేనివాళ్లైనా పొంగిపోవడానికి అడ్డులేదుకదా!

ఆమెకు పువ్వులంటే పరవశత్వం వస్తుంది. "మల్లీ పువ్వులు! మల్లీ పువ్వులు!" అన్న కేక వీథికడని వినిపించేసరికి, యేపని చేసుకుంటున్నా తల్లిని వీథులోకి లాగుకొనివచ్చి కొనిపించిందన్నమాటే కదా. చిన్నపిల్లలెవరేనే పువ్వులుచిదిపి రేకులూడదీస్తూంటే చూచిందంటే మండిపడేది. పూవులకంటే కోమలమైన మనస్సాపిల్లది. చిన్నచిన్న బొమ్మలని గదులో పీటపై వరుసగా నిలువబెట్టి, పువ్వులన్నీ ఆబొమ్మలకి పెట్టి, వెనుకకు వచ్చి చూచి తనలో తానే విపరీతంగా ఆనందించేది. ఆమె నవ్వితే యింటియంతకూ వెలుగు వచ్చేది. వీథులో నడుస్తూంటే, వీథియంతా పువ్వులు పూసినట్లుండేది.

ఇక తల్లిసంతోషం తల్లిముద్దులూ చెప్పడానికే వీల్లేదు. తల్లి వండుతూంటే పక్కనికూర్చుని సంతతం ముచ్చటిస్తూండేది. తల్లి పాలు కాచుతూ పుట్టినింటిసంగతులు జ్ఞాపకంతెచ్చుకుంటూ తన్నుతా మరచిపోయినప్పుడు—"పాలుపొంగిపోతూంటే చూస్తూ—" అని తల్లికి జ్ఞప్తి తెస్తూండేది. ఒకటేమిటి, మగడింట లేకుండా, తానొకర్తె యింటివద్ద పగలెల్ల ఉండవలెనన్న విసుపులేకుండా లక్ష్మి తల్లికి

ఆనందం కలిగిస్తూండేది. తల్లికి జడ వేసి, బొట్టు పెట్టేది. తల్లితో ఆటలాడేది. తల్లి జడలో పువ్వులు పెట్టేది. అల్లా పువ్వులు పెట్టి వెనుకకువచ్చి తల్లి మొగము చూచి, పరుగెత్తి చేరి, ముద్దుపెట్టుకొనేది. అట్లని తల్లితోనే పగలంతా కాలక్షేపం చేసేదని చెప్పలేము. అందరియిళ్లలోను సందడి కలిగిస్తూనే ఉండేది ప్రతిదినమూను. అది కొందరి స్వభావం. వారెప్పుడెక్కడుందురో చెప్పలేము. ఎక్కడ చూచినా వారే కానవచ్చుచుందురు. అందరనూ సంతోషపెట్టుచుందురు. చేసేపనులన్నీ అతిచురుకుగా చేయుచుందురు.

సముద్రం విజయనగరానికి పదిపండ్రెండు మైళ్లదూరంలో ఉన్నప్పటికీ, వేసవిలో మాత్రం విపరీతమైన వేడిమి ఆపట్టణాన్ని దహిస్తూంటుంది. దానికి ముఖ్యకారణం చుట్టుపట్ల కొండలు విస్తారంగా ఉండడమే అని అనుకుంటారు. కాలిజోడు లేకుండా ఆపట్టణంలో మధ్యాహ్నం నడచిపోవడమనేది ఒకవిధంగా దుస్సాధ్యమని చెప్పవచ్చు. ఆవేసవిలో ఒకనాడు సాయంకాలమైనది. ఎండ తగ్గుచున్నదని అందరును రోడ్లపై తమతమ పనులు నెరవేర్చుకొనుటకు పోవుచుండిరి. నారాయణరావుగారి వీధిగుమ్మము వద్ద.

"లక్ష్మీ! లక్ష్మీ! ఇవిగో పిప్పరుమెంటు బిళ్లలు!"—అను మాటలు వినవచ్చినవి. అప్పుడేవంటకొరకు ప్రయత్నిస్తూన్న నారాయణరావుగారిభార్యా, వీధిగుమ్మమువద్దకువచ్చి,

"కామేశ్వర బాబుగారా! రండి, కూర్చోండి! పిల్ల లేదు! ఎవరింటికో వెళ్లింది!".

"ఈ వేళప్పుడెక్కడకూ వెళ్లదే?".

"నిజమే! మీరు పిప్పరుమెంట్లు తెస్తారని కనిపెట్టుకుండేది, కాని యీరోజు నెవరింటనో పువ్వులు కోసుకుంటూ ఉండిపోయిందనుకుంటాను."

అంతలో నారాయణరావు వచ్చేడు.

"ఏంవిటది?"

"పిల్లయెక్కడికో వెళ్లిందని కామేశ్వర బాబుగారితో చెప్పతున్నాను."

"సాయంకాల మెక్కడకుపోయింది?"—అని అతడు చుట్టుపట్ల, తన లక్ష్మి తిరిగే యిండ్లకుపోయి తీసుకువత్తామని బయలుదేరినాడు. అతనిభార్యా వంటచేసుకొనుటకై లోనికిపోయినది. కామేశ్వరరావా వీధి యరుగుమీద గూర్చుండి పిప్పరుమెంట్ల నొకచేతిలోనుండి యింకొకచేతిలో పోసికొంటూ, వీధిలోనికి, పెదవులు బిగించి కనుబొమలెత్తి చూచుచుండెను.

పావుగంటయినది. అరగంటైనది. నారాయణరావు లేడు. పిల్లా లేదు. కామేశ్వరరావు నకేమీ తోచడు. లక్ష్మినిచూచి, ముద్దాడి, పిప్పరుమెంట్లిచ్చి మరీ వెళ్లాడింటికి. అతడి ఓరిమి యెటువంటిదో, ఒకగంటవరకూ ఆపిప్పరుమెంట్లు ఒకచేతిలోనుండి మరొకచేతిలోనికి పోసుకుంటూనే కూర్చున్నాడు. ఈలోపున నారాయణరావుభార్యా పదిసార్లు వీధిగుమ్మమువద్దకు వచ్చిపోయింది. అంతలో నారాయణరావొక్కడూ యింటికి వచ్చేడు.

"ఏమోయి! లక్ష్మి కానరాలేదూ?" కామేశ్వరరావు కాందోళనపుట్టింది. అరుగుమీదనుండి దిగి నిలువబడ్డాడు.

"ఎవరింట అడిగినా, 'మధ్యాహ్నం మరి మాయింటికి రాలేదు'నే చెప్పేరు. మరియెక్కడికి వెళ్లిపోయిందో కాని."—అని అరుగుపై చతికలబడ్డాడు నారాయణరావు. ఈ మాటలువిని కాబోలు నారాయణరావు గారి భార్య వచ్చి

"అయ్యో! మధ్యాహ్నంనుండీ యింట్లోనే లేదు. మరి యెవరింటికి వెళ్లిందో?.—" అన్నాది.

చుక్కజారిన వేగంతో, కామేశ్వరరావు మనస్సులో ఒక ఆలోచన పరుగెత్తింది. వెంటనే అతడు. "తమలపాకులమ్మే వెంకటస్వామియింటిదగ్గి రుండేమో." "అక్కడెందుకుంటుంది?" అన్నారు నారాయణరావూ భార్యానూ.

"వాడూ, రెండుమూడు రోజులనుండీ మల్లిపువ్వులిచ్చి తీసుకువెళ్తున్నాడు. వాడే యివాళ తీసుకువెళ్లి వుంటాడు." ఈ కడపటి వాక్యం విపరీతంగా పలికేడు కామేశ్వరరావు. నారాయణరావు భార్య గుండెలు "జల్లు"మన్నది. నారాయణరావు శరీరం కంపించింది.

"వాడు బహుదుర్మార్గుడు." అన్నాడు కామేశ్వరరావు, నారాయణరావుకి భార్యకీ మరీ భయంపుట్టింది. "వెళ్దాం రండి వాళ్లింటి"కన్నాడు నారాయణరావు. కామేశ్వరరావు మాటా మంతి లేకుండా నారాయణరావుతో కలిసి వెళ్లేడు. ఇక నవిడభయం విపరీతమై పోతూంది. "లక్ష్మి యేమైపోయిందో కదా!" అని క్షణక్షణమూ ఆమెహృదయం అడుగుతూనేవుంది.

కోటలో నగారా "భయంలేదు! భయంలేద"ని ఆమెను హెచ్చరిస్తూన్నట్టు మ్రోగి మ్రోగి, మానేసింది. సన్నాయి పాటకూడా, కొంతసేపటి కంతరించింది. తాపాచప్పుడు ఆతల్లిహృదయంలో ఆందోళన మెక్కువ చేసింది. వంటచేసి తలుపులువేసుకుని, వీథిగుమ్మంలో కొచ్చినిలుచున్నాదా తల్లి.

## 3

నారాయణరావూ కామేశ్వరరావూ వీథుల్లోనుండి వీథుల్లోకి, సందుల్లోనుండి సందుల్లోకి, తిరిగి తిరిగి, ఆసాయంకాలం యేడుగంటలయేసరికి, తమలపాకుల వెంకటస్వామి యింటిముందరికి చేరేరు. వడకుతూన్న గొంతుకతో "వెంకటస్వామీ!" అన్నాడు కామేశ్వరరావు. ఆక్షణంలోనే "లక్ష్మి!"అని పిలిచేడు నారాయణరావు. ఇద్దరూ ఒక్కసారే ఊరుకున్నారు. వారి పిలుపులకి జబాబులు వచ్చేయో లేదో, వచ్చి వినరా లేదో తెలియక, మళ్లీ అలాగే పిల్చేరు. మళ్లీ జవాబు తెలియలేదు. "ఆ! ఏమిటిదీ!" అని కామేశ్వరరావు యింటిగుమ్మములోనికి వెళ్లి తలుపుగట్టిగా తట్టి "వెంకటస్వామీ! వెంకటస్వామీ!" అని బిగ్గరగా పిల్చేడు.

ప్రక్కయింటి వారెవరో, "యెక్కడనో పోయినాడ"ని జబాబిచ్చేరు. ఆజబాబు విన వచ్చినవైపు కామేశ్వరరావు నడచేడు. మతి లేనివాడై నారాయణరావతని వెంబడించేడు.

"ఎవరయ్యా అక్కడ?"

"ఏంబాబూ!" అంది ఒక ముసలిది, గుమ్మంలో కుండ కడుగుతూ.

"వెంకటస్వామి యెంతసేపటికింద వెళ్లేడు?" అన్నాడు కామేశ్వరరావు.

"మూడుగంటలవ్వొ" దంది ముసలమ్మ.

"అతడితో యెవరైనా బ్రాహ్మణ అమ్మాయి వచ్చిందా? "అన్నాడు నారాయణరావు.

"ఏమో మాకు తెలియ"దంది లోపలి నుండొక ఆడమనిషి.

మరి మాటాడకుండా యిద్దరూ తిరిగి వచ్చేస్తున్నారు. దారిలో ఒకవీధులో, ఒక ఆడమనిషి, "యెవరు బాబూ మీరు?" అంది

"యేం? యెందుకడుగుతన్నావ?" న్నాడు కామేశ్వరరావు.

"ఏమీలేదు, యెవరో, యెందుకు తిరుగుతున్నారో అని అడిగేను"

"నువ్వెవరు?" అని ప్రశ్నించేడు నారాయణరావు.

"యెంకటసామి తాలూకు మనిసి"అన్నాడు. ఆదగ్గిర నిలువబడ్డ వాడొకడు.

"మీ యింటికెవరేనే, అమ్మాయివచ్చిందా? యివాళ?" అన్నాడు కామేశ్వరరావు.

"అదేమో బాబూ! అమ్మాయిలూ అబ్బాయిలూ యెవరో, యెందుకొచ్చేరో నాకు తెలియు"దంటూ వెళిపోయిం దా ఆడమనిషి.

తిన్నగా వారిద్దరూ, బజారులో గంట స్తంభం దగ్గిర కొచ్చి నిలువబడ్డారు. ఆదారిని యెనిమిది తొమ్మిదేండ్ల పిల్లలెవరు కానవచ్చినా "లక్ష్మీ!" అని దగ్గరగాపోయి చూచేవాడు నారాయణరావు విపరీతపుఆత్రంతోటి. ఒక రెండునిముషాలు వారేదో ఒకరితోనొకరు మెల్లగా, రహస్యంగా సంభాషించుకున్నారు. ఆకుండ లేకున్న మ్యునిసిపల్ లాంతరు వెలుగులో వారు పోలీసుస్టేషన్ వైపు నడచి వెళ్లేరు. పోలీసుస్టేషను దగ్గరకు వారు వెళ్లేసరికి గంటస్తంభంలో గడియారాలు, యెనిమిదిగంటలు కొట్టేయి "ఎనిమిదేండ్లవయస్సుగల పిల్ల!" అని కాబోలు ఆగంటస్తంభం ఊరందరకి తెలియజేస్తోంది!

౪

మ్యునిసిపాలు దీపాలన్నీ సుఖనిద్రలో మునిగిపోయి ప్రకృతిని మరచిపోయేయి. పగలు నడువడానికి దారిదొరుకనంత చిక్కగా మనుష్యుల చేనిండుబజారురోడ్లపై పందికొక్కులాటలాడు కొంటున్నాయి. ఎంతజాగ్రత్తతో నడుస్తూన్నా అతడి అడుగులచప్పుడు వినవస్తోంది. బుజముపై బరువుండుటచేత ఆచప్పుడు మరీ విస్పష్టంగా వినవస్తోంది. అతడు తిన్నగా బజారురోడ్డులో నుండి, కన్యకాంబవారి కోవెల ప్రక్కనుండి, మహారాజావారి ఆసుపత్రి దాటి పెద్దచెరువులోనికి దిగి, నీరారిపోయిన దిబ్బలపై నడుస్తున్నాడు. చిన్న ఒగర్పు, యెండిపోయిన నాచు అట్టలపై బడు భారమైన అడుగులు, బొంకుగోడలనుండిచిన్న చిన్న ప్రతిధ్వను లిచ్చుచున్నవి. కొంత సేపటికతడాఅంధకారంలో లీనమైపోయినాడు.

భూమిపై జరుగుతూండే మహాఘోరాలు చూచి నక్షత్రమండలం నూవత్తు గడగడ

వడకుతోంది. ఆ ప్రక్కనువ స్తే "ఘూచేవ" నిపోలీసువారు సాక్ష్యం వేస్తారని భయపడి కాబోలు గాలి దేవ్ర డటుచూడడమే మానివేసేడు. పెద్ద చెరువు గట్టుపైన రోడ్డు ప్రక్కని నిలిచివున్న చెట్లు కొయ్యబారిపోయినాయి. గంట స్తంభంలో గడియారాలు ఒంటిగంట కొట్టేయి. మరొక్క నిముషంలో కోటగుమ్మంలో, ఒంటిగంట కొట్టేరు. ఆగంటలు కొట్టడం వింటే, ఆరాత్రి సమయంలో మొదటి గంటధ్వని ప్రశ్నగానూ, రెండవది "కా"సనే ఉత్తరముగాను తోచింది. అతడు మళ్లీ పెద్ద చెరువులో నుండి వెళ్లినదారినే తిరిగి వస్తున్నాడు. ఈ సారి ఒగర్పు లేదు. అడుగులు భారంగా పడ లేదు. అతడు రోడ్డుమీదికి వచ్చేడు. నలుదిక్కులా కలయజూచేడు. అతడొక బనియను తొడుగుకొని యున్నాడు. పంచకట్టుకున్నాడు. ఆ చీకటిలో కూడా బలిష్ఠకాయుడని తెలియ వస్తోంది. ఆ ప్రక్కనుండి ఒక స్త్రీ యాతని మొదుటికి వచ్చి నిలువబడినది.

"అయిపోయిందా?"

"ఆ!"

"యింటికిపోదాం?"

"ఆ!"—అని అతడు వచ్చిన దారినే నడుస్తున్నాడు. వెనుక నా స్త్రీ నడుస్తోంది. ఆకాలవలో నొకపందికొక్కు "బుస్సు"మన్నాది. అత డాగిపోయినాడు. వెనుక నాపె కూడా ఆగిపోయింది. —అతడు మరల నడువనారంభించేడు. ఆపె వెంబడించింది. దారిలోని పందికొక్కులు, మొలుకలు, చెట్లపైనున్న దివాంధములూ, అతనిజూచి తొలగిపోయినవి. కస్య కాంబవారి కోవెల యిప్పుడాతని మొదుమ ప్రక్కనున్నది —నిశ్శబ్ద ప్రపంచమును చీల్చుకొని పోవుచు, పోలీసువారి యీల వినబడినది. వెంటనే దూరమునుండి మరియొక యీల వినవచ్చినది. —అవి విని యాత డాగిపోయినాడు. ఆపె యాతని వెనుక నక్కినది. మరలనిద్దరు తమదారిని పోవుచున్నారు. ఇద్దరు పోలీసుజవాన్లువారి నడ్డగించుకొని.

"ఆగు!" అన్నారు.

అతడు ఆపె, ఆగిపోయేరు.

"యెవరు నువ్వు?"

"తమలపాకుల దుకాణదారు, వెంకటస్వామిని."

"అదెవరు“"

"ఆది నావుంపుడుకత్తె."

"ఎక్కడనుండి వస్తున్నా వీరాత్రిలో?"

"దానింటినుండే!"

"ఎక్కడకు వెళ్తావు?"

"నాయింటికి."

"సరే! పో!"

అతడు పోవుచున్నాడు. ఇంతలో పోలీసువారి దొంగలాంత రాతని వీపుపై వెలుగు పంపెంది. బనియనుపైనా, బట్టపైనా, పెద్ద మరకలు కానవచ్చి, పోలీసువారు

"ఆగు! ఆగు! అక్కడ!"

వెంకటస్వామి కొయ్యవలె నిలిచిపోయేడు. అతనితో కూడనున్న స్త్రీ బెదురుతూన్న ముఖంతో నిలచిపోయింది. పోలీస

వారు దగ్గరగా పోయి, అతని దుస్తులపై దీప ముబెట్టి చూచేరు. పెద్దపెద్ద రక్తపుమచ్చలు



బట్టలపైననున్నవి. పోలీసువారు

"ఈరక్తపు మరక లెట్లావచ్చేయి?"

"ఇప్పుడే కోడిపిల్లని కోసేను."

"కోడిపిల్లని కోసితే, వెనుకను రక్త మెట్లా వచ్చింది?"

"పడ్డాది. పడితే వచ్చింది."

"సరే, నిన్ను లాకప్ చేస్తాం. నిన్నుకూడానూ." అని వారిద్దరకు సంకెళ్లువేసి పోలీసు స్టేషనుకు తీసుకు పోయేరు.

⁂

అప్పుడే తెల్లవారింది. మచ్చకొండ మీదనుండి కర్మసాక్షి కానవస్తున్నాడు. రాత్రిజరిగిన మహాఘోరాలన్నీ వెలుగులో పిస్తానంటున్నాడా అన్నట్లు దివ్యతేజస్సుతో ప్రకాశిస్తున్నాడు. విజయనగరం వీథుల్లో ప్రజలంతా యెవరికార్యాలమీద వాళ్లిప్పుడే బయలుదేరుతున్నారు.

కొత్తపేటలో వెంకటస్వామి యింటి చుట్టూ జనులు మూగేరు. పోలీసువారు మూకలను తరుముతున్నారు. ఆసందులో చాలా కోలాహలంగా ఉంది. పోలీసువారు కొంచెము శ్రమతో వెంకటస్వామి, యింటి తలుపు తెరచేరు. — లోపల ప్రవేశించేరు. మొదటిదంతా పరీక్షించేరు. మధ్య నొక చోట రక్తపుబొట్టుమాత్రం కానవచ్చింది. రెండవ తలుపు తెరచేరు. లోపల ప్రవేశించేరు. ఇంకా బాగా యెండ రాకపోవడంచేత ఆగదిలో చీకటిగావుంది. సబ్‌యినస్పెక్టరు వెంటనే పెరటితలుపు తెరచేడు.

"నేరం నే చూపిస్తా" ననే ఆతురతతోటి వెలుగులోపల ప్రవేశించింది. గదిలో ఒక

మూల అంతా రక్తమయం. ఎన్నోయిటు వంటివి చూచినప్పటికి ఆసబుయినస్పెక్టరు, కంటనీరు వచ్చింది. అది పోకెటురుమాలుతో తుడుచుకోవడ మచ్చటివారందరూ చూచేరు. ఆరక్తముగల చోటికి కొంచెముదూరమున ఒకట్రంకుపెట్టె కానవచ్చినది. ఆ ట్రంకు పెట్టెమీద నొక ఉత్తరీయంలో సగంభాగం కానవచ్చింది. అది తీసే డొకపోలీసుజవాను. దానిమీద రక్తము మరకలు కానవచ్చేయి. పెట్టెతలుపు ఊడగొట్టేరు. లోపల ఒక ఫ్రెంచి కాఫీడబ్బా కానవచ్చింది. కొన్ని బట్టలు డబ్బులు కూడా ఉన్నవి. ఆకాఫీడబ్బా మూతతీసేడు సబుయినస్పెక్టరు ఆలోచనలేకుండానే, కాని అందులో, నాను జిగినీ ఒకటి "తళుక్కు" మని మెరసింది.—ఈసారి సబుయినస్పెక్టరు దొడలంట కాలువలు గట్టి నీరు ప్రవహించడంచూచిన వారందరూ యింతో అంతో కంట తడిబెట్టుకున్నారు. సబుయినస్పెక్టరు దుఃఖం ఆగింది కాదు. అతడొక్కసారి "అయ్యో! లక్ష్మీ!" అని వెక్కి వెక్కి యేడ్చేడు.—ఒక పోలీసు జవానువైపుచూచి, "యీనాను జిగినీ నాద్వారానే చేయించుకున్నాడు పాపం, నారాయణరావు" అన్నాడు.

ఇంతలో "లెండి! లెండి!" అని జనసమూహాన్ని రెండుచేతులతోనూ తోసుకుంటూ వచ్చి యింట్లో ప్రవేశించి "ఇనస్పెక్టరుగారూ! శవందొరికింది." అన్నా డొక జవాను. అతడి ముఖంనిండా చెమ్మటలు కారుచున్నవి.

"యెక్కడుంద" న్నాడు సబుయినస్పెక్టరు, లేచి—"పెద్దచెర్లో"

"రాత్రి వాడైతే అక్కడనుండే వస్తున్నాడ"న్నా డింకొకజవాను.

"ఒక ఉత్తరీయం ముక్కని చుట్టి—" అని అంటూ, అంతలో ఆపెట్టెమీదనున్న ఉత్తరీయపు ముక్కచూచి, పెద్ద కన్నులు చేసుకొని — "ఇదిక్కడుందా? ఇందులో సగమే శవానికి చుట్టపెట్టినది." అన్నాడు అప్పుడు వచ్చినజవాను. "సరే యిక్కడిద్దరుండండి—నువ్వూ నువ్వూను" అని చేతితో చూపి సబుయినస్పెక్టరు బయటికి వచ్చేడు. అతడిగుర్రం "రా! రా! వాడిపనిపటతాం!" అని అంటూన్నట్లు సకిలించి తోక విసరిందీ. ఆతఁడా గుర్రమెక్కి బయలుదేరేడు.






# మనిషీ - కోతీ

చింతా దీక్షితులు గారు (సాహితీసమితి)

౧

క్రొత్తగా వచ్చిన వరదలచేత పొంగుచూ పొరలుచూ పారుచున్న గోదావరీ నది యొడ్డరిని గుబురుగా పెరిగిన ఒక చింత చెట్టు నానుకొని ఓబిచ్చగాడు కూర్చున్నాడు. అస్తమించిన సూర్యునివెనుక ఆగిన సంధ్యారాగము ఆకాశము నలముకొని గోదావరీగర్భముపై శయనించి తుష్టిచెంది ఆడుకొనుచున్నది. సాయంసమారంభమున ఎర్రబారిన గోదావరీమధ్యముపై అవలోకనములు బరపి బిచ్చగాడు ఒడిలోకూర్చున్న కోతిపిల్ల సంగతి మరిచిపోయినాడు. కోతిపిల్ల అతనివంకచూచుచు గోదావరివంక చూస్తూ కొంతసేపు ఊరుకుంది. తరువాత పక్కనున్న జోలిని చూడడం ప్రారంభించింది. ఈరీతిగా కొంతసేపు చూచి నెమ్మదిగా జోలిలోవున్న బియ్యం గుప్పెడు గుప్పెడు తీసుకొని బొక్కడం ఆరంభించిరది. బిచ్చగాడు ఏమిన్నీ తెలుసుకోలేదు. ఆగోదావరి అతని ఆకర్షించింది. ఎర్రని కాంతులు గోదావరీమధ్యమున కొంతసే పాగినవి. అవి, క్రమముగామాయమైనవి. ఆచోటునందే కొంతతడవు తెల్లనికాంతులు నిలిచినవి. అన్నిదిక్కులనుంచీ చీకటి కమ్ముకువస్తోంది.సూర్యుడు



క్రుంకినస్థలమున కెదురుగా మాత్ర మీ కాంతులు నిండినవి. కొంత సేపటికి చీకటి తనగర్భములో యీ కాంతులనుకూడా దాచివేసింది. అంతా చీకటిమయము. చింత చెట్టుమీద మాత్రం మిణుగురులు మెరుస్తూవున్నవి. ఆకాశమున నక్షత్రములు అస్పష్టకాంతులతో ఆశా సందేశమును భూలోకమున కంద చేస్తున్నవి.

గోదావరి హోరుపెట్టుచున్నది. కీచురాళ్లు చెవులు గింగురుమనీలాగ కూస్తున్నవి. కలతజెందిన పక్షు లప్పుడప్పుడు చెట్లమీద కిలకిలలాడుచున్నవి. ఆసమయమున బిచ్చగాని కంఠమున వెల్వడిన యీగీతములను ప్రకృతి యాలించినది.

"నెన్ను తెలియక ఉన్నమతివై
తిరుగుమానిసి! సౌఖ్యమిదిగో
అంచుజూపిన సంజకెంపులు
అంతరించినవా!
తోరముగ కెంజాయతళ్కులు
తొలుక"గాతమి కులుక; యినుడ
స్తాద్రిమరుగున జేరి విడిచెను
నన్ను చీకటిలో!

ప్రకృతితోపాటు కోతికూడా విన్నది. విని ఉలికిపడి ఒడిలోనుంచి పైకిదుమికి నేరస్తుని చూపులతో ఆతని వేపుచూచింది. బిచ్చగాడు దానినిచూచి

"ఏమిచేస్తున్నావు యింత సేపటినుంచీ" అన్నాడు. కోతిపెదవులు కదల్చి పండ్లు చూపింది,

"సంచీలో బియ్యం అన్నీ తినేశావా" అన్నాడు. కోతి వెనుకకు ఒకగంతువేసింది.

"ఇలారా, ఎందుకు తిన్నావో చెప్పు బియ్యం?" కోతి కొంచెం శబ్దము చేసింది.

"ఆకలేసిందా? ఇందాకా ఊళ్లో రొట్టె ముక్క పెట్టించానుగదా, అప్పుడే ఆకలేసిందా? ఇలాగ నీకు అస్తమానం ఆకలేస్తుంటే నాకు ఆకలెయ్యకుండా వుంటే బాగుండును. నాకూ ఆకలివేస్తోంది ఏమిటి సాధనం". కోతి బుర్ర వంచుకుంది.

"నీవు గడించిన బియ్యమేకదా అని నువ్వు తినేశావా? నేను లేకపోతే నువ్వొక తైవ్రా గడించగలవా? ఆమాత్రం బుద్ధి వుండొద్దూ?" కోతి చలనములేకుండా బుర్ర వంచుకు కూచుంది. బిచ్చగాడు జోలిలో వున్న బియ్యం వెలువరించి చూచినాడు. రెండు గుప్పెళ్లు మాత్రం వున్నాయి. ఒళ్లో కోతి తినేటప్పుడు పడ్డబియ్యం పోగు చెయ్యగా ఒక గుప్పెడు అయినవి. ఆగుప్పెడు చేత్తో పట్టుకొని కోతిని పిలిచేడు. కోతి వచ్చిందికాదు.

"అప్పుడే కోపంవచ్చిందా? ఈ మాత్రం మాటకే కోపంవచ్చిందా? మాట పడకుండా బతక తలిచేవు కాబోలు యీ లోకం లో?"

కోతి బుర్ర యెత్తింది.

"దా, యిద, యీ బియ్యంకూడా తిను. రావేం." కోతి కదలలేదు.

"అవన్నీ తినేశావనే కోపంతో య... పెట్టడంలేదు. నిజంగానే పెడుతున్నా...

ప్రియసీ!

సంఘమునకు నేను దూరుడనగుటకు కారణం నీమీద అనిష్టముకాదు. స్వల్పమైన ఈజీవితకాలములో పొందదగినన్ని క్రొత్త అనుభవాలు పొందవలెననే యిచ్ఛయే ముఖ్య కారణం. కొన్ని సంవత్సరములైనపిమ్మట మళ్లీ మిమ్మల్ని చూడవస్తానుసుమా. ఈలోపుగా పిల్లలని ఆదరిస్తూండుసుమా. నే నెక్కడ వున్నానో అని మీరేమేనా ప్రయత్నాలు చేస్తే అవి నిష్ఫలం అనే మాట జ్ఞాపకం వుంచుకో. జీవితానికి ఆశ మారాకు అనే మాట మరిచిపోవద్దు. నేనెక్కడవున్నా మిమ్మల్ని తలుచుకుంటూవుంటాను కాబట్టి నువ్వూ పిల్లలూ నన్ను తలుచుకుంటూ వుండాలి సుమా. వెళ్లక తీరక వెళ్లే.

నీప్రాణనాథుడు.

యువకుడు కర్నూలుటిక్కెట్టు పుచ్చుకొని వెళ్లి అక్కడనుంచి బండిచేసుకొని ఆత్మకూరు వెళ్లి అక్కడనుంచి నడిచి శ్రీశైలం ప్రాంతములకు పోయినాడు. తినుటకు కావలసినంత తిండి యింట్లో వున్నప్పుడు భావోద్రేకాలు, కవిత్వాలు పుట్టినా తిండికి తడుములాడుకోవలసివచ్చినప్పుడు మాత్రము ఉత్సాహం కొంతవరకు క్షీణిస్తుంది. ఈయువకుడు కొండలబట్టి వన్యమృగములతోపాటు సంచరిస్తూ ఏ ఆకులో దుంపలో తింటూ కృష్ణానది నీరు త్రాగుతూ కాలం బుచ్చినాడు. ఇట్టి జీవితానికి అలవాటుపడిన పిమ్మట పూర్వభావములు మేలుకున్నాయి. పిట్టలతోపాటు పాడుకుంటూ, చెంచులతోపాటు వేటాడుతూ వన్యమృగములతోపాటు స్వేచ్ఛావాయువు పీలుస్తూ, కృష్ణాతటమున కరకురాలపై పరుండి, గొంతెత్తి గీతములు ఆలాపిస్తూ, సౌఖ్యమన్న తిని ఈయువకుడు చెందలేదని ఎవరు చెప్పగలరు? ఒకనాడు విచ్చలవిడిగా పెరిగిన, టుంకి చెట్ల క్రింద అనాడు తినుటకు పండ్లు నేరుకుంటూ యుండగా ఒకకోతిపిల్ల అతనికి చిక్కింది. తల్లిదండ్రులను ఏకారణముచేతనో గోల్పోయి దిక్కులేని యీమర్కటకిశోరము ఈయువకునిచే పెంపబడినది. వీరిద్దరూ ఆప్తులై ఒకరినిమెడబాసి ఒకరు ఉండడంలేదు. దేశమంతా తిరుగుతూ కొన్ని సంవత్సరములు అట్లు గడపి ఆ యువకుడు గోదావరి పునర్దర్శనము చేసికొనుటకు వెళ్లినాడు కోతితోకూడాను. ఆ యువకుడను నేనే, ఆకోతివి నీవే, వింటున్నావా. సుగ్రీవుడా!"

కోతి అతని తలప్రక్క నిద్రపోయినది.

౩

తొలికోడి కూసినది. తెల్లవారుజాము సుమారు మూడుగంటలైనది. చంద్రుడుదయించి రెండుబారలు ఆకాశముమీదకు వచ్చేడు. కోతి మెలకువ గాంచినది. నిద్రపోతూన్న బిచ్చగానిని లేపింది. లేచికూర్చుని అతడు కోతితో "సుగ్రీవుడూ, ప్రయాణానికి వేళయిందా?" కోతి జోలితీసి చేతికందిచ్చింది.

"పెడదాములే, ఇంకా పొద్దుంది. మొగము కడుక్కుని స్నానముచేసి పోదాము. ఒక పుల్ల తెచ్చిపెట్టు."

బిచ్చగాడు పళ్లుతోముకుంటున్నాడు.

"అయితే, సుగ్రీవుడా! రాత్రి కథ చెప్ప మని చెప్పతూవుంటే నిద్రపోయినావా? నిన్నేం చెయ్యమన్నావు?"

కోతి నవ్వింది.

"అవును నీకు నవ్వటాలే. నీవు వినక పోతే పోయేవు, మా గోదావరి వింటిలే"

కోతి పండ్లుచూపించి కోపాన్ని ప్రకటన చేసింది.

"అవును, నీవు చాలామార్లు విన్నకథ మూలాన్ని వినలేదా! అలాగ నాకు వుంటుందా! ఆత్మచరిత్రలు పునశ్చరణ యోగ్యములనే సంగతి మీజాతి కేం తెలుసును?"

స్నానాదికములైన పిమ్మట మనిషీ కోతీ గోదావరిగట్టును పుచ్చుకొని ప్రయాణం సాగి స్తున్నారు. వెన్నెల గోదావరిమీద పడి ప్రతిబింబిస్తోంది. గట్టులమీద పెరిగిన చెట్లు ఆకులను మెల్లమెల్లగా కదుపుతున్నాయి. గట్టుప్రక్కల గ్రామములలో కోళ్లుకూస్తు న్నాయి. ముసలివాళ్లు లేచినారు. బిచ్చగాని చూచి గ్రామకుక్కలు మొరగడం మొదలు పెట్టేయి. కోతి బిచ్చగాని బుజమెక్కింది.

ఇరువురూ వెన్నెలలో నడుస్తూ గోదా వరినిచూస్తూ పోలవరం జేరుకున్నారు. తూర్పు తెలతెలవారినది. బిచ్చగాని హృదయమున ఆనూరికొండలను, యిసుకతిన్నెలను చూడ డంతోనే, పూర్వానుభవములు, పూర్వ సంతోషములూ ఒక్కమారు ఉలిక్కిపడి లేచి నవి. వీథులవెంబడి కోతినాడిస్తూ బిచ్చగాడు తనకూ కోతికీ ఆనాటికి సరిపోయిన గ్రాసం సంపాదించుకున్నారు. ఇద్దరూ మధ్యాహ్న ఘంట్రెండుగంటలవేళకు గోదావరితీరమును జేరి భోజనము చేసుకున్నారు.

"సుగ్రీవుడా", ఈ ఊరు వదలి యింక మనము వెళ్లిపోవచ్చు."

కోతి బొమలు ఎత్తి "ఏల" అని ప్రశ్న వేసింది.

"యువకుని సంసారమిక్కడ లేదు."

మనిషీ కోతీ మధ్యాహ్నం బయలుదేరి, వచ్చినదారినే, నడచిపోయి, పట్టిసముచేరు కున్నారు. చెట్టుకింద యిద్దరూ మకాంచేశారు.

బిచ్చగాడు కోతినాడించడం మొదలు పెట్టేడు. పెద్దలూ పిన్నలూ అందరూ మూగి నారు. కోతి మొగ్గలువేసింది. సాముద్రికం చూచింది. పిచ్చివానివలె త్రాగుబోతువలె నటన చేసింది. ఏమి తెమ్మన్నా అది తెచ్చింది. కిందరాసిన అక్షరాలను గుర్తించి వాటిప్రకా రం చేసింది. అందరూ సంతోషించి తోచి నది యిచ్చిపోయినారు. చివరకు కొందరు పిల్లలు మాత్రము మిగిలేరు. బిచ్చగాడు యింతవరకూ దంచియుంచిన మొగమును పైకెత్తి పిల్లల నందరినీ తేరిపారచూచేడు.

"సుగ్రీవుడా, ఈబేడ ఆ అబ్బాయి కియ్యి."

కోతి ఒక అబ్బాయిచేతులో ఆబేడ పెట్టింది.

"వద్దు, నాకొద్దు,మా తాతయ్యకొడ్తాడు."

"మీ అమ్మ కొట్టదుకాదా" అన్నాడు భిక్షుకుడు.

"అమ్మ లేదు?" అన్నాడు బాలుడు.

"ఏమి?"

"అమ్మవారుపోసి చచ్చిపోయింది."

విచ్చిగాని నిండుహృదయ మొక్కమారు వెలితియైనది.

"పోనీ, నీ చెల్లాయిని కూడా తీసుకురా. కోతిని ఆడిస్తా."

"చెల్లాయి తాతయ్యదగ్గరవుంది, రాదు."

"అక్కయ్యో!"

"అక్కయ్య బావగారింటి కెళ్ళింది."

"సుగ్రీవుడూ, ఇంక వెడదాంపద."

"వద్దు, నాకీజేడవద్దు. తాతయ్య కొడతాడు" అన్నాడు బాలుడు.

"కొట్టడులే. తీసుకో అబ్బాయి, తీసుకో అమ్మా!"

[illegible] ఆ కోతీ అక్కడనుంచి బయలుదేరి మనిషీ [illegible] గబగబ ప్రయాణమైపోయేరు.

అట్టగట్టిన జుట్టూ, ఎర్రబారిన గడ్డమూ నల్లబడి రోమములతో నిండిన దేహమునూ చూచి యితడే ఆయువకుడని ఎవ్వరు గుర్తుపట్టబోయేరు, భిక్షుకుని భయమేకాని?

చీకటిపడినది. గోదావరినంటి దట్టముగా పెరిగిన రెల్లుదుబ్బులలో మకాంచేశారు మనిషీ కోతిని. వాయువు దుబ్బులమీదనుంచి రంయిమని వీస్తోంది. అప్పుడప్పుడు ఒకనక్క వారిని తొంగిచూచి పోతోంది. నక్షత్రకాంతులు మేఘముల వెనుక మాటుపడ్డవి.

"సుగ్రీవుడూ, చిల్లలకోసం ఆశపడి నేను బూరెలు తినడం మానివేశానా?"

కోతికీప్రశ్న అర్థంకాలేదు. మాట్లాడక వూరుకుంది.

"సుగ్రీవుడూ, చేతిలో వెన్నపెట్టుకొని నేను నేతికోసం పరుగులుపెట్టానా?"

కోతి మాట్లాడలేదు.

సుగ్రీవుడూ, అప్పులవల్లనే ఆనందంలేదనీ, లోకంలో ఎక్కువ ఆనందం వున్నదనీ మొదట వూహించేను. లోకాన్ని చూశాను. రెండూసమానమే అని తెలిసింది"

తొంగి చూడడానికి వచ్చిన ఒకనక్కను చూచి కోతి కిచకిచలాడి గంతులువేసింది.

నక్క పారిపోయింది.

సుగ్రీవుడూ, లోకంతో సంబంధంవున్న ప్రతిఆనందముకూ దుఃఖమనే కళంకం వున్నది. లోకంతో సంబంధంలేని ఆనందానికి కూ[illegible] కళంకంవున్నదం[illegible]వా?"

కోతి జోలి చేతికిచ్చింది.

"అవును ఆమాట నిజమే. ఆనందానికి రహదారి దుఃఖమే. ఈరహదారిదాటిన తరువాతనైనా నిష్కళంకమైన ఆనందం వుంటుందంటావా?"

కోతితలమీద చేతులుపెట్టుకొని గిర్రున తిరగడం మొదలుపెట్టింది.

"అవును కర్మానుభవంఅయితేగాని ఆనందం ఎక్కడ? పోనీ అయితే అయింది. రెండు మార్గాలు చూడనేచూశాము, కాబట్టి మూడోమార్గంకూడా చూద్దాముపద".

ఒంటరినక్క పొదలమాటునుండి కూత విూదను, బుజముమీదనున్న కోతిమొగము పెట్టింది. మేఘము వెనుకనుండి బయటకువచ్చిన విూదను పడ్డది.
సూర్యుని కిరణజాలము ఆకాశమునుండి గోదా కొంతతడవుకు చంద్రకిరణములు లోకము



కోతి తలమీద చేతులు పెట్టుకొని గిరుక తిరగడం మొదలు పెట్టింది.

వరిగడ్డిమొపైకి దిగజారి, అచ్చటినుండి ఉవ్వెత్తు నావరించి తమసావాసగాళ్ళకొరకు వెదకి తుగ నె ... కొన్నవి. వా రచ్చటను గానరాలేదు.
... గసి నిలుచున్న బిచ్చగాని మొగము



# విజ్ఞానబీజము

(వైద్యరాజ దంటు సుబ్బావధానిగారు)

కాలము తప్పివచ్చినది జ్ఞానము చిక్కదు విత్తనాలకున్
జాలెడువారు ముక్తి మిగుల జాల భరంబిక నార్య విద్య లే
జాలును జొవ్వనో యకట సర్వము మ్లేచ్ఛమయంబు ధర్మమున్
మూలము ముట్టుగా నణగెబో కటు కష్టము వెంకటేశ్వరా!




పొరనంది జగన్నాథస్వామి గారు, యం. ఏ., యల్. టి.

(మొదటిసంపుటము—ఎనిమిదవసంచిక తరువాయి)

## అంకము 3

### రంగము 1

[సుశీల మదనులు ప్రవేశింతురు]

క్షమింపుము, మదనా! ఒంటరిగా ఉండడమే నీకిష్టమని తెలుసును. నావల్ల నీకు వ్యధకలుగుతూ ఉందనికూడా నాకు తెలుసును. అందుకే, ఒకక్షణమే ఉండి వెళ్లిపోతాను. రూపసి గదిలోనుండి వస్తున్నాను. ఆమె అప్పుడే పడుక్కొని నిద్రపోతున్నది. ఆమె ముఖముపై నక్షత్రకిరణములు పడుతూఉన్నా, నేనామెను ముద్దుపెట్టుకున్నా, ఆమె లేవలేదు...... నీతో మాట్లాడుతూ అట్టేసేపు కూర్చొనులే. ఆమె నిద్రలోకూడా ఏడుస్తున్నది. కాబట్టి, మనము కలిసివెళ్లి ఆమెను లేపుదాము. నేను ఒక్కర్తినే లేపడానికిజంకేను. నిన్నొకటి అడగాలని అనుకొంటున్నాను. అదియుక్తమో అయుక్తమో నాకింతవరకూ తెలియదు. అలాగు అడగడంకూడా మంచిదోకాదో నాకు బాగా తెలియదు. రూపసిని అడగలేనుగదా! నాది పొరపాటైతే క్షమిస్తావుసుమా!

మదనుడు:—ఏమిటిది, సుశీలా? ఈలాగా! నా ప్రక్కను కూర్చో. నీవు మాట్లాడుతూ ఉంటె నీముంగురులు ఆడిస్తూ ఆడుకొంటూ ఉంటాను. నీకు నేను అగుపడను కాబట్టి, నీవు జంకకుండా ఎక్కువధారాళముగా మాట్లాడగలుగుతావు. నీ హృదయము నేదో చాలా చాలా బాధిస్తున్నట్లు ఉన్నది.

సుశీల:—నాహృదయాన్ని కాదు, నన్ను, నా ఆత్మను- దేనినో స్పష్టముగా చెప్పలేకున్నాను. ఏదోనాకు వ్యధకలుగజేస్తూ నా [illegible] ఏదో చెప్పుతున్నట్లు ఉన్నది. మునుపటికంటె, నాఆత్మ [illegible]మైనబంధము లేకున్నప్పటికంటె, ఇప్పుడు నాకు ఎక్కువ సుఖముగా ఉన్నది.

మదనుడు:—హృదయము ఎక్కువగా బాధపడుతూ ఉన్నప్పటికీ ఆత్మ సుఖముగా ఉండే సమయాలు ఉంటవి. ఇంతకూ దానిమాటకేమి? నీవు చెప్తానన్న దేదో చెప్పు. నిన్నరాత్రి ఇంత బాధిస్తున్నదేది?

సుశీల:—రూపసి వెళ్లిపోతుందట.

మదనుడు:—ఎవరు? రూపసా? నీతో ఆలాగు చెప్పిందా?

సుశీల:—అవును.

మదనుడు:—ఎప్పుడు? ........ఎందుకు వెళ్లిపోతుంది?

సుశీల:—ఎందుకో చెప్పింది కాదు. వెళ్లిపోవడము యుక్తమైన పని అనిన్నీ వెళ్లకలేరదనిన్నీ ఆమె అభిప్రాయము. ఆమె వెళ్లడముకంటె నేనే వెళ్లితే ఎక్కువ బాగా ఉంటుందని నాలో నేను అనుకొంటున్నాను.

మదనుడు:—ఎవరూ? నీవా? ఏమి? ఏమిటి జరిగింది?

సుశీల:—ఏమీ జరగలేదు. మదనా! ఈసంగతి ఏమిన్నీ రూపసితో చెప్పవద్దుసుమా! చెప్పితే అవసరములేనిదీ ఆమె కన్నీళ్లు ఒలుకుతవి. చూడు మదనా, మీరిద్దరూ కలిసి ఉంటూఉంటే నేను తోతమ్మ ప్రక్కను కూర్చొని ఈ సంగతు లన్నిటిని గురించి ఆలోచిస్తూఉంటిని. మిమ్మల నిద్దరిని చూసేవారికి మీరు ఎప్పుడూ ఎంతో సుఖముగా కలిసిమెలిసి ఉన్నట్టు కనబడేది. మీరు దగ్గిరగా వస్తూఉంటే మిమ్మలని చూచేవారికి మాట్లాడడానికి నోరు వచ్చేదికాదు. మిమ్మలని నేను అనుసరించలేదని నాలోనేను ఎన్నోమార్లు అనుకొన్నాను. మీరిద్దరూ నాపై దయగా ఉన్నందువల్ల ఈ సంగతి నేను అంతవేగిరముగా కనుక్కోలేకపోయినాను. నేను ఖిన్నురాలనై ఉంటేమీతో రమ్మని మీరు పిలిచేవారు. నేనున్నప్పుడు మీ రెంతో కులాసాగా ఉన్నట్లు కనబడ్డా మీ ఆత్మలు మాత్రము అపూర్వపు ఆనందముతో నిండియుండలేదని నేను పోల్చుకొంటిని. మీరిద్దరిమధ్యా నిరుత్సాహముతో పరాయిదానివలె నేను ఉదాసీనురాలనై ఉండేదానను. ఇందులో మీ తప్పేమీ లేదు. నాతప్పూ కాదు. నేను ఏమీ గ్రహించలేనని నాకు తెలుసును; కాని ఎప్పటికైనా గ్రహించవలసి ఉంటుందనికూడా నాకు తెలుసును.

మదనుడు:—ప్రేయసీ, సుశీలా! ఏమిటిది నీవు గ్రహించ లేననుకున్నది? నీకు తెలియనిదేదో ఒకటి ఉన్నట్లున్నూ మాకు అది తెలిసినట్లున్నూ నీవు అనుకొంటున్నావు. అది సరికాదు. మనలను ఆకర్షించేటట్లు ఎట్లు వ్యక్తపరుచుకోవలెనో ఆత్మకే తెలుసును. అలాగని గుప్తముగాఉండేది తక్కువసొగసైనదని నేను తలంచను. అవ్యక్తముగా ఉండడముచేతనే అది ఎక్కువసొగసుగా ఉంటుందిసుమా.

సుశీల:—ఆలాగుకాదు. నే నెంత ప్రయత్నించినా రూపసికీ నాకూ భేదముంటూనే ఉన్నది. నే నెప్పుడైనా ఒకమారు ఏమైనా చేసి నిన్ను సంతోషపెట్టిఉంటే, అందుకు కారణము నేను అప్పుడు రూపసిని అనుకరించి ఉండడమే.

మదనుడు:—సుశీలా!

సుశీల:—మదనా, నిన్ను నిందించాలనికాదు నేను ఆలాగుచెప్పడము. పూర్వమున్నటుల ఇప్పుడులేను. ఎవరినీ నేను నిందిం

చను. నేనెందుకిట్లు మారేనో నేనే చెప్పలేను. ఖేదము సుఖముగా పరిణమిస్తుందని కాని, నీవు ప్రేమించేవనితవేనని నేను ముద్దాడుతానని కాని కొన్నాళ్ల క్రిందట నాతో ఎవరైనా చెప్పిఉంటే నేను నమ్మకపోయి ఉందును. కాని అదంతా నా ప్రసక్తిలేకుండానే సంభవించింది. నాదుఃఖము పోగొట్టాలనే ఉద్దేశముతో నాపైనీకు వలపు ఉన్నట్లు నీవు చెప్పినా, రూపసితో నీవు చెప్పగలిగేదంతా నాతో చెప్పజాలవు గదా.

మదనుడు:—బహుశా నిజమే. సరిగా ఆసంగతులే నేను చెప్పలేకపోవచ్చును. సుశీలా, మనము నిజముగా చెప్పదలచుకొన్న సంగతులు మాటలలో చెప్పనే చెప్పలేము. మనము బాగా ప్రేమించేవారితో మనఃపూర్తిగా మాట్లాడాలని అనుకొన్నప్పుడు, మన చెవులు వినలేని ప్రశ్నలకు ప్రత్యుత్తరములిస్తూ ఉంటాము. వేరు వేరు ఆత్మలు రెండు ఒకేవిధమైన ప్రశ్నలు ఎప్పుడూ అడగనేరవు. అందుచేతనే, మనకు తెలియక పోవచ్చునుగాని మన మెప్పుడూ ఒక్కలాగే మాట్లాడలేము. ఒకసారి ఆడినమాటలు, తిరిగిమరొకసారి అలాగే ఆమాటలే ఆడలేము. ఇది నిశ్చయము సుమా. సుశీలా నీనిర్మలాత్మ వేసే ప్రశ్నలు కూడా ఆరూపసి ఆత్మనుండి వెడలే ప్రశ్నలంత సొగసైనవే. అవి మరొకకోస్తా నుండి వస్తవి; అంతేభేదము. కాబట్టి అందుకోసము నీవు ఎప్పుడూ ఖేదపడకు. దా, ఏదీ ముద్దియ్యి. ఏదీ నీరక్తాధరము. సుశీలా! ఈరాత్రి నీయాత్మనే ముద్దాడుతున్నానే......రా, దా, అదిగో ఘోరాగంట కొట్టుతున్నారు. మనముపోయి రూపసి ఇంకా నిద్రలో విలపిస్తున్నాదేమో చూతాము.

[ఒకరిచేతులు ఒకరుపట్టుకొని వారిరువురు పోవుదురు.]

రంగము 2

ఇంట్లో ఒక గది

[రూపసి మదనులు ప్రవేశింతురు]

రూపసి:—తలుపువేసినచప్పుడు వినబడ్డాదా? ఆతలుపు ఎవళ్లో వేసుకొని వెళ్లిపోయేరు.

మదనుడు:—విన్నాను, ఎవరు?

రూపసి:—సుశీల అయియుంటింది. మనరాక చూచి మనమేకాంతంగా కలిసి ఉండాలనే ఉద్దేశముతో వెళ్లిపోయింది.

మదనుడు:—తిరుగోపురముమీదికి వెళ్లవాకేసరికి వెళ్తానని నాతో చెప్పింది. అక్కడికి ఒకవింతపక్షి వచ్చిందని వాళ్లందరూ ఆమెతో చెప్పేరట.

రూపసి:—అలాగుకాదు. ఈగదిలో ఇంతసేపూ ఉండి ఇప్పుడే ఆమె వెళ్లిపోయిఉండవలెను. ఆమెరాకకొరకు గదంతా ఎదురుచూస్తున్నట్లు కనిపిస్తూన్నాది చూడు. కిటికీలో పడిఉన్న సామానుచూడు పట్టుదారము అసరుకులు, అజలతారుఉండలు అవన్నీ చూడు ఏలాగుపడిఉన్నాయో. సగముపనిలో విడిచివెళ్లినట్లు ఉన్నవి.

మదనుడు:—అవును. ఇదిగో ఆమెఉంగరము మనఇద్దరిపేర్లు దానిమీద చెక్కించింది చూడు... ఇవిగో పువ్వులు; ఆమెచేతిరుమాలు. [ఆ రుమాలు తీయాలని చేయి చాచి వణికినాడు.] హా!

రూపసి:—ఏమిటి?

మదనుడు:—ఇదిగో చూడు చేతిరుమాలు (అనిఅందిచ్చెను)

రూపసి:—హా !

మదనుడు:—ఆమె బాష్పములవేడి ఇంకా దీనిని పట్టిఉన్నది.

రూపసి:—మదనా, చూచేవా; ఆమెమాట్లాడకపోయినా, ఈ చిన్నచిన్నవస్తువులన్నీ ఆమెతరఫున మాట్లాడుతున్నవి. సమయమువచ్చినదని ఇకనైనా అంగీకరిస్తావా; అంగీకరించకతీరదుసుమా. [ఆచేరుమాలు తీసుకొని] దానిని నాకిమ్ము. మదనా మనకు తెలియని ఎన్నోసంగతులకు ఇది ఒకసాక్ష్యము. ఇంకాకూడా స్పష్టముగా తెలియలేదనేవాళ్లు ఉంటే, వారు బండరాయివంటివారు.

మదనుడు:—రూపసీ! [అనిముద్దాడ బోవును]

రూపసి:—నన్ను మరిముద్దాడకు...ఆమెను చక్కగాప్రేమించుము.

మదనుడు:—దేనిననమ్మడమో నాకు తెలియకుండాఉన్నది, రూపసీ. నీపై ఎంతప్రేమ ఉన్నదో, ఆమెపైకూడా అంతప్రేమా నాకుకలదని ఒక్కొక్కప్పుడు తోస్తుంది. నీహృదయము గ్రహించినంత చక్కగా ఆమెఆత్మ తెలుసుకోకపోవడముచేతనూ, నీకంటె ఆమె నా అవగాహనానికి దూరము అగుటచేతనూ, నీకంటె ఆమెపైనే నాకు ఎక్కువప్రేమ ఉన్నదా అని ఒకొక్కప్పుడు తోస్తుంది. నిన్ను మళ్లా కలుసుకోగానే ఆమె నాభావనలోకైనా రాదు. ఆమెనుగురించి మరితలపే ఉండదు.

రూపసి:—నీకు ఆమెపై ప్రేమ బాగాఉన్నదని నాకు తెలుసును అందుచేత నేనే వెళ్లిపోవలెను.

మదనుడు:—రూపసీ, నీద్వారానే ఆమెపై నాకు ప్రేమకలుగుతున్నది కాబట్టి నీవుగాని వెళ్లిపోతే, ఆమెను మరిప్రేమించలేకపోతానుసుమా.

రూపసి:—మదనా, నీకు ఆమెపై ప్రేమకలదని నాకు బాగా తెలుసును. ఆమెయెడల నీవు చూపేప్రేమకై నాకు ఒకొక్కప్పుడు ఆమెపై ఈర్ష్య కలుగుతున్నదా అని అనుకొంటుంటంతవరకూ మీ ఇద్దరిప్రేమగురించి నాకు తెలుసును...ఎందుకు అలాగు చూస్తావు.ఆహా! నేనుమాత్రముఏలోపము లేని సుగుణమూర్తినా? అలాగు భావిస్తే, పొరపాటునీదే. పూర్వము ఉన్నట్లు సుశీల ఇప్పుడు కనబడలేదంటె నేనున్నూ మీతో కలిసి ఉండుటచేత చాలా మారిపోయినాను. అవసరమునకు మించిపోయినంత తెలివి నాకు ఇక్కడికివచ్చేసరికి ఉండేది. సౌందర్యమువలన కన్నిరొలుకుట సంభవిస్తే సౌందర్యాన్ని అందుకు నిందించకూడదనిన్నీ, బుద్ధిలేనప్పుడు వట్టి మంచితనము అనర్థమనిన్నీ నేను భావిస్తూ

...దానను. కాని ఇప్పుడు నా అనుభవ...ల్ల నేను తెలుసుకొన్నది మరొక వి...నము ఉన్నది. మంచి అంటే మానవసంబంధమైన దనిన్నీ అందుచేతనే అప్పుడప్పుడు కొంత తెలివి తక్కువైన దనిన్నీ నేను ఇప్పుడు గ్రహించేను. స్త్రీ లందరిలోను నేను ఎక్కువ సుందరి నని అనుకొంటూఉంటిని; కాని అల్పులుకూడా నా అంత సుందరమైన వారే అనిన్నీ వారిసౌందర్యము వారికి తెలియకుండా ఉండవచ్చుననిన్నీ నాకు ఇప్పుడు అనుభవమైనది. సుశీలయొక్క కోమల హృదయమునుండి వ్యక్తమయే భీరుతావిలాసములు నేను చూపగలిగేవాటికంటె ఎన్నోరెట్లు నిర్మలములై ఆహ్లాదకరములు కూడా కాలేదా అని సుశీలను చూచేటప్పుడెల్లా నాలో నేను మననము చేస్తూ ఉంటిని. ఆమెలో అనిర్వచనీయసౌందర్యముకలదని నాహృదయము నాకు తెలుపుతూఉన్నది. ఆమెచేతులు చాచితే చాలును; ఆచేతులు ఆమెహృద్గతనిధులతో నిండిఉండును. చేతులనిండా అమూల్యములైనరత్నములు ఉన్నవని ఎరగనిఅంధురాలైన చిన్నపిల్లవలెనే ఆతరలగాత్రి తననిధులను సమర్పిస్తుంది.

మదనుడు:—రూపసీ, ఎంతచిత్రము నీవామెగురించి నాతోప్రసంగిస్తూఉంటే నిన్నే నేను మెచ్చుకొంటూ మరీఎక్కువగా నిన్ను మోహిస్తున్నాను. నీవామెను పొగుడుతున్నావు కాని ఆపొగడ్త అంతా తిరిగి నీకే చెందుతున్నాది. ఒక్కటేమాట ప్రపంచములో దేదీఇకమార్చలేదు. ఈశ్వరుడు సంకల్పించినానగే మరొక విధాన కానేరదు. ఆమెయెడలగల ప్రేమ నీయెడలగల ప్రేమకు పీసమాత్రైనా సరిపోలేదు.

రూపసి:—నేనిక్కడకువచ్చినప్పుడు అన్నీ నాధ్యమనిన్నీ ఎవరికీ వ్యథకలుగ అక్కరలేదనిన్నీ నమ్మియుంటిని. కాని జీవితము మాత్రము మనము సంకల్పించుకొని తయారుచేసే ఏర్పాటులకు సరిపడకుండా ఉన్నదని నేను ఇప్పుడు తెలుసుకొంటున్నాను. నేను నీతో కలిసిఉంటూ, ఇతరులకు వ్యథకలుగచేస్తూఉంటే, నీవేనేనని, నేనేనీవని ఉండలేము. ఈనాటిమనప్రేమవలె ఇకముందు మనప్రేమ ఉండదు.

మదనుడు:—నీవన్నదే వాస్తవము కావచ్చును. అయినా మనప్రవర్తన ఋజువైనది కాకపోతుందా ?

రూపసి:—ఆ, మదనా, ప్రవర్తన ఋజువైనదా కానిదా అనేచర్చతో లాభము లేదు. ఋజుప్రవర్తన లేని వారికైనా కన్నీరొలికేటట్లు నడచుటకంటె, జన్మమంతా తప్పుమార్గములో ఉండుటే మేలని నేను తలుస్తాను. ఈవిషయమై ఎవరేమి చెప్పతూఉంటారో నాకు తెలుసును. కాని అదంతా ఎందుకు? ఈవిధముగా చెప్పేదానికంటె లోతైనతత్వమును ఈ మాటలు లవంతైనా మార్చలేవని తెలిసిన్నీ, మంచిచెడ్డఅనేమాటలే తి... చెప్పతూఉండడమెందుకు? ...

త్కారపుమాటలునిరసించేఈతత్త్వమునే మనము గ్రహించాలి. మనము చెప్పేది, చేసేది ఏలాగున్నా, నిజముగా సరళస్వభావమే మనజీవితమును నడుపుతూ ఉంటుంది. సరళమైనదానికి వ్యతిరిక్తముగా ఉండే ప్రవర్తనంతా నిష్ఫలమై పోతుంది. మనము ఇంతఆలస్యముగా కలియడము ఎందుకు తటస్థించాలి? ఇంతకూ విధికృతమున్నా అదృష్టమున్నా ఒక్కటేకావని ఎవరు అనగలరు?

మదనుడు:— [రెండుచేతులతోను నిండా ఆమెను కౌగలించుకొని] రూపసీ, నీపై నాకు నిండాప్రేమఉన్నది. మనలో ఉద్భవిస్తూ ఉన్నదే ప్రశస్తమైనప్రేమ.

రూపసి:—[రెండుచేతులతో వానికంఠమున చుట్టుకొని] మదనా, నీపైనాకు నిండైన ప్రేమ ఉన్నదిసుమా. మనలో ఉద్భవిస్తున్నప్రేమ ఎప్పటికీ నశించదుసుమా. [నిశ్శబ్దము.]

మదనుడు:—మనమిద్దరమూ దూరమైనప్పుడూ, ఈనాటి మననిండుప్రేమ అంతకంతకు తిరిగిపోయి క్షీణించినది జ్ఞప్తికిరాక, అన్నివస్తువుల వలెనే క్రమక్రమముగా అస్ఫుటము అయినప్పుడు మనజీవితము ఏలాగుండునో ఆస్థితిగురించి ఏమైనా ఆలోచించినావా? ...వచ్చేసంవత్సరము నేనేమిచేస్తానో, నీవేమిచేస్తావో, ఎక్కడ ఉంటామో! మనము దూరముగా ఉండి, ...నేనూ కలియాలనిఆశపడుతూ శూన్య అంతకాలముమీదుగా చేతులు చాస్తూ ఉత్కంఠహృదయములతో ...దర పడుతూ ఉంటే, మందగతిగల సామీప్యము ఒప్పనిదూరము మన చికాకుపడును కాబోలు. మనమధ్యను అడ్డముగా సంవత్సరాలు, దినాలు, అడవులు, చెట్లు పెరిగి వ్యాపించి మనలనిద్దరినీ విడబరుస్తూఉంటే; మనప్రేమ మాత్రము ఎట్టిమార్పు చెందకుండా స్థిరముగా ఉంటున్నాదని మన మెంతచెప్పకొన్నా, ఒకటి మాత్రము వాస్తవము: మనవియోగము హెచ్చు అవుతూ ఉండడముచేత మన ప్రస్తుతప్రేమ బాగా జ్ఞాపకానికిరాక.వాడిపోయి కృశించినదానివలెనే అస్ఫుటముగా వ్యక్తమవుతూ ఉండుట చాలామార్లు సంభవించక మానదు.

రూపసి:—మదనా, నాకాసంగతి తెలుసును. ...ఇక్కడ మనము సుఖముగా ఉండవచ్చును. అక్కడో దుఃఖము తప్పదు. అయినప్పటికీ నేను చేస్తానన్నపనే చేయదగిన పని అని మనమిద్దరమూ భావిస్తున్నాము. నన్నిక్కడ శాశ్వతముగా ఉంచివేయగలిగేమాట అనుట సాధ్యమైనా, నీవుదానిని అనవు. అనరాదుకూడాను. ఇతరు లెవరూ ఆశించనిదానిని ప్రేమించేవారందరూ ఇతరులభావనలోనికైనా రాని దుఃఖములకు పాత్రులుకావలసినదే. దుఃఖములు అనుభవించినంతమాత్రాన ప్రతిఫల ముంటుందనిఅనుకోకూడదు. ఒకవేళ ఉంటుందన్నా మనము ఉభయులమూ దేనిని కోరవలసినవారము కాముకదా. [నిష్క్రమింతురు.]

## రంగము 3

### గోపురము క్రింద

[రూపసీమదనులు ప్రవేశింతురు]

రూపసి:—నేను ఆమెనుచూచి ఒక్కనిమిష మైనాకాలేదు. సముద్రమునుండివచ్చే నీటికాకులు అరుస్తూ ఆమెచుట్టూ ఎగురుతూ ఉంటే, ఆమె వాటితో ఆడుకొంటూ గోపురముమీద కనబడ్డది. రెండుమూడు రోజులనుంచీ ఇరవైనాలుగుగంటలూ అక్కడే ఉంటూఉన్నది. అదేమోకాని ఇదంతా చూస్తే ఒకవిధమైన వింతవింత ఊహాపోహము నామనస్సులో పొడచూపుతున్నది. మునుపటికంటె తక్కువగా దుఃఖపడుతున్నట్లు పైకికనబడ్డా, మనస్సులో మాత్రము ఎక్కువగా బాధపడుతున్నట్లు అగుపడడముచేత ఆకోమలహృదయములో గంభీరముగా ఏదోపన్నుగడ తయారవుతూ ఉండెనేమోఅని నాకు తోస్తుంది.

మదనుడు:—పూర్వస్థితిని జ్ఞాపకము తెచ్చుకొంటూ, నవ్వుతూ ఉండెనుకాబోలు. పిచ్చిదా ఏదో ఒకచిన్న పాట పాడుతూ ఉండేదికాదూ? ఆమెను ఆవరించుకొని, ఒకవిచిత్రమైన తేజస్సు ఉన్నట్లు మనము వలె ప్రసరిస్తూఉన్నప్పుడు అగుపడేది. చూడు; ఆమె కొంచెము శాంతిపడేదాకా నీప్రయాణమునంగతి ఎత్తడము మంచిది కాదు; ఆమె హృదయములో ఉద్భవిస్తూ ఆమెను తారుమారుచేస్తూ ఉన్న అభావనలు స్థిరపడి ఆమెఆత్మలో నాటుకొనే వరకూ మనము ఆఊసు ఎత్తవద్దు.

రూపసి:—అలాగుకాదు. ఈరోజున నేను ఆమెతో చెప్తాను. ఏమిటి చెప్పడమో కూడా బాగా ఆలోచించేను; ఆమె ఎక్కువనొచ్చుకోకుండా ఉండాలని వాస్తవమైన కారణము మరుగుపరచాలని మొదట అనుకొన్నాను...అలాగునవ్వకు, మదనా, నేను అనేకవిషయాలలో అందరిఆడవాళ్ల వంటిదానను కాకపోవడముచేత, అబద్ధము చెప్తానంటే నీకువింతగాతోచిందికాబోలు, కాని నా హృదయాంతరస్థముగా నాకున్నూ వంకరటింకర అల్పబుద్ధి అందరిఆడవాళ్లకూ ఉన్నట్లే ఉన్నది; కామదేవుని ఆజ్ఞప్రకారము నా అక్కచెల్లెళ్లవలె నాకున్నూ ప్రేమసంబంధమైన అసత్యము సులువుగా అబ్బుతుంది. నీపై నాకు వలపులేదనిన్ని, ఉన్నాదని భ్రమపడి మోసపోతిననిన్ని, ఏమాత్రమైనా ఎప్పుడైనాఉంటె అది హరించిపోయినదనిన్ని, ఏవేవో చాలాచాలా చిన్నచిన్న సంగతులు చెప్పదామని నిశ్చయించెను. అలాగు చెప్పడమువల్ల ఆమెకు నాయందుగల గౌరవముతగ్గినా, ఆమెదుఃఖము కూడా తగ్గుతుందని నాఅభిలాష. కాని ఈలాగు చెప్పడము ఉచితముగా లేకపోవుటచేత, ఆమె స్వచ్ఛమైన విశాలనేత్రములు నాకంటపడగానే, అలాగుచెప్పడము అసంభవమైపోయినది;—మరిచెప్పలేకపోయినాను, విను; ఆమెకంతస్స్వ

రము వినబడుతున్నది; విను. చల్లగా పాడుకొంటూ గోపురముమెట్లు దిగుతూ ఆమె వస్తున్నది...మదనా, నీవు వెళ్లిపో. ఆమెతో నేను మాట్లాడవలసినది ఉన్నది. నీతో చెప్పలేనిసంగతులు నాతో చెప్పు తుంది. అంతేకాకుండా ఇద్దరెవరైనాముూడో వాళ్లులేకుండా ఒంటరిగా ఉన్నప్పుడే, నిజము స్వర్గమునుండి ఊటిపడ్డట్లు సరిగా హృదయమునుండి పైకి ఉబ్బిపొర్లి పడు తూవస్తుంది.

[మదనుడు వెళ్లిపోయినాడు. నిశ్శబ్దము. సుశీల పాడుతున్నగీతము రానురాను స్పష్ట ముగా వినబడడము ఆరంభించినది.]

(సుశీల ప్రవేశము)

రూపసి:—సుశీలా, నీకళ్లలో ఈరోజు వింత కళ కనుపిస్తున్నది.

సుశీల:—అవును, రూపసీ, నాకొక చక్కని భావము తలపుకు వచ్చినది.

రూపసి:—నాతో చెప్పుమీ వింటాను. చక్కని భావములు దాచివేయకూడదు; విని ప్రపంచమంతా సుఖపడుతుంది.

సుశీల:—అబ్బా, నీతో ఇప్పుడిప్పుడే చెప్పను. సుశీలకుకూడా రహస్యాలుఉంటవి; ఆత లంపు ఎప్పటికీకూడా రహస్యముగానే ఉండాలి...నీవే సుశీలవైయుండి, మరొక రూపసి, నీకంటే రూపవంతురాలు, మరొ కర్తెవచ్చి, మదనుని బాహువులుచాచి కౌగలించుకొంటె నీ వేమిచేస్తావోగదా!

రూపసి:—సుఖముగా ఉండడానికి ప్రయత్న ముచేస్తాను. ఇంటిలోనికి క్రొత్తతేజస్సు ఒకటివచ్చిందిగదా అని సంతోషిస్తూ, నీవు నాయెడల ప్రేమతోఉన్నట్లే ఆమె పై ప్రేమతో ఉంటాను.

సుశీల:—నీకు మత్సరము కలగదూ?

రూపసి:—చెప్పలేను సుశీలా... బహుశా హృదయాంతరములో పొటకరిస్తుంది కా బోలు... ఒకవేళ పొటకరించినా ఒక్క నిముషమే...వెంటనే అది ఉచితముకాదని గ్రహించి, సుఖముగా ఉండవలెనని ప్రయ త్నము చేస్తాను!

సుశీల:—రూపసీ, ఇక నేను సౌఖ్యపడతాను.

రూపసి:—నీవిక ఒక్కక్షణమైనా దుఃఖ ముతో మరి ఉండవు.

సుశీల:—నాఆలోచన మంచిదే అని నాకు నిశ్చయమైతే నాకుఎంతా సుఖమే ఇక.

రూపసి:—సుశీలా, అయితే, నాకుచెప్ప కుండా ఏదో కొంత దాచివేస్తున్నావు గదూ?.

సుశీల:—అవును. కాని, అదిస్ఫుటమై చక్క నిది అయేవరకైనా దాస్తాను. ఆతరు వాత...

రూపసి:—ఎప్పటికి ఆచక్కదనము కుదర దము?.

సుశీల:—నాకు తెలియగానే... సుశీలకూడా చక్కగానే ఉంటుంది...చూస్తావుగదా... నీవు, మీాఇద్దరూ అప్పుడునాయెడల చాలా ప్రేమ చూపిస్తారు.

రూపసి:—ఇప్పుడు ఉన్నప్రేమకంటేనూ ఎక్కువప్రేమచూపుట సాధ్యమా?

సుశీల:—నీవే నేనైతే ఏమిచేసిఉందువో తెలుసుకోవాలని చాలా కుతూహలముగా ఉన్నది.

రూపసి:—సరేగాని చెప్పుమా సుశీలా...

సుశీల:—నేను ఒకవేళ చెప్పినా, చెప్పిందీ, తలచుకొన్నదీ ఒక్కటేకానేరవు. అంతేకాకుండా నీవుకూడా అప్పుడు నిజము చెప్పలేకపోతావు.

రూపసి:—నేను నిజము చెప్పుతుండలేదూ?

సుశీల:—అవునులే, ఇదివరకు నిజము చెప్పుతూఉండేదానవు. ఇప్పుడుమాత్రము నిజము చెప్పలేదు.

రూపసి:—సుశీలా, ఇవ్వాళ అంతా వింతగా ఉన్నావు నీవు. కాని నీవు పొరపాటు పడ్డావేమో జాగ్రత్త.

సుశీల:—ఎంతమాత్రమూ పొరపాటుకాదు; ముమ్మాటికీకాదు... రూపసీ, ఏదీ ఒక ముద్దు...నేను పొరపాటుపడలేదని ప్రతి ముద్దూ ఘోషిస్తున్నదిసుమా.

రూపసి:—నీఆత్మ నీలోపల సంతోషముతో గెంతుతున్నదా అన్నట్లు నీ కళ్లు ప్రకాశిస్తున్నవి.

సుశీల:—నీవైతేదాచివేయాలని ప్రయత్నము చేస్తున్నావు కాని, నీకండ్లలో కూడా తేజస్సు ప్రకాశిస్తున్నది.

రూపసి:—నాలోనూ ఒక ఆలోచన ఉన్నది సుశీలా. నీతో చెప్పవలసినదేకూడా.

సుశీల:—ఏమిటది, రూపసీ, నాలాగే నీవు కూడా చెప్పడానికి భయపడుతున్నట్లు ఉంది. నాదీ నీదీ ఒక్కటేనే ఏమిటి చెప్పవూ?.

రూపసి:—సుశీలా, ఏమిటన్నావు నీదీనాదీ... ఏమిటి?

సుశీల:—ఏమీలేదు; ఏమీలేదు...నేనేదో ...వేగిరముగా చెప్పవు నీతలపేమిటో...

రూపసి:—సుశీలా, నేను చెప్పితే, నీకు వ్యథ కలుగుతుందేమో సుమా, వాస్తవముగా నీకు అందువల్ల సుఖమే రావలసిఉన్నా...

సుశీల:—రూపసీ, మరి ఏడవను; ఒక్కచుక్కైనా కన్నీరు ఒలుకనీయను.

రూపసి:—[చేయిపట్టుకొని] సుశీలా, నీవనే మాటకు అర్థమేమిటో చెప్పమా, అంతా చాలావింతగా మాట్లాడుతున్నావు.

సుశీల:—వింత ఏమీలేదు. మరిఏడువను. అంతే. ఏమి? అదేకదూ యుక్తమైనది!

రూపసి:—ఏదీ, నావైపు కళ్లువిప్పిచక్కగా చూడు.

సుశీల:—సరే, చూచి, నీకేమి అగుపడ్డదో చెప్పు.

రూపసి:—ఆత్మకు సంబంధించినదంతా కండ్లలో వ్యక్తమవుతుందని మనము ఎంతచెప్పుకొన్నా, తీరా కండ్లవైపు తేరిపారిచూస్తే అంతా మాయమయి పోయింది. నేను వ్యక్తముచేయలేని భయములకు లొంగిపోతూ నీస్వచ్ఛమైన కన్నీటిప్రవాహము ముందర వేయవలసిన ప్రశ్న పొందుపరచలేకుండా నేను నిలుచున్నప్పుడు నాకు ప్రత్యుత్తరముఇచ్చుటకు బదులుగా నన్నే

ఆచంచల నేత్రములు "నీ వేమిటికని పెట్టాలని అలాగు చూస్తున్నావు" అని అడుగుతూ ఉన్నట్లు ఉన్నవి.

[నిశ్శబ్దము]

సుశీల:—రూపసీ......

రూపసి:—సుశీలా...

సుశీల:—నీవు చెప్పాలనుకొన్నది ఏమిటి?

రూపసి:—సుశీలా, ఈలాగుదా. చూసేవా, ఇంకా మరికొంచెము అయినట్లైతే, తనకీ ప్రపంచములో ఉన్నదంతా నేను దోచుకొని ఉందునుగదా.

సుశీల:—విచారముగానున్నావు, రూపసి?

రూపసి:—దా, సుశీలా, ఇక్కడ నీగోపురము ద్వారమువద్ద కూర్చొందాము, రా. నీవు నేను మొట్టమొదట కలిసినప్పుడు ఏలాగు ముద్దాడుకొంటూ కలిసికూర్చొని ఎట్లు మాట్లాడుకొన్నామో, అలాగు మాట్లాడుకొందాము, రా. జ్ఞాపకముందా, ఆవేళ నూతి ఒడ్డున జ్ఞాపకముందా; సుశీలా, నేల క్రిందట...; ఉన్నవస్తువులు ఎన్నో ఈలోపున నశించిపోయినవి; లేనివి ఎన్నో పుట్టినవి; ఆత్మకు నూతన తేజస్సు ఎన్నోచోట్ల కలిగినది... ఇటువంటి సమయము ఒకసారైనా మరి మనకు దొరకదు; రేపు ఉదయము నేను మిమ్ములనందరిని విడిచి నాదారిని పోతాను. ఇటిసిత్థిలో ఉన్న మనహృదయములు తుదకు మనము చేయ జాలేమనివల్ల క్షోభిస్తున్నట్లు ఉన్నవి...

సుశీల:—రేపా వెళ్లాలని నీఉద్దేశము?

రూపసి:—అవును సుశీలా, రేపే, అదే నీతోనే నేను చెప్పాలి అని అనుకొన్నది. ఒక్కమారు గర్భీమని వింటవచ్చే దుఃఖమంతా నీహృదయమును భేదించకుండా ఉండాలని నిజము చెప్పడము మానివేదామని మొదట తలచినాను. కాని నీసంగతి ఆలోచించగానే, అలాగు కుదరదని నాకు తట్టింది. నీకు సుఖముకలుగవలెననే నేను వెళ్లడానికి నిశ్చయించేను. నేనేమీ దాచకుండా ఉన్నదిఉన్నట్లే చెప్తాను చూడు. వెళ్లిపోవడము నాకు చాలాదుఃఖముగా ఉంటుందని నీకు తెలుసును. కాని మనమందరమూ ముగ్గురమూ కూడా కొంతకొంత త్యాగము చేయకతీరదు. ఈ త్యాగమంతా అన్నిటికంటె ప్రబలమైనదానికొరకే అని మనకందరికి తెలుసును. అట్టిత్యాగమునీవు కూడా చేస్తున్నావు అని నాకు తెలుసును.

సుశీల:—రేపు నీవు వెళ్లవద్దు.

రూపసి:—రేపు ఎందుకువద్దు, వెళ్లక తప్పక పోయినప్పుడు?

సుశీల:— నేను చెప్పవలసినది చెప్పినదాకా నీవు వెళ్లవద్దు.

రూపసి:—అయితే త్వరలో చెప్పివేయి.

సుశీల:—సరేకాని, ఇప్పుడు నీవు నాతో చెప్పినది మదనునికి తెలుసునా?

రూపసి:—తెలుసును.

సుశీల:—నాకు మరివిచారములేదు, రూపసి.

రూపసి:—నీతో చెప్పకుండా వెళ్లిపోతే ఏమి చేసిఉందువు, సుశీల?

సుశీల:—నీ వెనకాతలే నిన్ను వెంబడించి వచ్చి, నిన్ను తీసుకొని వచ్చిఉందును.

రూపసి:—నేను అగుపడకపోయిఉంటే?

సుశీల:—నిన్ను వెదకడముకోసమే నాజీవితమంతా వినియోగపరిచి ఉందును.

రూపసి:—నాకంటెముందరే నీవు వెళ్లాలనా నీఉద్దేశము? అదేనా నీవనేది ?

సుశీల:—అలాగుకాదు. అలాగైతే ఖేదము తప్పదు. సుఖముగురించే నేను ఆలోచిస్తూఉండేది. ఎవరితోను ఒక్కమాటైనా చెప్పకుండా వెళ్లిపోదామా అని నేనున్నూ ఆలోచించేను; కాని ఇప్పుడు....

రూపసి:—అందుచేత నీవు వెళ్లవుగదా?

సుశీల:—రూపసి, వెళ్లను. అబ్బా, ఈఇల్లు విడిచిపెట్టను.

రూపసి:—అది నీనిశ్చయమేకదా, నీహృదయములోనుండి వచ్చినసంగతేకదా. అది ఖరారేనా!

సుశీల:—ఆహా, అలాగే, నాకు శాశ్వతసుఖము ఉండాలని, అలాగే.

రూపసి:—నేను రాకపోయి ఉంటే బాగా ఉండియుండును కాబోలు.

సుశీల:—అలాగైతే సుఖమూలేదు, దుఃఖమూలేదు. నాకు నేనేవ్యక్తముకాకుండా ఉండిపోయి, నేను అనేవస్తువే లేకపోయి ఉందును.

రూపసి:—చూడు, నిద్రపోతూఉండేవాళ్లను లేపడము మంచిదికాదు; అందులోకి ఆనిద్రలో వాళ్లు సుఖముగాను, సరళముగాను ఉన్నప్పుడు, మరీకూడదు.

సుశీల:—అవును నిజమే లేపివేస్తే, మళ్లానిద్రపోవుటకు ఇష్టపడరు...నాకళ్లు విప్పిచూడక ముందు నేనున్నస్థితి జ్ఞప్తికివస్తే, నాకే సిగ్గువేస్తుంది; ఎవరికీ కన్పబడకుండా, దాగుండాలని ఉంటుంది, ఏమీ తెలియకుండా గుడ్డిపిల్లవలె, మదనుని ముద్దాడేదానను,...కాని, చూడు, నాకేమి తెలియక పోవడానికి, అంతకీ, నేనేకారణమా ? అంతానాతప్పేనా ? ...ఇప్పుడో, రాత్రి నిద్రపోతూఉంటే మదనుని చూచేను; అప్పుడు, ...రూపసీ, చెప్తా...

రూపసి:—[కౌగలించుకొని] సుశీలా, ముద్దులగుమ్మడీ.

సుశీల:—అవును, అప్పుడు ముద్దాడేను; అతను మాత్రము లేవలేదు. నాకేలాగుఉండెనంటే, ఆకిటికీలనుండి కనబడుతున్న చుక్కలన్నీ ఆకాశమువిడిచిపెట్టి నాహృదయములో ఉండిపోయి అక్కడే ఒకస్వర్గము నిర్మిస్తున్నాయా అని తోచింది. రూపసీ, నీకే ఆనందము తెలియదుగదా. అన్నీ ఇదివరకే నీకుతెలిసియుండడముచేత నాకు ప్రాప్తించిన ఈ అపూర్వానుభవము నీకు ఎందుకు ? నీవు మోహించినవానితో "నీపై నాకుప్రేమఉన్నది" అని కండ్లు విప్పి చూస్తూ చెప్పడమంటే ఏమిటో, ఇప్పుడు తెలిసింది...అయినా వెళ్లిపోవాలని, చచ్చిపోవాలని నాకెందుకు ఊహ మళ్లామళ్లా కలుగుతూ ఉంటుందో నాకు తెలియకుండా

ఉన్నది...నాకు సుఖముగానే ఉన్నదికాని ఇంకా ఎక్కువసుఖముగా ఉండడానికని చచ్చిపోవలసిఉంటే కులాసాగా చచ్చిపోతాను.

రూపసి:—చాలాచాలా సుఖముగా ఉన్నప్పుడు మాత్రము చావుగురించి ఆలోచించుట చాలా ప్రమాదము...నీఉద్దేశముల గురించి నాకొకఅనుమానము కలిగిందని ఒప్పుకొంటాను. ఒక్కనిముషము క్రిందట నీవు చావుగురించి అన్నది నిజముగానే...

సుశీల:—అవును. అనుమానమెందుకు? అటువంటి ఉద్దేశము సరళహృదయము గల ఆడపిల్లలకందరికీ సహజముగా కలుగుతుంది.

రూపసి:—చక్కగా చూడలేని కోమల హృదయముగలవారికీ చావు మంచిదని అనిన్నీ, నిండుప్రేమకు నిదర్శన మనిన్నీ తోస్తుంది. కాని వాస్తవముగా చూస్తే ప్రేమించేవారే జీవించిఉండవలెను; ప్రేమించినకొలదీ జీవిస్తూఉండవలెను. అంతేకాకుండా నీప్రేమ ఆమోస్తరు ప్రేమకంటె కూడా ఉత్కృష్టమైనది. చావుతెచ్చిపెట్టి ఇద్దరిస్నేహితులను శాశ్వతముగా విడపరచేవారు, అందుచేత అగాధమైన దుఃఖకూపములో పడద్రోసేవారు ఎట్టివారో అయియుండవలెను; చావు అందుచేత మహాఘోరమైన కృత్యము సుమా.

సుశీల:—నాఅనుమానము నేను చెప్పెదునా, రూపసీ?

రూపసి:—సుశీలా, అంతాచెప్పివేయి, అంతా నేను చెప్పేనుకాను! మనకీమనకీమధ్య మనస్సులలో ఏమీ లేకుండాఉంటే ఎంతో బాగుంటుంది. మనభావములను పరస్పరము తెలియనీకుండా దాచేదైతే మెత్తని పువ్వైనాసరే మన హృదయములమధ్య ఉండనీయవద్దు....

సుశీల:—దానిగురించి ఒక్కక్షణము ఆలోచించేను.

రూపసి:—చావుగురించా?.

సుశీల:—అవును కాని, కొంతసేపటిక్రిందట ఆలాగు ఆలోచించేను. ఆతరువాత నీవిప్పుడు చెప్పినదంతా నాలోనేను అనుకొన్నాను. అప్పుడు మరొక ఊహ...

రూపసి:—అదేమిటో గదా!

సుశీల:—చావుకు వ్యతిరిక్తమైనదాని గురించి; జీవితముగురించి... కాని దానిని చెప్పడానికి ఇంకా సమయముకాలేదు. సరేనులే, నీకు తెలుస్తుందికదా... వర్ణించిచెప్పలేను కాని నాహృదయము... నీవేనా అన్నావు నా ఆత్మ ఆనందముతో కుప్పిగంతులువేస్తున్నట్లు ఉన్నాదని...నీవేనేనైయుంటే ఏమి చేసిఉందువో ఇప్పటికి తెలిసింది నాకు...

[ఒకరిచుట్టు ఒకరు చేతులువేసికొని నిష్క్రమింతురు.]



# పురాణస్మృతితరంగిణి

## తృణీకారము

(శ్రీ వేంకటపార్వతీశ్వరకవులు)

శ్రీరాముని దేవేరిన్, వీరవనిత, లోకమాత వెలవక చెనకం
గోరి రఘువీరశరదు, ర్వారాగ్ని స్రుగ్గనేల రావణతృణమా!

మ. మణిహేమప్రభలన్ వెలార్పఁగల సామర్థ్యంబు నీ కబ్బినన్
మణులే నిన్ను వరించి మించఁగల సామ్రాజ్యంబు నేకూరిన
న్మణికి న్నీకును గల్గు హస్తిమశకాంతంబైన పార్థక్యమున్
దృణమా! యెవ్వ రెఱుంగ రిట్టియెడ నీ ధృష్టత్వ మింకేటికిన్?

మ. నిను నీయంతటి జీవిగా నెఱిఁగి నీ నిత్యప్రమోదైక జీ
వనము న్నిత్యరసాస్పదంబుగ నొనర్పం జూచుకో విమ్మా! తృణం
బనుమాటం దలపోయ కీ పగిది మోహాభ్రాంతిచేఁ బచ్చ ప
చ్చని సంసారము పాడుసేసికొను దుస్సంకల్పముల్ చెల్లునే?

సీ. ఊఁచివైచిననైన నొవ్వదప్పకయుండఁ, గలయఁ గ్రమ్మఁగఁజాలు కడిమియున్న
ముంచివైచిననైన మొప్ప నొవ్వకయుండఁ, దలయెత్తికొనఁజాలు బలిమియున్నఁ
జిదిమివైచిననైనఁ జెలువుగందకయుండఁ, జిగురువెట్టఁగఁజాలు చేవయున్నఁ
జెఱకివైచిననైన వరుగువాఱకయుండఁ, గాలునిల్పఁగఁజాలు కడకయున్న
పసిగలిగియున్న బసిమించు మిసిమియున్న, వసుమతీధారణమునఁ బెం పెసఁగియున్న
నవనళింగాంచు తృణమవే యవుదుగాని యా సమున్నతమేరు వెట్లాదువీవు?

సీ. కటుకు దేఱినవాఁడి కక్కులకొడవంటి, తలకోఁతఁబడకుండ దాఁగఁగలవె?
పదను దేఱిన గట్టి పట్టెంపుఁదవ్వుగోల, రాపులఁబడకుండ నోపఁగలవె?
మొక్క దేఱిన సూదిమొనసూపు కఱుకోల, తొలుపులఁబడకుండ నిలువఁగలవె?
మలుపు దేఱినకోఱ ములుపంటినిడుగోల, బారిని బడకుండ బ్రదుకఁగలవె?
నీ బ్రదుకు నీవుమాచికో నేరకిట్లు, లలితవాసంతికాలవాలమునఁ జేరి
యులముకొనఁజూచె దిది యేటి యూసనీకు?, దుడుకుఁ జేఁతల గొడబడి చెడకె తృణమ!

సీ. ధ్యానింపనేల ధాత్రీసందనాసక్తిఁ, గులనాశనము దెచ్చికొనఁగనేల?
కోరంగనేల కేదారకన్యాలీల, దుంపనాశనముగాఁ ద్రుంగనేల?
కామింపనేల యా రామలతాతన్విఁ, గూఁకటివ్రేళ్లతోఁ గ్రుంగనేల?
ఆసింపనేల సీతాసన్నిధానంబు, మూలవిచ్ఛేదమై పోవనేల?
గడ్డిపోఁచ! నీకింత 'పో గాల' మేల?, మరగి చెడిపోక నాబుద్ధి తెరువుఁబట్టి
శంకలనుబట్టి, తమ్మిబీడులనుబట్టి, పశువులనుగాచికొని స్థిరమైన బ్రదుకరాదె!




# ద్రౌపది

బంకించంద్రుఁడు

శ్రీమతి పులుగుర్త లక్ష్మీనరసమాంబ గారు

ప్రాచీనము లైన నేమి? హిందూకావ్య నాయికల చరిత్రము లన్నియు నొక్కయచ్చున దీసిన ట్లున్నవి. పతిపరాయణత, కోమలప్రకృతిసంపన్నత, లజ్జాశీలత, సహిష్ణుత మున్నగు గుణములకు విశేషాధికారిణు లైనవారే యార్యసాహిత్యసంబంధమగు నాదర్శపదవి కభిషిక్త లగుచున్నారు. వృద్ధ వాల్మీకి తన కావ్యనిర్మాణమునందు విశ్వమనోమోహినియైన జనకదుహితను నాదర్శస్వరూపిని గావించెను. అది మొదలు ఆర్యనాయిక లందఱు నదే యాదర్శానుసారముగ నే సృష్టింపఁబడుచువచ్చిరి. శకుంతలా దమయంతీ రత్నావళీ ప్రభృతి ప్రసిద్ధనాయికలు సీతానుకరణమాత్రలే. తదన్యప్రకృతు లైన నాయిక లెవ్వరు నార్యసాహిత్యమునందు లేనే లేరని చెప్పుట లేదు గాని సీతానువర్తను లైన నాయికలే యార్యసాహిత్యమునందు బహుళముగ నున్నారు. నవలలు నాటకములు మున్నగువానిచేఁ దమవిద్యను ప్రకాశింపఁ జేసికొనఁ గోరుచున్న యిప్పటికవులుగూడ సీతవంటి నాయికలనే సృష్టించుచున్నారు. ఇందులకుఁ గారణమును అవేద్యమైనది కాదు; మొదటిది సీతాచరితము, బహుమధురమైనది; రెండవది; యిట్టి సతీచరితమే యార్యజాతియందు విశేషముగఁ బ్రశంసింపఁబడుచున్నది. మఱియు మూఁడవది; యార్యస్త్రీ లందఱును సీతాదేవివంటి జాతీ మాహాత్మ్యమును సంపాదించుటకే యుత్సాహపడుచుందురు. ఒక్క ద్రౌపదిమాత్రము సీతాదేవిఛాయ నైనను స్పృశించి యుండలేదు. ఈసందర్భమునందు మహాభారతకారుఁడు అపూర్వమైన నూతనసృష్టిని ప్రకాశింపఁ జేసెను. మన కావ్యములందు సీతానుకరణము లనేకములు కలవు; కాని ద్రౌపది ననుకరించిన నాయిక లేదు.

సీత మహాసాధ్వి. పంచభర్తృకయైన ద్రౌపదిగూడ మహాభారతకర్త మహాసాధ్విగఁ బ్రదర్శించి యున్నాఁడు. ఏలన! పతి యొక్కఁడైన నేమి! ఏవురైన నేమి! పతిమాత్రభజనమే సతీత్వ మని కవియభిప్రాయము. సీతాద్రౌపదు లిరువురు పత్నీత్వ రాజ్ఞీత్వ కర్తవ్యాచరణముల యందు నిశ్చలహృదయలే; ధర్మనిష్ఠాగరిష్ఠలే; గురుజనవిధేయలే. కాని వీరిరువురకును సాదృశ్య మింతవఱకే. సీత రాజ్ఞి యయ్యును, కులవధూత్వము ప్రధానగుణముగఁ గలదయ్యెను. ద్రౌపది కులవధువయ్యును ముఖ్యముగఁ బ్రచండ తేజస్విని



ముప్పది తొమ్మిదవ భారత జాతీయమహాసభా మంటప సింహద్వారము
వెలుపలి వైపు, బెల్గాము



ముప్పది తొమ్మిదవ భారతజాతీయమహాసభా మంటప సింహద్వారము
లోవైపు, బెల్గాము



డాక్టరు కిచలూ
భారత ఖిలాఫతుమహాసభాధ్యక్షులు



పండిత మదన మోహన మాలవ్యా
భారత హిందూమహాసభాధ్యక్షులు



దేశబంధు చిత్తరంజనదాసు
భారత గ్రంథాలయ మహాసభాధ్యక్షులు



బాబు పియూష కాంతి ఘోషు
భారత ఆధ్యాత్మిక మహాసభాధ్యక్షులు

యగు రాజ్ఞీమణి యయ్యెను. స్త్రీలకుండవలసిన కోమలగుణములన్నియు సీతయందుఁ బరిస్ఫుటములై యుండెను. నారీలోకమునందలి కఠినగుణము లన్నియు ద్రౌపదియందుఁ బ్రదీప్తము లయ్యెను. సీత రామునకుఁ దగినజాయ. ద్రౌపది వీరాగ్రేసరుగు భీమునకుఁ దగినరాణి. సీత నపహరించు నప్పుడు రావణున కేమియుఁ గష్టము కలుగ లేదు; కాని రాక్షసరాజైన యాలంకేశుఁడు ద్రౌపది నపహరించుటకే వచ్చినచో గీచకుని వలె నసువులను వీడి నేలపై వ్రాలియైన నుండును; కాదేని జయద్రథునివలె ద్రౌపదీబాహుబలముఁ జవిచూచి చాపచుట్టుగ భూమిపైఁ గూలియైన నుండును.

ద్రౌపదీచరిత్రము నందలి రీతిమతులను విభజించుట యసాధ్యము. ఏలన? మహాభారత మనంతసాగరము వంటిది. అందుల నిరంతరతరంగాభిఘాతములలో నొకానొక నాయికాచరిత్రము గాని నాయకచరిత్రము గాని తృణము వలె నెక్కడకో తేలిపోవుచుండును. వాని నెవ్వరు పరీక్షింపఁ గలరు? అయినను ఒకటిరెండు విషయములను జూపి విమర్శించుటకుఁ బ్రయత్నించెదను.

ద్రౌపది స్వయంవరము: ఎవ్వ రీదుర్భేద లక్ష్యమును భేదింపఁ గలరో వారే ద్రౌపదీ పాణిగ్రహణము గావింపవలయు నని ద్రుపద రాజు పణంబు వెట్టెను. కన్యక సభాస్థలమునకుఁ గొనితేఁబడియెను. ధరణీతలము నందలి రాజగణము వీరగణము ఋషిగణము—ఎల్లరు నచ్చట సమావేశ మయిరి. ఆ మహాసభ ప్రచండప్రతాపమువలనఁ గుమారీకుసుమము వసివాడి యుండెను. అట్లు వసివాడుచున్న కుమారీకుసుమమునకై దుర్యోధనుఁడు జరాసంధుఁడు శిశుపాలుఁడు మొదలగు జగత్ప్రసిద్ధులైన మహావీరు లందఱు లక్ష్యభేదనమునకుఁ బ్రయత్నింప సాగిరి. ఒక్కరొక్కరుగా వారందఱు లక్ష్యభేదనమునం దక్షములై వెనుదిరిగి పోవుచుండిరి. అయ్యో! ద్రౌపదికి వివాహము కాదాయేమి?

అప్పు డా రాజగణమధ్యమునుండి సర్వశ్రేష్ఠుఁ డైన అంగాధిపతి కర్ణుఁడు లక్ష్యభేదమునకై లేచెను. క్షుద్రకావ్యకారుఁ డైనచో నిక్కడ నేమి సేయునో చెప్పఁజాలము. ఇప్పుడు విషమస్థితి సంభవించెను. ద్రౌపదిని పాండవుల కిచ్చి వివాహము గావించుటయే కావ్యప్రయోజనమై యుండెను. కర్ణుఁడు లక్ష్యభేదన మొనరించినచో నట్లు సంభవింపదు. క్షుద్రకవి యైనచో నిప్పట్టునఁ గర్ణుఁడు కూడ లక్ష్యభేదమునం *దశక్తుఁ డయ్యె నని వ్రాసి యుండును. కాని మహాభారతమహాకవీశ్వరుని జాజ్వల్యమానమైన విచక్షణత కర్ణుని పరాక్రమముచేఁ గావ్యప్రధాననాయకుఁ డైన యర్జునునిపరాక్రమమును గొలవెట్ట నిశ్చ

* నన్నయభట్టారకుని యాంధ్రభారతభాగమున దీని కొకింతక వైరుధ్యము గానవచ్చుచున్నది. దీనికి మూలము కుంభకోణనాగరప్రతిదై యుండునని యు, ఆంధ్ర, మహారాష్ట్ర, వంగదేశముల ముద్రింపఁబడిన తక్కిన సంస్కృతగ్రంథములన్నిట నీవైరుధ్యము లేకునికి కుంభకోణ ప్రతియందలి యీ భాగము ప్రక్షిప్తమై యుండునని యుఁ దెలియుచున్నది.

యించి యుండెను. కర్ణుఁ డర్జునునకుఁ బ్రతిద్వంద్వి. ఇట్టికర్ణుఁ డర్జునుని చేతిలోఁ బరాభూతుఁ డయ్యె ననినప్పుడే యర్జునుని పరాక్రమమున కెంతయో గౌరవము గలదు. కాని కర్ణు నన్యులతోఁ బాటు సామాన్య పరాక్రమవంతునిఁగాఁ జేసినచో నర్జునుని పరాక్రమగౌరవ మెక్కడ నుండును? ఇట్టి విషమసంఘటనమునందు తిక్కనకవి యేమితలంచును?—"ఈమహాందోళన మంతయు నెందులకు? కర్ణునిపై దిక్కడ నెత్తకుండుట యే మే"లని భావించునే కాని సర్వాంగసుందర మగుకావ్యగౌరవమునకు నెట్టిలోపము వాటిల్లునో యాతఁడు తెలిసికొనఁ జాలఁడు. సకల రాజలోకంబును ఆసర్వాంగసుందరి యందలి యాకాంతిచే లక్ష్యభేదనము చేయుటకు వచ్చి యుండఁగా మహాబలపరాక్రమవంతుఁ డగు కర్ణుఁ డొక్కఁడు మాత్ర మేల రాలేదు?—" లను ప్రశ్నమునకు నాతఁడు నిరుత్తరుఁడు కావలసి వచ్చును.

మన భారతమహాకవి కౌశల్య మాశ్చర్యమయమైనది; తీక్ష్ణదృష్టి యసామాన్యమైనది. అందుచేతనే యాతఁ డవలీలగాఁ గర్ణుని లక్ష్యభేదనోద్యమమునకు సన్నద్ధుని గావించెను. కర్ణునిపరాక్రమగౌరవము నకుంఠితముగా వీక్షించెను. మఱియు నీయవసరమునందే—ఈస్థితియందే—ఈ యొక్క యుపాయము చేతనే—మఱియొక గురుతరోద్దేశమును గూడ సాధింపఁ గలిగెను. ఈయొక్క సంఘటనము చేతనే ద్రౌపదిచరిత్ర మంతయుఁ బాఠకులకుఁ బ్రదర్శించెను. ముందీమె తన బాహుబలముచే జయద్రథుని వంటి ముష్కరుని గర్వభంగము చేయవలసి యుండెను. మఱియు దుర్యోధనుని సభాస్థానమున ద్యూతవిజితయు నవమానితయు నగు నీమె తనపతులయెదుట స్వాతంత్ర్యావలంబనమునకు సన్ముఖ కావలసియుండెను. అట్టిద్రౌపదీస్వభావ విస్ఫూర్తియొక్క సంఘటనమునందే విస్పష్ట మయ్యెను. ఇల్లికమాటలలోనే కవియుద్దేశ మంతయును సఫలమయ్యెను. ఆప్రచండప్రతాపసమన్వితమైన మహాసభయందుఁ గుమారీకుసుమము వసివాడి యున్నదని చెప్పితిమి; కాని యాకుమారీకుసుమము—ఆ ద్రౌపదీకుమారి—యావిషమసభాస్థలమందు రాజమండలీ ఋషిమండలీ వీరమండలీ మధ్యమున ద్రుపదరాజు వంటి తండ్రిని గాని ధృష్టద్యుమ్నునివంటి యన్నను గాని యపేక్షింపక లక్ష్యభేదనోద్యతుఁడైన కర్ణుని జూచి "నేను సూతపుత్త్రుని వరింప" ననియెను. ఈపలుకు చెవి సోకినంతనే కర్ణుఁడు సామర్షంబగు హాసముతో నాకసము వంకఁ దలయెత్తిసూర్యునిఁ జూచుచు శరాసనమును జాఱవిడిచెను. నాలుపుటలలో వ్రాసినను బరిస్ఫుటముగాని యావిషయమును గవి యీయొక్క మాటలో వెలయింపఁ గలిగెను. ఇక్కడ విశేషవర్ణనమునకుఁ బ్రయోజనము లేదు.—ద్రౌపదిని గార్వి తేజస్విని యనియు గర్వితయనియు వ్యాఖ్యానము చేయవలసిన యావశ్యకమును లేదు. మఱియు నారాజనందని దుర్దమనీయ గర్వము నిస్సంకోచముగ విస్ఫారితమయ్యెను.

...హ్యాతిక్రియపరాజిత యైన ద్రౌపది
...వలోకింతము! మహాగర్వితులు
...రుషమబలాన్వితులు నైన భీమా
...జూదమునం దోటువడి నిశ్శబ్ద
...; కిక్కురు మనకుండ శత్రువుల
...ంగీకరించిరి. ఇప్పుడు భర్తల
...నభార్య యేమి చేయవలయు
...జూదమునందు సమర్పిత నై
...యనుమతిని దాసీత్వస్వీకృతికి
...నే యార్యనారీమణికి సహజ
...యేమి చేసినది? ఆమె
...స్త్రీయుఁ దన్ను సభకు
...ధనుని యాహ్వాన
...! [illegible]
...న్నడి పనో్నడెనో గనో్నడి
...తెలిసికొనుము! యుధిష్ఠిర సన్ని
...మున నీవీవృత్తాంతము నెఱింగివచ్చినన్న
...ని పొమ్ము. ధర్మరాజెట్లు పరాజితుఁ
డ... తెలిసికొనిన పిమ్మట నేను సభకు
వచ్చెద" నని పలికినది. ద్రౌపదికి దాసత్వమును స్వీకరింప వలయునను నభిప్రాయము లేదు.

ద్రౌపదిచరిత్రమునందు రెండులక్షణములు విశేషముగా స్పష్టములగుచున్నవి.— మొదటిది, ధర్మాచరణము. రెండవది దర్పము. దర్పము ధర్మమున కించుక విరుద్ధ మైనది. కాని యీ రెండులక్షణము లొక్కచో గూడియుండుట మాత్రము స్వాభావికము గాదు. మహాభారతకారుఁ డీ రెంటి నొకచో సమావేశము చేసెను. భీమసేనునియందు అర్జునునియందు, అశ్వత్థామయందు, మఱియు సకలక్షత్రియ వీరులయందు నీ రెండుగుణములను మిశ్రితములుగఁ జేసెను. భీమసేనుని యందు దర్పము సంపూర్ణముగను, అర్జునుని యందును అశ్వత్థామయందును నర్ధమాత్రముగను గన్పట్టుచుండెను. దర్ప మనఁగా నిక్కడ నాత్మశ్లాఘాప్రియత్వ మని యర్థము గాదు. మానసిక తేజస్విత యనియే నాయభిప్రాయము. ఈ తేజస్విత ద్రౌపది యందును సంపూర్ణముగనే యుండెను. అర్జునాభిమన్యుల యందిది యాత్మశక్తినిశ్చయముగఁ బరిణమించెను. ద్రౌపదీ భీమసేనులయం దిది ధర్మ వృద్ధికిఁ గారణ మయ్యెను.

సభాస్థలమున ద్రౌపది దర్పమును తేజస్విత్వము మఱింత వృద్ధినందెను. ఆమె సభలో దుశ్శాసనునిఁ జూచి "ఇంద్రాది దేవగణము నీకు సహాయులై వచ్చినను రాజపుత్త్రిలు నిన్నిన్నటికిని రక్షింపఁజాలర"ని వచించెను మఱియు నాసభాస్థలమున సందఱముందుఁ దనపతులను లక్షించి ముక్తకంఠయై "భరత వంశీయుల ధర్మమెంత చెడిపోయినది! క్షాత్ర ధర్మజ్ఞుల చరిత్ర యొక్కమాలుగ నెంత వినష్టమైపోయినది!" యని ధిక్కరించి భీష్మాది గురుజనులను గాంచి "ఆ! తెలిసిపోయినది!" భీష్మద్రోణులకును మహాత్ముఁడైన విదురునకును గూడ నణుమాత్రమైన సత్త్వము లేదని తెలిసిపోయినది!" అని తిరస్కరించి పలికెను. కాని యబలకు ధైర్య మెంతసేపు నిలువఁ గలదు! ఆమహాభారత మహాకవి మానవ చారిత్ర సాగరమును నడుగుమట్టు నఖదర్పణమునం బోలె నవలోకింపఁ గలిగెను. ఎప్పుడు

ద్రౌపదిని వేశ్యయని పలికినో, దుశ్శాసనుఁ డప్పు డామెపరిధానము నాకర్షింపఁ బోయెనో అప్పు డీక నామెదర్పము నిలిచినది కాదు. భయాధిక్యముచే హృదయము ద్రవీభూత మైపోయెను. అప్పుడు ద్రౌపది, "హానాథా! హారమానాథా! హా గోపికానాథా! హా దుఃఖనాశనా! నేను కౌరవసాగరమునందు నిమగ్ననై పోవుచున్నాను. నన్నుద్ధరింపుము తండ్రీ!" యని మొఱపెట్టఁ దొడఁగెను. ఇచ్చటనే కవిత్వము చరమోత్కర్షం గాంచినది.

ద్రౌపది స్త్రీజాతి గావున నామెహృదయమునందు దర్పము ప్రబలముగా నుండెను. కాని యామెధర్మజ్ఞానము కూడ ససామాన్యమైనది. దర్పితయగు రాజమహిషిగా నామె యగపడ నప్పుడు జనమండలమునం దట్టి ధర్మానురాగిణి కలదా యనునట్లు తోఁపకమానదు. ఈప్రబ్బల ధర్మానురాగమే యామె ప్రబలతర దర్పమునకుఁ గొలబద్ద యయ్యెను. ఈ యసామాన్య ధర్మానురాగమే—తేజోన్వితమైన యీధర్మానురాగ రమణీయ సామంజస్యమే, ధృతరాష్ట్రుని ముందు, నామె వరగ్రహణ కాలము నందు నతిసుందరరూపముతోఁ బరిస్ఫుటమయ్యెను. అంతటిసౌందర్యము గల యీభాగము నన్ని వేలసారులు పఠించినను నెవ్వరి కైనను మఱలమఱలఁ జదువవలయు ననియె బుద్ధి పుట్టుచుండును. కావున నిచ్చటి భాగము నుదహరించుచున్నాను.

"హితైషియైన ధృతరాష్ట్రమహారాజు దుర్యోధను నిట్లు నిందించి, ద్రౌపదిని సాంత్వన వాక్యముల నాడించుచు
ద్రుపదాత్మజా! నీవు నాయొద్ద
సిన వరములఁ గోరుకొనుము. నీవు
దఱలో నుత్తమురాల' వనియె
ద్రౌపది, 'ఓభరతకులప్రదీపా!
బ్రసన్నుఁడ వైతివేని యీవర
గుడవు గాక! సర్వధర్మసమన్వి
తుఁడు నైనయుధిష్ఠిరుఁడు దా
విముక్తుఁ డగుగాక; ఇమ్మహా
లేక నెప్పుడును దాసుఁ డన
నాపుత్త్రుఁడు ప్రతివిందు
పుత్త్రుఁడు కాకుండుఁ
వింద్యుఁడు రాజపు
రాజోపలాలితుఁడు
చితము గాదా?' య
రాష్ట్రుఁ డప్పుడు, 'ఓకల్యాణీ!
మతాను సారముగా నీవరము నొసఁగితిని. నీకు నే నింకొక వరమునుగూడ నొసంగుట కిచ్ఛగించు చున్నాను. నీయట్టి వరవర్ణిని యొక్క వరమునకు మాత్రమే తగినది కాద నియెను. అప్పుడు ద్రౌపది, 'ఓమహారాజా! రథశరాసన సహితముగ భీమార్జున నకుల సహదేవులు దాసత్వవిముక్త లగుదురుగాక!' యని పలికెను. అది విని ధృతరాష్ట్రుఁడు, 'బిడ్డా! నేను నీప్రార్థనానురూప వరప్రదానమును గావించితిని. మూఁడవ వరమునుగూడ నడుగుము. ఇప్పుడు నే నొసంగిన వరముచేత నీకు యథార్థసత్కారము జరుగలేదు. నీవు ధర్మచారిణివి. పుత్త్రవధూగణమున కుత్తమావతంసమ' వనియెను. అప్పుడు ద్రౌపది,

'ఓపూజ్యుఁడా! లోభము ధర్మనాశమునకు హేతువు. కావున నే నింకొకవరము నర్థింపఁ జాలను. నేను మూఁడవవరమునకుఁ దగిన పాత్రను గాను. వైశ్య కొకవరమును, క్షత్రియాంగనకు రెండువరములును, రాజునకు మూఁడువరములును మఱియు బ్రాహ్మణునకు నూఱువరములును గోరుకొనుట కర్హత యున్నది. ఇప్పుడు నా పతులు దాసత్వదారుణ పంకనిమగ్నులై మఱల నుద్ధరింపఁబడిరి. వారు పుణ్యకర్మానుష్ఠానముచే శ్రేయోలాభము నొందఁగలరు. నా కింకేమివలయు?' ననియెను.

ఈవిధముగ ధర్మదర్పముల సామంజస్యమే ద్రౌపదీచరిత్ర రమణీయతకుఁ బ్రధాన సాధన మయ్యెను. జయద్రథుఁడు పాప బుద్ధితోఁ గామ్యకవనమున కరిగి యేకాకినియైన ద్రౌపదిని గాంచినప్పు డామె మొట్టమొదట నాతని ధర్మాచారసంగతముగా నతిథిసముచితసౌజన్యసత్కారములఁ బరితృప్తుని గావించుట కెంతయుఁ బ్రయత్నించెను. పిమ్మట జయద్రథుఁడు తనదురభిప్రాయమును వ్యక్తపఱచినప్పు డామె యాఁడుసింగమువలె గర్జించి తన తేజోరాశిని బ్రకాశింపఁ జేసెను. అహా! ఆ తేజోగర్వ వచనపరంపరలఁ దలంచుకొనిన కొలంది నానందసాగరమునఁ దేలియాడుదుము గదా! జయద్రథుఁ డప్పు డామెను వివశనాడక బలపూర్వకముగా నాకర్షింపఁ బోయి వెంటనే దానికిఁ దగినప్రతిఫలము ననుభవించెను. భీమార్జునసహధర్మిణియు ధృష్టద్యుమ్న సహోదరియు నైన యాద్రౌపది బాహుబలముచే విచ్ఛిన్నమూలపాదపముం బోలి యా మహావీరుఁ డైనసింధుసౌవీరాధిపతి భూతల పతితుఁ డై పోయెను. చివరకు జయద్రథుఁడు మరలఁ గడుబలాత్కారముగ నామెను దన రథముపై నెక్కించుకొనియెను. అప్పుడు ద్రౌపది యేమిచేసెను? నిరుపమతేజస్వినులైనవీరనారీమణు లేమిచేయ వలయునో దానినే చేసెను. ఆమె వృథావిలాపము గాని వృథాలాపము గాని యణుమాత్రమైనను జేయలేదు. ఇతరస్త్రీలం బోలి యామె యప్పుడు తనభర్తలయాగమన విలంబమును గూర్చి కాని, యనవధానతం గూర్చి కాని యొక్కసారియైనను విసుగుకొన లేదు. కులపురోహితుఁడైన ధౌమ్యుని చరణాంబులకుఁ బ్రణామముం గావించి జయద్రథునిరథము నారోహించెను. పిమ్మట జయద్రథుఁడు దూరమునఁ గనఁబడుచున్న పాండవులను గూర్చి తన్నడిగినప్పుడు ఆమె జయద్రథుని రథము నందుండియు నెట్టిగర్వితవచనములతో నెట్టి నిశ్శంకచిత్తముతో నవలీలగాఁ దనహృదయేశ్వరులఁ గూర్చి వర్ణించి చెప్పెనో యది యెంతయుఁ బునఃపునఃపఠనీయము గదా!

ఇది ప్రథమప్రస్తావము






గున్నేపల్లి అడి.య.లింగము గారు

రసము చిప్పిల! నుత్తరరామచరిత
'మాంధ్ర గీర్వాణ రచనల ననువదించి'
ప్రౌఢిచూపిన కంకంటి పాపరాజు
పండితులలోన శ్లాఘనీయుండు గాఁడె? ౧

కొన్ని చోటులఁ దిక్కన్నకన్న మించి
కొన్ని పట్టుల శ్రీనాథు గుణముగాంచి
కొన్ని యెడలను బెద్దన్న చెన్ను నడసి
పాపరాజు రచించెఁ గావ్యము ; నయారె! ౨

పాకహరిపాకమునఁ గాడు పాపరాజు
కల్పనాకౌశలమునఁ దిక్కన రచించి
నట్టి రామాయణముకన్న నన్నిగతుల
నతిశయించెడు; నెంత ప్రజ్ఞానిధియుండొ? 3

పాపరాజకవీంద్రు ప్రబంధమందు
శబ్దచిత్రమ్ము లెన్నని సంఘటిల్లు;
నవ్వి సామాన్యకవుల కావ్యములనున్న
నగిది వృథకాక సరసార్థబంధురములు. ౪

వృత్తులును, భావ శయ్యా విభేదములును
ధ్వనులు, రీతులు, నర్థసందర్భములును
నట్లు వెలయింపవలయుఁ దానట్లు లరసి
కూర్చెఁ గృతి పాపరాట్కవికుంజరుండు. ౫

ఇంపుపొసగ సనవద్య హృద్యశబ్ద
రత్నపుంగల్మిఁ గావ్యందిరకు ఘటించి
ప్రతిభవడసిన యల పాపరాజువోలెఁ
గృతి రచించిన సర్వసమ్మతముగాదె? ౬

జన్మము తరింపఁ గర్ణరసాయనముగ
నవరసమ్ములు వెలయు వర్ణనలు పెంచి
భగవదర్పితముగను గావ్యము రచించెఁ
దలఁప నితఁడెంతయును ధన్యతముఁడుగాఁడె?

సరసమై, మనోహరమునై చవులుగొలుపు
కవనమునఁ గాక పాపరాట్కవివరుండు
నయకళాభూతిఁ, దత్త్వవిజ్ఞానగరిమ
గణితశాస్త్రనైపుణిని, బ్రఖ్యాతిఁగాంచె. ౮

కూర్మిమైఁ బాపరాజ వాగ్గుంభనముల
నరసియెల్లెడ; నాధుని కాంధ్రకవులు
స్ఫురదలంకారకలితమై సొంపుగులుక
సంస్కరింతురుగాక! భాషావధూటి. ౯





# పాల్కురికి సోమనాథుని గురుప్రశంస

నిడుదవోలు వేంకటరమణగారు, బి. ఏ.

పాల్కురికి సోమనాథుని గ్రంథములఁ బరిశీలింప నాతనికిఁ బెక్కు గురువు లున్నట్లు తెలియుచున్నది. సోమనాథుఁడు వీరశైవుఁడగుటచే నాతని గురువు లిరుతెగలని మనము చెప్పవచ్చును. ఒక తెగవారు మత గురువులు. వీరు దీక్షనొసఁగువారు. రెండవ తెగవారు విద్యాగురువులు. వీరు జ్ఞానము నొసఁగువారు. ఇఁక సోమనాథుని యీయిరు తెఱఁగుల గురువు లెవ్వరో విచారింతము. దీక్షాగురువులలో గురులింగమనువారు పెక్కు గ్రంథములలోఁ జేర్కొనఁబడిరి.

"ద్వి. శరణ గణాశ్రయు సకలస్వరూప
గురులింగ వరకరోదరజనితుండ"

బసవపురాణము 8 వ పుట.

"క. భృంగిరిటి గోత్రుఁడను గురు
లింగతనూజుండ......

అనుభవసారము, 4 వ పుట, 32 పద్యము.

"ద్వి. మద్గురులింగ
ఘనకరుణాప్త గర్భసంభవుఁడ."

పండితారాధ్య చరిత్రము, దీక్షాప్రకరణము, 4 వ పుట.

పై వానిచే సోమనాథుని దీక్షాగురువు గురులింగారాధ్యుఁడని తెలియుచున్నది. మఱియుఁ గర్ణాటకవి చరిత్రమునఁగూడ సోమన యీతని యొద్దనే శివదీక్షఁ బొందినట్లు చెప్పఁబడి యున్నది. దీక్షాగురువులను జనకులుగా భావించుట వీరశైవమత సాంప్రదాయమని వేఱుగఁ జెప్పవలయునా!

పైని వివరించినరీతిని సోమనాథుని దీక్షాగురువు గురులింగారాధ్యుఁడే యైనను నాతని నిజమగు నామమేదియో తెలియుటలేదు. ఏలయన, శైవమత సాంప్రదాయానుసారము గురులింగ జంగమ శబ్దములకు భేదములేదు.

"ఏకా మూర్తి స్త్రయోభాగా గురుర్లింగంతు జంగమః"

అనుసూక్తి ననుసరించి శైవులు ఏక మూర్తిని మూఁడు రూపములుగ భావించినను వానిలో నొకదాని నొకటి భేదరూపముగఁ బరిగణింపరు. కావుననే, సోమనాథుఁడు తన తెలుఁగు గ్రంథములనే గురుస్తుతి చేయనిదే గ్రంథమునఁ బ్రారంభించిన వాఁడు కాఁడు. చూడుఁడు:

"ద్వి. శ్రీగురుదేవు వంచితగుణోత్తంసు
యోగీంద్రహృదయ పయోజాతహంసు"

బసవపురాణము.

"ద్వి. శ్రీగురుమూర్తి నార్తశరణ్యకీర్తి
నాగమాంతస్ఫూర్తి నానందవర్తి"

పండితారాధ్యచరిత్రము.

"సీ. శ్రీగురులింగ పంచికదయాదిస్ఫూర్తి
శరణైకవర్తి విస్ఫారకీర్తి"

చెన్నమల్లు సీసములు.

"ఉ. శ్రీగురులింగమూర్తి పరిశేష మహోజ్జ్వల కీర్తి
సత్క్రియోద్యోగకళాప్రపూర్తి..."

వృషాధిపశతకము.

"ఉ. శ్రీగురులింగ జంగమవిశిష్ట మహామహిమంబు చేఁ దెలిసి, శ్రీగురులింగ జంగముఁ జెప్పఁ బ్రియా రవిగాఢమైచనన్, శ్రీగురులింగ జంగమ విశే షమలోకముగాఁ దలంచి యా, శ్రీగురులింగ జంగమ విశిష్యతమై మదిఁగొల్చి సమ్మతిన్"

అనుభవసారము.

"సీ. శ్రీగురవే నమ స్తే గురవే నమ

స్తే గురుమూర్తి ప్రథిత గుణాయ" చతుర్వేదసారము.

ద్వి. శ్రీగురులింగ వందిత పదాంభోజ !

యోగీంద్రహృన్నివాసేశ! ధీరగేంద్రధామ!

సోమనాథ స్తవము.

ఇఁక నీ గురులింగార్యుని వాస్తవ నామ ధేయ మూహించుటకైన పిలుగలుగు నేమో చూతము! పండితారాధ్య చరిత్ర శ్రోతయగు పాల్కురికి సోమనాథాత్యుని సంబోధించుచు వాద ప్రకరణాంతమున నిట్లు చెప్పినాఁడు.

ద్వి. గురులింగ శివశరోదర పుణ్యజాతి!

గురులింగ చర లింగగుణ గణాఖ్యాత !

గురులింగ చరణాబ్జ పరిమళాఘ్రాత !

గురులింగ చరణామృతర పరిస్ఫీత!

గురులింగ గురుపదాంబుర శుభ్రగాత్ర !

గురులింగ దృక్సరోవర జాతపాత !

గురులింగ కులమహీధర సింహపోత !

గురులింగ దివ్యమందిర పారిజాత !

గురులింగ నిర్మాల్యగోత్ర సంపూత!

గురులింగ మంత్రానుసంకీర్తిత శ్రోత !

ఆరాధ్యచరిత్ర. వా. ప్ర. 242 పుట.

పైవానిలో మొదటిపాదమును బట్టి సోమనాథాత్యుని దీక్షాగురువు నీగురులింగార్యుఁడని తెలియుచున్నది. మఱియు నారాధ్యచరిత్ర కృత్యవతరణికయందు.

"* వీరమాహేశ్వర విశ్రుతాచార

కారుణ్యహస్తాబ్జ గర్భసంభవుఁడ ?"

దీ. ప్ర. ౬ పుట.

అని సంబోధించినాఁడు. కావున గురులింగార్యుని పే రీవీరమాహేశ్వరుఁడని యూహింప వచ్చును. మఱియు నాకాలమున నీ లింగశబ్దమును నామములతోఁ జేర్చుట యంత విరళముగ లేకుండుటచే నిదియె యాతని వాస్తవ నామమని బలవత్తరముగఁ జెప్పవచ్చును. కాని యిది యూహయేగాని సిద్ధాంతము గాదు. సోమన దీక్షా గురువులనుగూర్చి చెప్పవలసినచో గురులింగార్యు నొక్కనినే చెప్పవలయును. తక్కినవారలందఱు విద్యాగురువులు. వారిలోఁ బ్రథములు, కరస్థలము విశ్వనాథయ్యఁగారు. వీరినిఁగూర్చియుఁ గొన్ని గ్రంథములలో గలదు. అది యెట్లనిన:

"ద్వి. § కృపాతుఁడగు కరస్థలము విశ్వేశు,

ప్రకట వరప్రసాద కవిత్వయుతుఁడ"

బసవపురాణావతారిక.

ఇంతియేకాక యా గ్రంథమునందే గద్యలయందు

"పరలింగమువ కరస్థల విశ్వనాథ

వరకృపాంచిత కవిత్వ మ్యాతిఁ జేర్చి"

అని చెప్పినాఁడు.

"కం. సకలుఁడ విశ్వేశు విమలగురు హరు శరణుల్"

"సీ. విమలచిత్త్వమూర్తి విశ్వేశు వరమూర్తి

వినయశీలి భువన వినుతకీర్తి

విభు కరస్థలంబు విశ్వేశ కారుణ్య

జనిత వినుతకావ్య శక్తియుతుఁడ"

అనుభవసారము.

పిడుపర్తి సోమనాథుఁడు రచించిన పద్య బసవ పురాణావతారికయందుఁ గూడ నీతని ప్రశంస గలదు.

* వీరమాహేశ్వర యని పాఠాంతరము.

§ ఇందు యతిభంగము.

"కం॥ ఆతఁడు గురుచరకర సం
జాతుండై విశ్వనాథు సన్నిధిఁ గవితా
చాతురి రెట్టించి బసవ
ప్రీతిగ రచియించినట్టి కృతులెవ్వి యనన్."

ప.బ.పు.ప్ర.ఆ. 5 పుట.

పైవిషయముల ననుసరించి సోమనకు వీరు వ్యాకరణచ్ఛందోవిశేషములఁ జెప్పియుందురు. ఈ గురుప్రశంసపైని వివరించిన గ్రంథములయందుఁ దక్క తక్కినవానియందుఁ గానరాకున్నది. మఱియు బసవపురాణావతారికయందు శ్రీశైలమునఁగల భక్తవర్గములోఁ గరస్థలము సోమనాథయ్యఁగా రొకరుగలరు.

"ద్వి. విలసిత పరమ సంవిత్సుఖాంభోధి
వలి గరస్థలి సోమనాథయ్యఁ గారు."

పై కరస్థలము సోమనాథయ్యఁగారికిని విశ్వనాథయ్యఁగారికినిఁ గల సంబంధమా తెలియుటలేదు. తండ్రికొడుకులో? అన్నదమ్ములో?

ద్వితీయులు కట్టకూరి పోతిదేవులు. వీరొక్క బసవపురాణమున మాత్రమే పేర్కొనఁ బడిరి.

"ద్వి. ఖ్యాతిచే సద్భక్తిగల కట్టకూరి
పోతిదేవుని పదాంబుజ షట్పదుండ!"

ఇచటఁ బదాంబుజ షట్పదుఁడనని సోమన చెప్పుటచే వీరు విద్యాగురువగుట స్పష్టము. వీరు సోమనకు శైవాగమములు భక్తచరిత్రములు మొదలగునవి యెఱింగించియుండవచ్చును. తృతీయులు బెలిదేవ వేమనారాధ్యుని మనుమలు బెలిదేవ వేమనారాధ్యులు. వీరి ప్రశంస పండితారాధ్య చరిత్రమున మాత్రమేగలదు.

"ద్వి. పేరెన్నఁబడిన శ్రీబెలిదేవవేమ
నారాధ్యులను పరమారాధ్య దేవు
మనుమని శిష్యుండ"

ఇట్లుండ నూతనముగఁ బ్రకటింపఁబడిన శతకకవుల చరిత్రమున సోమనాథుని చరిత్రమునందు * 30 వ పుటయందు వీరే పైనిజెప్పిన విశ్వనాథయ్యఁగారని వ్రాయఁబడియున్నది.

కాని పై విశ్వనాథయ్యఁగారి గృహనామము కరస్థలము వారని స్పష్టముగఁ దెలియుచున్నది. అందుచే నిరువుర నొకటిగా భావించుట యెట్లో తెలియకున్నది.

ఈ గురుప్రశంస బసవ పురాణాదులయందు లేమిఁజేసి యీతఁడు సోమనాథుని కడపటి గురువయినట్లు కనుపట్టుచున్నది. ఏలయనఁగ, సోమన, బసవపురాణాదుల రచియించునపరికిఁ జతుర్వేద పారగుఁడు కాఁడు. అతని వేద వేదాంగములయందలి జ్ఞానము తదితర గ్రంథములలో నగుపడున ట్లీ గ్రంథమున నగుపడదు. ఆరాధ్య చరిత్రమును జూచిన వారికి సోమన సాంగవేదాధ్యాయియని తెలియకపోదు. మఱియు సోమన

"ద్వి. పలిఁబాల్కురికి సోమనాథుఁడనంగ,
వెలయు వాఁడను వినిర్మల చరిత్రుండ" అని

బసవపురాణమునను,

"ద్వి. పలిఁబాల్కురికి సోమనాథుఁడనంగ
వెలయువాఁడను జతుర్వేదపారగుఁడ" అని

పండితారాధ్య చరిత్రమునఁ జెప్పినాడు.

* ఈ విశ్వేశుఁడే బెలిదేవవేమనారాధ్యుల మనుమఁడై యుండును.

దీనిఁబట్టి యీ వేమనారాధ్యులు సోమనకు వేదగురువులైనట్లు తోఁచుచున్నది. వీరారాధ్యు లగుటవలన సోమన వీరియొద్ద సాంగముగ వేదముల నభ్యసించి యుండవచ్చును. మఱియు నీ గురుప్రశంస సోమన ప్రౌఢవయస్సున రచియింపఁబడిన పండితారాధ్య చరిత్రలో మాత్రమే కానంబడుటచేత, సోమనకుఁ బ్రథమదినములలోనే గురునైనయెడల నా విషయము సోమన బసవపురాణాది గ్రంథములఁ జెప్పియుండుననియుఁ, దాను జతుర్వేదపారగుఁడనని చెప్పుకొనిన గ్రంథమునందే యీతని స్తుతించుటచే నీతఁడు వేదములు నేర్పిన గురువనియు మనము నిశ్చయింప వచ్చును.



# నన్నయభట్టారకుఁడు

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి గారు

శ్రీమంతంబగు భారతాహ్వయమహాక్షీరప్రవాహానికిం
దూముం బెట్టి తగంగ నాంధ్రమహిశా దుగ్ధంబుఁ బాలించి బ్ర
హ్మామోదంబుగఁ దృప్తిఁ దీరునటు లీయాంధ్రాళిఁ ద్రాగించె నా
ధీమంతుండగు నన్నపార్యునకు సంధింతుఁగా నమస్కారముల్.

గీ. కవితయే ముందుఁబుట్టెనో కాక నీవె, ముందుగాఁ బుట్టినావొ చెప్పుట యశక్య
మంద్రు కాని నీవ్రాసిన యట్టి భారతాఖ్యకావ్యంబె తొలిపంట యాంధ్రమంగ.

గీ. రాజరాజైన విష్ణువర్ధనున కిచ్చి,నావు విప్ర! త్వత్కావ్య కన్యామతల్లి
సంఘసంస్కారమునకు బీజములు నాటి,నావు నీవు నన్నయ్య! యీ యాంధ్రభువిని.

గీ. కెరలి గోదావరీతీర కీచకారవంబు శ్రుతిగా నొసర్చి యీ భరతఖండ
పటుపరాక్రమ ధర్మ ప్రభావఘనత, లాంధ్రమునఁ బాడి లేపితి వాంధ్రజనుల.

గీ. నీదుహృదయాకరమున జన్మించినట్టి, రత్నరాజంబు విజ్ఞానరమ్యకాంతి
వీచికా పరంపరలను వెలువఱచుచుఁ, గ్రాలుచున్నది యాంధ్రుల ప్రతిగృహమున.




కానూరు లక్ష్మణరావు గారు

౧

వార్తలు రెండువిధములుగా పంపవచ్చును. ఒకటి మనదేశములో ఆచరణములో నున్న తంతి వార్తాపద్ధతి. దూరమున నున్నవారికి శీఘ్రకాలమున వార్తల నందజేయుటకు మన మవలంబించుచున్న పద్ధతి యిదియే. తంతిలేకయే కొన్నివేలమైళ్లదూరమునకు సైతము వార్త లంపుటకు నూతనముగా గనిపెట్టబడిన పద్ధతియే వాయువార్తాపద్ధతి. ఈపద్ధతివలన వార్తను మాత్రమే కాక ఉపన్యాసములను గూడ వినవచ్చును. ఇంగ్లాండులో చిత్రకారుడు వ్రాసిన పటమును సైతము హిందూదేశమునకు కొన్ని నిమిషములలో నందజేయవచ్చును.

## తంతివార్త పద్ధతి

ఈ నూతనపద్ధతిని గురించి తెలిసికొనుటకు పూర్వము ఇప్పుడు మనదేశమున వాడుకలో నున్న తంతివార్తా విధానమును గురించి తెలిసికొందము. విద్యుచ్ఛక్తిని గురించి భారతిలో నిదివర కొకవ్యాసము వ్రాసియుంటిని. అయినను ప్రస్తుతవిషయమునకు సంబంధించినంతవరకు దానిని సంగ్రహముగ నిట తెలిపెదను.

విద్యుత్తుశక్తి దాల్చు రూపములలో నొకటి. అది అదృశ్యమైనందువలన దాని రూపమెట్టిదో తెలియదు. అది ప్రవహించు నొక ద్రవపదార్థమని యొక సిద్ధాంతముకలదు. నదీప్రవాహమునకు ఒకదారి ఒక తెన్ను ఎట్లవసరమో విద్యుచ్ఛక్తి ప్రవహించుటకు నొక మార్గముండవలయును. దానిని వ్యాపకమందురు. అట్టి వ్యాపకములలో భూమికూడ నొకటి. ఒకపాత్రలో గంధకద్రావకము పోసి అందులో నొక బొగ్గుకణికను తుత్తినాగము కణికను ఒకదానికొకటి తగలకుండ నుంచుము. ఆరెంటిని బయట నొక తీగతో గలిపినచో విద్యుత్ప్రవాహ మేర్పడును. ఇట్టి సామగ్రిని లెక్లాంచి విద్యుత్కృతి యందురు. దీనిలో విద్యుత్ప్రవాహము ప్రవహించుచున్నట్లు వ్యాపకక్షేత్రమున గలుగు ఫలితముల ననుసరించి తెలిసికొనవచ్చును. కాంతీకరణము (Magnetism) అట్టి ఫలితములలో నొకటి. అనగా నొకతీగలో విద్యుచ్ఛక్తి పోవుచున్నయెడల నట్టి తీగ చుట్టును కాంతీకరణక్షేత్ర మొకటి యేర్పడును. ఆక్షేత్రమున చేర్చిన నొక యినుపముక్క నుంచినచో ఆతీగె దాని నాకర్షించును. ఈయాకర్షణశక్తి విద్యుత్ప్రవాహ రాశి హెచ్చినకొలది హెచ్చును; లేక తీగను చుట్టలుగ చుట్టినచో ఆచుట్ట ఆక్రమించుప్రదేశములో కాంతీకరణశక్తి హెచ్చుగా నుండును. విద్యుత్ప్రవాహము సులభముగ ప్రవహించునట్లు చేయు పదార్థములలో రాగియొకటి. అట్లే కాంతీకరణ క్షేత్రమున చేర్చిన నినుప వస్తువు నుంచినచో దానియందు కాంతీకరణశక్తి చెల్లాచెదరుగాక కేంద్రీభవించును. అందుచేత నా యినుప వస్తువునకు సూదంటురాయివలె నితరవస్తువుల నాకర్షించు శక్తి కలుగును. ఈశక్తి విద్యుత్ప్రవాహము పోవుచున్నంతవరకే యుండును. ప్రవాహ మెప్పుడు క్షీణించునో అప్పు డాయినుపముక్కకు కాంతీకరణశక్తి తగ్గిపోయి యథాస్థితికివచ్చును. ఇట్లు విద్యుచ్ఛక్తిచే సూదంటురాయి గుణములను ఒక యినుపముక్కకు చేకూర్చుపద్ధతిని విద్యుత్కాంతీకరణవిధాన మందురు.

విద్యుత్ప్రవాహమునకు ఒకపరిధి (Circuit) ఉండవలయును. ఆపరిధి సంపూర్తిగ నున్నప్పుడే ప్రవాహ మేర్పడును. పరిధి అసంపూర్తి చేసినచో ప్రవాహ మాగిపోవును. ఈయంశములను గ్రహింపగలిగినచో తంతి వార్తాపద్ధతిని తెలిసికొనగలుగుదుము. చిన్నపట్టాము

నందలి ప్రధానతంతివార్తాలయము(Central Telegraph Office) నుండి యొకతీగ బయలుదేరి రాజమ

తంతివార్త పద్ధతి




1. భూమి. 2. చెన్నపట్టణము. 3. లెక్లాంచికృత్తులు. 4. మీట. 5. తీగె. 6 స్ఫోరకము. 7. మర. 8. యినుపముక్క. 9. చుట్ట. 10. రాజమహేంద్రవరము.
═ ఇది విద్యుత్కృత్తికి సూచన
పైది ఋణధ్రువము; అడుగు పెద్దగీత ధనధ్రువము.

హేంద్రవరమునకు వెళ్లును. 'లెక్లాంచి' బుడ్డిలో విద్యుత్తు బహిర్భాగమున తుత్తునాగమునుండి బొగ్గుకణికకు ప్రవహించుచున్నది. ఇందులో తుత్తునాగము ధనధ్రువమనియు రెండవదానిని ఋణధ్రువమనియుఁ జెప్పెదరు. ఈరెంటిని గలిపినంతమాత్రమున విద్యుచ్ఛక్తి ప్రవహించునని తెలిపియుంటిమి. నీరు రెండుప్రదేశముల మధ్య ప్రవహించుచున్నచో ఒకటి రెండవదానికన్న ఎత్తుస్థలమున నున్నదనియే కదా దాని యర్థము. అట్లే విద్యుత్తు ప్రవహించుటచేత రెండుధ్రువములమధ్య కొంతయొత్తిడియుండవలయు ననుట స్పష్టము. ఈయొత్తిడి నెక్కువచేయుటకు రెండు లెక్లాంచి విద్యుత్కృత్తుల నుపయోగింపవలెను. ఒకదాని ధనధ్రువమును రెండవదాని ఋణధ్రువమునకు గలుపుదురు. అప్పుడు మిగిలిన రెండుధ్రువములకు నడుమనున్న యొత్తిడి అదివఱకంటె రెండురెట్లగును. ఇట్లు ఒకవరుసలో ననేక విద్యుత్కృత్తులనుండి యొత్తిడిని హెచ్చించు విధానమును పంక్తిఏర్పాటు అందురు. ఇట్లు రెండు 'లెక్లాంచి' విద్యుత్కృత్తులను పంక్తిలోనుంచి అందులో నొక ధ్రువమును భూమికి తీగవలన గలుపుదురు. అనగా ధ్రువమునకు తీగకలిపి ఆతీగ రెండవకొనను భూమిలో పాతిపెట్టుదురు. ఇక 'లెక్లాంచి' విద్యుత్కృత్తుల రెండవ ధ్రువమును పటములోఁ జూపినట్లు మీటకు కలుపుదురు. మీట యనగా రాగిపలకలకడ్డీ. దీనిని నొక్కుటవలన విడివిడిగనున్న రెండుతీగెల కొనలు కలిసికొనిపోవును. నొక్కుటమానిన నా రెండుతీగెలకొనలు వేఱగును. ఇట్టి మీటయొక్క రెండవ కొనను చెన్నపురినుండి బయలుదేరు తీగకు కలుపుదురు. రాజమహేంద్రవరమునందలి తంతివార్తాలయములో నీతీగెయొక్క చివరభాగము ఒక యినుపముక్కచుట్టను చుట్టబడి పిదప భూమిలో పాతిపెట్టబడును.

చెన్నపురిలో మీట నొక్కగనే వ్యాపకముగుండ విద్యుచ్ఛక్తి ప్రవహించును. భూమి వ్యాపకముగుటచేత దానిని విద్యుత్పరిధిలోని యొక భాగముగ జేయబడినది. దీనికి కారణము వ్యయము తగ్గించుటకొఱకే. భూమి యుపయోగింపబడకపోయినచో చెన్నపట్టణమునుండి రాజమహేంద్రవరమునకు రమారమి 300 ల మైళ్లు ఒక తీగకు బదులుగా రెండుతీగెల నుపయోగింపవలసియుండును. ఇట్లు చేయుటచేత వ్యయ మెక్కువయగును గదా!

మీట నొక్కగనే రాజమహేంద్రవరములో నున్న యినుపకడ్డీ చుట్టుకొన్న తీగెచుట్టను సూదంటుఱాయివలె కాంతీకరణశక్తి కలదిగ జేయును. ఆచుట్టసమీపమునందు నినుపముక్క కడ్డీ నున్నను ఛాలి యే యితరవస్తువునైనను అది ఆకర్షించును. అట్లే దానియొద్ద నొక యినుపముక్క నుంచితిమనుకొనుడు. దానిపై కొంత దూరమున మరబిగించియుండును. మీటను చెన్నపట్టణమున నొక్కుట మానినచో విద్యుత్పరిధి అసంపూర్తిగ చేయబడుటచేత విద్యుత్ప్రవాహము నిలిచిపోవును. చుట్టకు కాంతీకరణశక్తి తగ్గిపోయి, ఇనుపముక్క

నాకర్షించి యుంచలేక పోవును. ఆయినుపముక్క స్ఫోరక (Spring)మువెుక్క సహాయమున తన యథాస్థానము నాక్రమించును. ఇట్లు వచ్చుటలో మరల తగిలినప్పుడు శబ్దము కలుగును. ఈశబ్దమే తంతివార్తాలయమున మనము వినునది.

దూరములో నున్న మనుష్యుడు మనదగ్గరకు రావలెనన్న మనము చేయి ఊపుదుము. రమ్మని పిలుచుటకు ఇది యొక సంజ్ఞ. ఇట్లు చేయుటచేత ఆమనుష్యునికి రావలయునని అర్థమగును. అనగా మనము ఒకరినొకరర్థము చేసికొనవలెనన్న కొన్ని సంజ్ఞలుండవలెనని తేలును. చెప్పుచున్న విషయములను త్వరత్వరగా వ్రాసికొనుటకు సంక్షేపలిపిలేఖకుడు అక్షరములకు బదులుగా కొన్ని గీతల నుపయోగించును. అట్లే 'అ' అను నక్షరమును .— ఈగుర్తులచే సూచింపవచ్చును. అట్లే 'త' అనునది — ఈగుర్తు చేతను, డు అనునది —. . ఈగుర్తు చేతను చూపిన ఆతడు అనునది మొత్తము మీద .— — —. . ఈగుర్తుల చేత తెలుపవచ్చును. ఇట్లు చుక్కలవలనను గీతలవలనను అక్షరములను సూచించు పద్ధతి 'మోర్సుకోడ్' అందురు. ప్రస్తుతము తంతివార్తలన్నియు ఇంగ్లీషుభాషయందే జరుగుచున్నవి. చుక్క గీటు .— ఈసంజ్ఞ ఇంగ్లీషుభాషలో మొదటి అక్షరమైన 'ఏ' అనుదానికి వర్తించును. ఇట్లే ఇతరఅక్షరములకు వర్తింపజేయు సంజ్ఞలను వ్యాసము చివర చూడగలరు. అతడు అనుమాటను రాజమహేంద్రవరము పంపవలయునన్న, మనము మీట మొదట నొక్కవలయును. ఇట్లు చేయుటచేత రాజమహేంద్రవరములో యినుపముక్క ఆకర్షింపబడును. మీటను ఒక సెకన్డుకాలము మాత్రమే నొక్కియుంచి వదలినచో ఇనుపముక్క పైకెగిరి టిక్ శబ్దము చేయును. మీటను సెకన్డుకన్న ఎక్కువకాలము నొక్కి యుంచినచో శబ్దము కొంతసేపటికిగాని వినబడదు. ఇట్లు మీటవలన శబ్దములు వెంటవెంటనేగాని లేక కొంత ఆలస్యముగ గాని పంపవచ్చును. శబ్దము వెంటనే వినబడిన అది చుక్కగాను, కొంచెముసేపు ఆలస్యమైనచో గీతగాను పరిగణింపబడును. ఇట్లు 'అతడు' అనుపదమును చుక్కలలోనికి గీతలలోనికి మార్చి మీటను క్షణముగా నొక్కుచుండుటచే రాజమహేంద్రవరమునకు కొన్ని నిమిషములలో తెలియజేయవచ్చును. విద్యుచ్ఛక్తి తీగెలలోనుంచి సెకన్డుకు 60 మైళ్లు అనగా నిమిషమునకు 3,600ల మైళ్లు చొప్పున ప్రయాణము చేయును. అందుచేత నిచ్చట మీటను నొక్కుచున్న కాలముననే విద్యుచ్ఛక్తి రాజమహేంద్రవరము చేరును. అందువలన వార్తను సంజ్ఞలచే విద్యుత్సహాయమున తంతిమూలకముగ నంపజేయగలము.

ఇది సులభపద్ధతియే యైనను దీనిని వాడుకలో పెట్టుటలో గొన్ని కష్టములు గలవు. తీగెఖరీదు హెచ్చు. హిందూదేశమునుండి ఇంగ్లాండునకు తంతివార్తల నంపుటకు ఒక పెద్ద తీగెను కట్టుదిట్టములు చేసి బొంబాయినుండి సముద్రపు పడకపైన వేయుచు ఇంగ్లాండువరకును దీసికొనిపోయిరి. ఇది యెంతవ్యయ ప్రయాససాధ్యమైనపనియో చదువరులే సులభముగ గ్రహింపగలరు. ఇంతియేకాదు. తీగె ఏతుపానువలననో మఱియేకారణముననైన తెగిపోయిన తంతివార్త లాగిపోవును. ఇంకొకవిశేషము చూడగలరు. చెన్నపట్టణమునందు వ్యాపారము మందము అయినను ఇచ్చటినుండి దేశములోని వివిధభాగములకు సుమారు నూఱుతీగెలు పోవుచున్నవి. అందు కొన్ని కలకత్తా బొంబాయిలకును బోవును. అట్లు కలకత్తాకు పోవు తీగె బెజవాడనుంచి పోవునదియే యైనను బెజవాడకు ప్రత్యేకముగ నొక తీగె యేర్పాటు చేయబడినది. ఇట్లే చెన్నపట్టణముతో నెక్కువగ వ్యాపారసంబంధమున్న ఊళ్లకన్నిటికి ప్రత్యేకముగ నొక్కటిగాని అంతకంటె నెక్కువగాగాని తీగెలు వేయుదురు. ఇందువలన నీతంతివార్తాపద్ధతి యెక్కువ వ్యయసాధ్యమైనదని తేలుచున్నది. తంతియుపయోగము లేకుండ సమాచారములను దెలుపుపద్ధతియేదియైనను చేయక అందువలన నీనూతన వాయువార్తాపద్ధతి (Wireless Telegraphy) సర్వజనాంగీకారమై చెలయుచున్నది. ఇదియునుంగాక దీనివలన గొప్ప యుపయోగములు కలవు.

## వాయువార్తాపద్ధతి : తరంగసంచలనము

ఇప్పుడు రెండవపద్ధతిని బరిశీలింతము. దీనిని కొలదికాలముక్రితమే శాస్త్రజ్ఞులు కనిపెట్టిరి. ఏదైన సంగతి దూరములోనున్న వారికి తెలియపఱుచవలయునన్న దానిని

రెండువిధములుగ దెలుపవచ్చును. ఒకదానియందు మన ముపయోగించువస్తువు గమ్యస్థానముజేరి మనపక్షమున సమాచారమును దెలుపును. మనము ఇంగ్లాండునందున్న స్నేహితునకు ఉత్తరము వ్రాసినచో మనము వ్రాసిన జాబు అతనియొద్దకు జేరును. అతనికి జేరు ఉత్తరమునకును మనము వ్రాసినదానికిని ఏమియు భేదము లేదు. అర్జునుడు గురువైన ద్రోణాచార్యుని ప్రతిఘటింపవలసి వచ్చినపుడు యుద్ధమారంభింపక పూర్వము ఒకనమస్కార బాణమును వదలెననుట లోకవిదితమే కదా. ఇక్కడ అర్జునుడు వేసిన బాణమునకును ద్రోణుని పాదములమీద పడిన బాణమునకును భేదమేమియు లేదు. ఆరెండు నొకటియే. ఇట్లు ఏమార్పును లేక వస్తువు తనంతట తానే ఒకస్థలమునుండి ఇంకొకస్థలమునకు పోయి సమాచారము తెలుపుట మొదటిపద్ధతి. ఇక రెండవది అట్లుకాదు. ఒక వీధిబడిపంతులు ఇంటిలోనుండి బయటకు వచ్చు సమయమైన దనుకొనుడు. అతడు రాకపూర్వము పిల్లలందరు అల్లరిచేయుచున్నను అతడు వచ్చుచున్నాడనగనే వరుసగా కూర్చుందురు. అందులో ఒక పిల్లవాడు అతని చేతిలోని బెత్తమును జూచినాడనుకొందము. అట్లు చూచిన పిల్లవాడు మొదట కూర్చుండిన వాడైనను

తరంగ సంచలనము



పిల్లవాండ్రు కదలకుండినను బెత్తముమాట మాత్రము చివరవానికి కూడ దెలియునని నిస్సంశయముగ జెప్పగలము. అచట ఏపిల్లవాడును కదలలేదు. అయినను సమాచారముమాత్రము చివరపిల్లవానివఱకును ప్రసరించినది. చెరువులో నొక కఱ్ఱనునిలువుగా పైకి క్రిందికి ముంచుచున్నామనుకొనుడు. అప్పుడా కఱ్ఱచుట్టును చిన్నచిన్న తరంగములు లేచి నలుదెసలకు బ్రాకును. అయినను నీరు మాత్రము తనస్థానమునుండి కదలదు. ఉపయోగించిన శక్తి నీటిలో సంచలనము కలిగించినది. ఆశక్తి నీటిమీదుగా నలుదెసలకు పోవుచున్నది. అంతియేకాని నీటిని ఏమాత్రము స్థానభ్రష్టము చేయుటలేదు. ఒక కెరటము ఉప్పొంగి ప్రక్కనున్న నీటిని కొంచెము రాశిగా ఏర్పఱచును. అప్పుడా రాశి చుట్టుప్రక్కలనున్న నీటికంటె యెత్తుగా నుండుటవలన తిరిగి క్రిందికి దిగుట ప్రారంభించును. ఇట్లు దిగుట ఇతరనీటితో సమానస్థితికి వచ్చినవెంటనే ఆగదు. దీనికి కారణమిది. మనము రైలుబండిలో ప్రయాణము చేయుచున్నప్పుడు రైలుబండి ఆగగానే ముందుకు తూలుదుముకదా. మనమేస్థితిలో నున్నామో అది మార్పునొందుటకు కొంచెము కాలము పట్టును. క్షణకాలములోనే మార్పును కలుగనేరదు. ఇది పదార్థవిజ్ఞానశాస్త్రములోని ముఖ్యసూత్రములలో నొకటి. ఇందువలన రాశిగా నేర్పడిన నీరు దిగుట ప్రారంభించిన పిదప అసలునీటిమట్టముకంటె క్రిందికిపోయిన తరువాత గాని దాని వడితగ్గదు. నీటిమట్టముకంటె అడుగునకు పోయి తిరిగి యథాస్థానము నాక్రమించబోవునప్పుడు తన ప్రక్కనీటిని రాశిగా నేర్పడునట్లు త్రోయును.

తరంగము




1. తరంగ శిఖరము. 2. తరంగాయతి.
3. నీటిరాశి. 4. నీటిమట్టము.

ఇట్లు నీరు మొదట రాశిగా నేర్పడి పిదప నీటిమట్టముకంటె అడుగునకు పోయి, మరల పైకి వచ్చుటలో ప్రక్కనీటి నెగద్రోసియీవిధమున తరంగములుగ నేర్పడుచున్నది.

ఈపద్ధతిలో శక్తితరంగముల రూపమున చాలదూరము వఱకు ప్రసరించినను నీరుమాత్రము తనస్థానమును విడిచి పోవుటలేదు. ఈతరంగములను తగిన ట్లుపయోగించి నచో తరంగసంచలనమునకు కారణభూతమైన శక్తిని ఆ తరంగక్షేత్రమున తిరిగి తీసికొనవచ్చును. ఇట్లే ఇంకొక యుదాహరణము తీసికొందము. మనము నివసించు భూమి చుట్టును గాలియున్నది. రామ అని పిలిచినప్పుడు ఏమి జరుగును? కఱ్ఱ ఏవిధముగ నిశ్చలమైన నీటిలో సంచలనమును పుట్టించెనో అట్లే మనము రామ అని యుచ్చరించినప్పుడు మననోటిచుటనున్న గాలిని కదల్చిన వారమగుదుము. ఈకదలిక గాలిలో తరంగరూపమున పోవును. రాముడు చెవిటివాడు కానిచో, అనగా అతనిచెవియందుండు గూబ సరిగానున్నచో నీవాయుతరంగములు వాటిని తాకును. ఈతాకుడుయొక్క ప్రతిఫలమే రామ యని యతనికి వినబడును. మనము మాటలాడినప్పుడు గాలిలో సంచలనము పుట్టించుచున్నాము. ఈసంచలనమే దూరప్రదేశములకు, తరంగరూపమున పోవుచున్నది. దీనివలన మనము ముఖ్యముగ గ్రహింపవలసిన విశేషమేమనిన మనచెంతను నున్న గాలి మనయొద్దనే యున్నది. మనము మాటలాడినంత మాత్రమున వాయుదేవుడు పరుగెత్తుటలేదు. కాని మనము చేసిన సంచలనమతివేగముగా అనగా నిమిషమునకు ౧౧౨౦ అడుగులు లేక రమారమి రెండుఫర్లాంగులు ప్రయాణము చేయుచున్నది. గాలిలేని ప్రదేశమున మాటలాడినచో మాటవినబడదు. పైచెప్పిన దాని ననుసరించి ఈరెండవవిధమున చలనములేకుండ తరంగములద్వారా శక్తిని పంపించుటకు ఒక సాధన ముండవలయునని తేలఁగలదు. మొదటి యుదాహరణమునందు నీరును, రెండవయుదాహరణమునందు గాలియు సాధనములై తాము స్థానభ్రష్టత పొందకయే మనముపయోగించిన శక్తిని తరంగరూపమున పలుదేశములకు ప్రసరింపజేసెను.

## సర్వవ్యాపకము (Ether)

ఈసాధనములేగాక లోకమందు ఇతరసాధనములు పెక్కుగలవు. వీటిలో ముఖ్యమైనది సర్వవ్యాపకము (Ether) శక్తికి ముఖ్యముగ మూఁడురూపము లున్నవనియు అది వేడి, వెలుతురు, విద్యుత్తు అని చెప్పియుంటిమి. శక్తి యొకటియేయైనచో పైచెప్పినవాటికి మూల పదార్థ మేదో యొక్కటైయుండవలయును. అనగా ఒకే మూలపదార్థమే ఈమూడింటికిని కారణమై యుండవలెను. ఈమూడును తరంగముల మూలముననే వ్యాపింప జేయఁబడుచున్నవి. వెంటవెంటనే ఒకదానినొకటి అంటియుండు రెండు తరంగశిఖరముల మధ్యనుండు దూరమును తరంగాయతి (Wave length) అనిపేరు. దీని యొక్క పరిమాణమును బట్టి తరంగములు వేఱువేఱు ఫలములనొసంగును. తరంగాయతి $\frac{8}{100000}$ సెంటిమీటరైనచో వెలుతురిచ్చును. దానికంటెను $\frac{8}{1000}$ సెంటిమీటరైనచో వేడిమిపుట్టించును $\frac{2}{100000000}$ సెంటిమీటరు నిడివి గల తరంగములే శస్త్రవైద్యమున నుపయోగపడు 'రంజన కిరణము'(XRay) అను విద్యుత్ఫలితము నొసంగుచున్నది. తరంగాయతిలో భేదముండుటయే యిట్టి వేర్వేఱు ఫలితములకు కారణము. సూర్యుడు అనునది భగవంతుడేర్పఱచిన యొక సంచలనకారిణి. దానియందుండు శక్తిచే తరంగములు బయలుదేఱును. వీటిలో పెద్దవాటివల్ల వేడిమియును, చిన్నవాటివల్ల వెలుతురును కలుగుచున్నది. ఇంతియగాక పలువిధములైన ఫలితము లనేకములు కలుగుచున్నవి.

## విద్యుత్ సంచలనమువలన గలుగు సర్వవ్యాపక తరంగము




1. తరంగము. 2 విద్యుత్ కిరణములు.

ఇంతవఱకు తరంగచలనముద్వారా సూర్యరశ్మి మనకు సోకుచున్నదని తెలిపియుంటిమి. తరంగములు పుట్టుటకు నీటివంటి సాధనమేదియో యుండవలెను గదా. భూమిపైన గాలి ౨౦౦ మైళ్లు మాత్రమే వ్యాపించి యుండుటచే సూర్యునివద్ద జరుగుచున్న సంచలన

మించుటకు వచ్చుటకు మఱి యేదైన సాధన ముండవలయును. అందువలన శాస్త్రజ్ఞులు భూమి ఆకాశము అన్నిచోట్లను ఈశ్వరునిబోలి సర్వవ్యాపకమైన ఒకసాధనమున్న దందురు. అందువలన దానినే ఇంగ్లీషున 'ఈథర్' అందురు. దీనికే సర్వవ్యాపకము అని పేరిడితిని. ఇది సృష్టి యందంతట నిండియున్నను గాలివలెనే కనబడదు. ఈసర్వవ్యాపకములో సంచలనము కలిగించుటవలననే 'ఆయతి' భేదములుకల తరంగములు బయలుదేఱి పలువిధములగు ఫలితముల నొసంగుచున్నవి. కావున మనము తెలిసికొనవలసిన దేమన ఈసర్వవ్యాపకములో నేవిధమునైన నియమితములగు ఆయతిగల తరంగములను పుట్టించినచో వాటివలన దూరప్రదేశమున గొంత ఫలితములగును. ఆఫలితరూపమున సమాచారములను దెలుపవచ్చును.

సర్వవ్యాపకములో నీతరంగసంచలనము అతిత్వరిత గతినుండును. గాలియందు మాటలు తీసికొనిపోవు తరంగములు సెకనుకు 1170 అడుగులదూరము మాత్రముపోవును. కాని యీ సర్వవ్యాపకమునందు తరంగసంచలనము యొక్కగతి సెకనుకు 186 వేలమైళ్లచొప్పున నుండును. అనగా సర్వవ్యాపకములో నొకానొక స్థలమందు సంచలనము గావించు మనుకొనుడు. అప్పుడు తరంగము లేర్పడుటకు ప్రారంభమగు. ఒక సెకనుకాలములో 186 వేలమైళ్ల దూరప్రదేశమున గూడ తరంగము లగుపడును. అనగా భూమిని ఆఱుమాఱులు చుట్టివచ్చును.

## విద్యుత్పరమాణువు (Electron)

ఈతరంగ సంచలనము గావించుటకు విద్యుచ్ఛక్తి సాయపడుచున్నది. అందుచేత దానిని గుఱించి మనము తెలిసికొనవలసియున్నది. విద్యుచ్ఛక్తి ద్రవరూపమైన పదార్థమను నొక సిద్ధాంతము కలదని యీవఱకే చెప్పియుంటిమి. ప్రతివస్తువును రసాయనశాస్త్రజ్ఞుల లెక్క ప్రకారము చిన్నదిచిన్నదిగ విభజించినచో కడకు పరమాణువును సంపాదింపవచ్చును. లోకములోని వస్తువులన్నియు 80 మూలద్రవ్యముల (Elements) యొక్క సమ్మేళనమువలన గలిగినవి. ఇట్టి ప్రతిమూలద్రవ్యము విభజించినచో పరమాణువు అనునది వచ్చును. దానిని విభజించుటకు వీలులేదు. దీనికి గల గుణములేయే మూలద్రవ్యమునుండి అది విభజింపబడినదో ఆపదార్థమునకుగూడ నుండును. ఇది రసాయనశాస్త్రజ్ఞుని యూహ. కాని ప్రస్తుతము పరమాణువును గూడ విభజింపవచ్చుననియు అట్లు చేసినచో కొన్నివేలు విద్యుత్పరమాణువులు వచ్చుననియు నొకసిద్ధాంతము బైలుదేఱినది. ఉదజని (Hydrogen) పరమాణువునందు విద్యుత్పరమాణువులు రెండువేలు ఏకాకారముగ నున్నచో ప్రాణవాయువు పరమాణువునందు వేలకొలదిగ మఱియొకరీతి నేర్పడియుండును. అనగా పదార్థములన్నియు నొకదానినుండి మఱియొకదానిని మార్చుట కవకాశము కలదు. బంగారము ఇత్తడి ఒకదానిని ఇంకొకదానినిగ జేయవచ్చును. రెండును అసంఖ్యములైన విద్యుత్పరమాణువుల సమూహమే. ఈవిద్యుత్పరమాణువుల నిర్మాణ విధానములను బట్టియు సంఖ్యనుబట్టియు అసలుమూల ద్రవ్యము లేర్పడుచున్నవి. ఇక విద్యుత్పరమాణువనగా సూక్ష్మాతిసూక్ష్మమైన యొక కణము. దానికి ఒక ముఖ్యగుణము కలదు. దానియందు శక్తి విద్యుద్రూపమున నుండును. ఈపై సిద్ధాంతమునుబట్టి విద్యుత్పరమాణువులు ఒకప్రదేశమునుండి ఇంకొకప్రదేశమునకు గదలుటయే విద్యుత్ప్రవాహ మనబడుచున్నది.

మూలపదార్థముయొక్క పరమాణువు




1. విద్యుత్ పరమాణువులు

ఒకపదార్థమున నీ విద్యుత్పరమాణువులు సహజముగ నుండవలసిన సంఖ్యకన్న నెక్కువ యున్నవనుకొనుడు. అప్పుడు దానిచుట్టును సర్వవ్యాపకమునందు ఒకఫలిత మేర్పడును. త్రాటియొక్క ఒకకొనను గట్టివేసి రెండవకొనను మెలిపెట్టినచో నేమగును ?

త్రాడు తనసహజస్థితిలోనికి వచ్చుటకు ప్రయత్నించునుగాని మనము దానిని అట్లురాకుండ త్రిప్పినచో అది మనకు లోబడినను దానిని మనచేతినుండి వదలివేయగనే అది మెలియంతయు విప్పికొని యథాస్థితికి వచ్చును. అట్లే పైపదార్థమునందును పరమాణువు లెక్కువయున్నందువలన జుట్టునున్న సర్వవ్యాపకమునందు

విద్యుత్ పరమాణువుల నెక్కువగాగలపదార్థము



1 కాంతీకరణ రేఖలు.　　2. విద్యుత్ కిరణములు.

ఒకమెలియేర్పడును అనఁగా ఆపదార్థము చుట్టును గొంగళిపురుగుయొక్క వెండ్రుకలవలె కిరణము లేర్పడును. సూర్యకిరణములవలె నివి మన చర్మనేత్రములకు గానరావు. కాని సూర్యకిరణము లెట్లు వెలుతురిచ్చుచున్నవో అట్లే యివికూడ విద్యుత్ఫలితముల నొసంగుచున్నవి. ఈ పైజెప్పిన పదార్థము ఒకప్రదేశమునుండి మఱియొక ప్రదేశమునకు బోవుచున్న దనుకొనుడు. అప్పుడు దానిచుట్టునున్న విద్యుత్కిరణములుకూడ దాని ననుసరించిపోవుచుండును. విద్యుత్తు + చలనము = కాంతీకరణము. అందువలన కాంతీకరణశక్తి పైఁజెప్పినపదార్థము పోవుచున్నప్పుడు దానిచుట్టు సాలి పురుగుయొక్క గూటివలె రేఖలుఁ నేర్పడును. అనఁగా విద్యుత్ఫలితములకు కాంతీకరణఫలితములు సమకోణముగ నుండును. ఈపైఁజెప్పిన పదార్థమునందు విద్యుత్పరమాణువులు ఒక సెకనుకాలమునఁ దీసివేసితి మనుకొనుడు. అప్పుడు జరుగునదియేమి? ఫలితములన్నియు వెంటనే నశింపవు. గుఱ్ఱముమీద స్వారిచేయుచున్న రౌతు ఎంతనిపుణుడైనను గుఱ్ఱమాగినక్షణమున అతడు ముందుకు తూలకుండునా? అట్లే పైనిచెప్పిన రేఖలన్నియు నశింపకుండ ముహూర్తమాత్రము నిలిచియుండునా. అంతలో నే మరల విద్యుచ్ఛక్తిని ఆపదార్థమున ప్రవేశపెట్టితి మనుకొనుడు. అప్పుడు రేఖలన్నియు మరల నేర్పడును. కాని పూర్వపువాటికిని వీటికిని కొంచెము భేదముండును. తగరపు రేకు దాకదానిని తీసికొని ఇటునటు త్రిప్పి మరలమరల వంచినచో నేమగును? తునిగిపోవును కదా? విద్యుత్పరమాణువులు త్వరితగతిని ఉండుచుం బోవుచు నుండుట చేత పై జెప్పిన రేఖలు పదార్థమునుండి విడిపోవును.

విద్యుత్ ప్రవాహముయొక్క ఘూర్ణువలన తునిగిపోవు కిరణములు.



1. పదార్థము 2. రెండవకిరణము. 3 మొదటికిరణములు.

అనగా సర్వవ్యాపకమునందు సంచలనము గలిగించిన వారమగుచున్నాము. ఒక పదార్థమునందుగాక ఒక పొడుగుపాటి తీగయందు విద్యుత్ప్రవాహము నొకదాని నేర్పఱచి ఆప్రవాహమును క్రిందికి పైకి వానపామువలె బరువిడునట్లు చేసినచో సర్వవ్యాపకమునందు విద్యుత్కిరణములను ప్రసరింపజేసినవారమగుచున్నాము. ప్రతిక్షణము ప్రవాహము చంద్రబింబముమాదిరి మార్పునందుచు వచ్చినచో మేరలేని సంచలనము కలిగింపవచ్చును. ఈసంచలనమే తరంగరూపమునఁ గొన్నివేల మైళ్లు పరువెత్తును.

ఈకిరణములమూలముననే అనగా నీవిద్యుత్ఫలితమును గలిగించు సర్వవ్యాపకతరంగముల (Ether waves) మూలమున సమాచారమును నాల్గుదిశల బంపవచ్చును. ఒక రెండునిమిషములు తరంగము లుద్భవించునట్లుచేసి మఱియొక నిమిషమాగి మరల నాల్గునిమిషము లుద్భవింపునట్లు చేసినచో నిది మార్కోనీలోని

చుక్క గీతను సూచించునుగదా. అనగా ఇంగ్లీషులో ఏ అను అక్షరమును బంపుచున్నాము. ఈతరంగములు త్రుంచబడిన కిరణములు నలుదెసల పర్వెత్తుట




1. త్రుంచబడిన విద్యుత్ కిరణములు. 2. పొడవైన తీగ. 3. విద్యుత్ కిరణములు. 4. విద్యుత్ పరమాణువులు.

దూరమునన్న యొక రాగితీగ నెదుర్కొనినచో దానియందు విద్యుచ్ఛక్తి పుట్టునట్లు చేయును. ఇట్లు పుట్టు విద్యుద్రాశివలన పంపబడిన సమాచారమును దెలిసికొనవచ్చును. ఈవిషయము ముందు వివరింపబడును.

సముద్రముమీద ప్రయాణముచేయు నావికులకు రాత్రులు భూమిని సూచించుటకు ఒక దీపస్తంభము (Light house) చెన్నపట్టణమునం గలదు. దానియందలి కాంతిపుంజము రాత్రులందు గిఱ్ఱున గుండ్రముగ చక్రమువలె తిరుగుచుండును. ఇట్లుతిరుగుచున్న వెలుగుదు కిరణములను ఒకానొక ప్రదేశమున నొకనియమితపద్ధతి ననుసరించి పడునట్లు చేసినచో సమాచారములను ఈదీప స్తంభమునుండి ఆప్రదేశమునకు దెలియునట్లు చేయవచ్చును. వాయువార్తాపద్ధతియు నిట్టే. ఒకవాయువార్తాకార్యాలయము (Wireless station) నుండి యగో

వాయువార్తా కార్యాలయము

1 3 2 3

1. విద్యుత్ ప్రవహించు తీగెలు. 2. కార్యాలయము. 3. ఊచలు.

...గాన వెంటనే వచ్చుచున్నది. నడచుచు ...చు పోయి యామె యొకచోట నిలువ ...నది. ఆప్రక్కనే యొక మందారవృక్షము ...న్నది. అది యాపాదమస్తము పూచి తంగే



...డువలె సంధ్యాసతివలె కొట్టవచ్చినది. ఆమొ ...క్క—, నీలలోచనుడు, శ్వేతసౌందర్యాభిప్రాయములను భేదించుటకుగాను, రెండుసంవత్సరముల క్రింద నాటినది. నేటి కది కుసుమితమైనది. పాపము నీలలోచనుడు మాత్రము

...ప్రస కాంతు ...శ్వేత నిలువెల్ల వణకిపోయినది. కన్నులు మూసికొన్నది.

ఆహా! అదియేమి? అదియేమి? కన్నులు మూసికొన్నంత సేప రా యెదురుగా ప్రత్యక్షమైనది? ఆహా! నీలలోచనుడా! ప్రసన్నదీనమైన యా వదనము మహాశ్వేతవంక కనుఱెప్ప వాల్చక చూచుచున్నది. ఆ ప్రసన్నదీనతా మాధుర్యమున కాగలేకపోయినది శ్వేత. కన్నులు తెఱచినది. ఎదుట మందార వృక్షముప్రక్కన లేడిపిల్ల.

మనస్సునకు భారము తగ్గలేదు. ఆమెపైకి యేదో మార్పు వచ్చినది. తనగదిలోనికి పోయి ప్రక్కమీద పరున్నది. శ్రమచేత కనులు మూత పడినవి. ఆహా! కట్టెదుట నదియేమి? మరల నా నీలలోచనుని వదనము. శ్వేతకు భయము వేసినది. కనులు తటాలున తెరచినది. ఆమె కేమియు తోచలేదు. గది నాల్గువంకలు చూచినది. లేచిపోయి, యచ్చటనున్న బీరువా తీసినది. నీలలోచనుడు, సంవత్సరము క్రింద కొన్న, యెర్రని పట్టుచీర బీరువా యడుగుభాగమున నేవియో పుస్తకముల క్రిందనలిగిపోవుచున్నది. అదితీసినది. కట్టుకొన్నది. ఆతీసికొనుటకు కట్టుకొనుటకు గంటసేపుపట్టినది. శ్వేతతల్లి యానాడామెవంక నివ్వెఱవోయి చూచినది. ఆ చూపునరిగా నీలలోచనుడు చూచినట్లున్నది.

భయము
ఏ రాత్రి వేళనో కనులమూ
ముందుగా వచ్చినది కాబోలు.

మఱునా డామె ప్రొద్దెక్కి లేచినది. తగినంత కాలము నిద్రించుటచేత నామె దేహము కొంచెము తేలికగా నైనది. అదిమొదలు ఆమెకు సౌందర్యవిషయమున నభిప్రాయములు మారినవి. రంగుచీరలు తక్క నామె యిప్పుడు మఱియొక్క చీర కట్టదు. తల్లి వలదన్న కొలది, మామారివారు చెప్పుకొన్న కొలది, నగలు ధరించుచున్నది. ఇందుకు కారణ మున్నది. కనులు మూసినచో నామెకు నీలలోచనుడు ప్రత్యక్ష మగుచున్నాడు. అతడు కనపడకున్న బాగుండు నని యున్న దామెకు. ఆమె యేమి చేయగలదు. నిస్సహాయురాలై పోయినది. కనులు మూసినా అతని సాక్షాత్కారము.

అతడు కనంబడినపుడెల్ల నామె కమిత భయము వేయుచున్నది. ఆమె యెఱ్ఱచీర కట్టుకుని, యొడలెల్ల నాభరణములు తాల్చినపుడు, కనులు మూసికొనుట తటస్థించినా, అపుడును నీలలోచనుడు కన్పించుచున్నాడు, కాని, యామె కెందుచేతనో భయముగా నుండదు. విగతభూషణయై తెల్లచీర తాల్చియున్నపుడు కర్మము చాలక కనులు మూసిన దనుక, పాప మామె కే కొండయో విఱిగి వచ్చి నెత్తిపై పడునన్నంత భీతి కలుగుచున్నది.

తళ తళలాడ, సంజయెఱుపు బంగరుపూ బనారసుచీరకట్టి తోటలోనున్న చలువపై తల విరియబోసికొని యూరటబెట్టుక చున్నది.

అప్పటి యామె యాసౌకుమార్యమును ఆనందమును ఆ దృగంతవిన్యాసవైఖరులును చూచినవారి కామెవాసకసజ్జికవలె తోచును. అపుడొక్క మలయపవనకిశోర, మా పుష్పవాటికాసుగంధాకృతి, మెల్లగా నామె మీదకు వీచినది.

దూరమున నెవరో వచ్చుచున్నట్లైనది. శ్వేత అటుచూచినది. మందార మటుపోయినది. ఎదురుగా రాధారాముడు కనంబడినాడు. ఇరువురు నొకరి వంక నొకరు నిశ్చలముగాఁ జూచుకొనిరి. అరనిముసము ప్రపంచకము మాట వారికి తెలియలేదు. మరల నొక్క గాలికెరటము వచ్చినది. శ్వేత యులికిపడి చీర సర్దుకొని చలువఱాతిమీదినుండి లేచి తొలగిపోయినది.

రాధారాముని శ్వేత యిదివరకు సరిగా చూడలేదు. కాని యాతని నామె యెఱుగును. 'అతని పేరు రాధారాం.' ఇతడును శ్వేత యన్నగారగు మధుకాంతుడును స్నేహితులు. రాధారాం బొంబాయిలో నొక పత్రిక కధిపతిగా నున్నాడు.. మధుకాంతుని చూచిపోవుటకు వచ్చినాడు. నాల్గురోజు లయినది

వచ్చె. శ్వేతసంగతి యతనికి తెలియును. అత
డును ఇదివర కామెను పరీక్షగా చూడలేదు.
నేడామెయందము వాతని సమ్మోహితుని చేసి
నది. రాధారాం తత్త్వజ్ఞానసభవాడు (Theo-
sophist) ఇంతవరకు బ్రహ్మచారి.

ఇరువురును ఎవరిదారిని వారు వెళ్ళిరి.
దీపములు పెట్టువేళకు శ్వేత తాను క్రొత్తగా
నాటిన మందారమునకు, తోటమాలి నీళ్లు
పోసెనో లేదో చూచుటకు తోటలోనికి
వచ్చెను. ఆమందారము తానింతకుముందు
కూర్చున్న చలువరాతికి దగ్గరలో నున్నది.
శ్వేత చూచినది. మందారము బోదెలో పోసిన
నీళ్లు పీల్చుకొనుచున్నది కాని లేడిపిల్ల దాని
చివుళ్లన్నియు కొరికి తిన్నది. శ్వేతకు విసువు
పుట్టి చలువరాతిమీద కూర్చుండబోయినది.

శ్వేత కాశ్చర్యమైనది. ఆచలువరాతి
మీద రెండు తెల్లగులాబిపూవు లొకటిగా
కట్టి యుంచబడెను. శ్వేత యాపూవులవంక
నిశ్చలముగాఁ జూచినది. ఒక్క యరనిముస
మామె యచ్చోట నిలుచుండి నెమ్మదిగా
నింటిలోనికి పోయినది.

సంజచీకటులు వచ్చినవి.

రాత్రి పదిగంటలు కావచ్చినది. శ్వేత
తనగదిలోనికి పోయినది. దీప వెక్కించి తన
శయ్యకు దగ్గరగా నుంచి చదువుటకు
కాదంబరి తీసినది. ప్రక్కపైకూర్చుండ
బోవుసరికి యామె యాలోచనా
నిమగ్నయైనది. ప్రక్కమీద నా
రెండు గులాబిపూవులగుత్తియు కన
బడినది. ఆమెహృదయము నేదియో
తాకినట్లైనది. ఆమె కొంచెముసే
పట్లే నిలిచి ఆ పూగుత్తి నెమ్మదిగా
తీసి దూరముగానున్న బల్లపైనుంచి
పరుండి చదువ నారంభించెను. చదువు
సాగలేదు. విసిగి చివరకు దీపము
తగ్గించి యటుతిరిగి కనులు మూసి
కొనెను. నిరంతరము ప్రసన్నదీన
ముగాజూచు నీలలోచనుని మొగము
నేడేలొకో తేజోహీనముగా
నున్నది. తేజోహీనతకాదు, ప్రస
న్నదీనముగానే యున్నది కాని
మునుపటి యంతగా లేదు.



"ఎదురుగా రాధారాం కనబడినాడు." పే. ౮౫.

రాధారాం మఱునాడు వెళ్లినాడు. అతనితో మధుకాంతుడును వెళ్లినాడు. మూడవ రోజున మధుకాంతుని చిరునామాతో రాధారాం సంపాదించుచున్న పత్రిక మధుకాంతుని యింటికివచ్చినది. ఇదివర కాపత్రిక యిచ్చటికి వచ్చుటలేదు. తపాలావానివద్దనుండి శ్వేత యాపత్రిక నందుకొన్నది.

ఒకనాడు శ్వేత తోటలో తిరుగుచున్నది. లేడిపిల్ల పికలు కొరికివేసినందున కాబోలు ఆమందారపుమొక్క చచ్చిపోయినది. అచ్చటినుంచి నెమ్మదిగా మూడుసంవత్సరముల క్రింద నీలలోచనుడు నాటిన మందారము వద్దకు పోయినది. అది శిశిరర్తువు. మందారమింకను కొంచెముగా పూయుచునేయున్నది. ప్రొద్దు గ్రుంకినంతనే చలివేసి యామె సేలువ కప్పుకొని పోయి పడుకున్నది. తలనిండ ముసుగువైచుకుని కళ్లు మూసికొన్నది. నీలలోచనుడు దూరదూరముగ పోవుచున్నట్లైనది. ఇంతలో నెవరో వెనుకనుండి తన్ను తాకినారు. వెనుతిరిగి చూచినది. లేడిపిల్ల. ముద్దుగా లేడిపిల్లను దగ్గరకు తీసుకుని దాని మూతి చేతితో పట్టుకున్నది. గిన్నెవలె నున్న మందారపూవులో లేడి మూతిపెట్టినది కాబోలు దానిముట్టె యంతయు మందారకుసుమకింజల్కములే. శ్వేత లేచి కూర్చుండి తన పైట చెఱగులో దానిముట్టె తుడిచి శుభ్రముచేసి దానిని కౌగిలించుకుని దానికి గూడ సేలువ కప్పెను. అది చూపి రాజక వదలించుకుని పారిపోయినది.

రాధారాం దగ్గరనుంచి శ్వేతకు తరుచుగా నుత్తరములు వచ్చుచుండెను. ఆమె మాత్రము నూటికి కోటి కొక్కసారి జవాబు వ్రాయుచుండెను. శ్వేతలో మరల నేదియో యింకొకమార్పు గోచరించుచున్నది. అది హఠాత్తుగా నొక్కసారి కలిగినది కాదు గాన నదియేమో తెలియుటలేదు. అది క్రమక్రమముగా సువ్యక్తమే యగుచున్నది.

ఆమె యిపుడు ఒత్తురంగుచీరలు కట్టుట మానివేసినది. గులాబిరంగు గోధుమరంగు మొదలగు లేతరంగులచీరలు కట్టుచున్నది. ఒడలిమీద భూషణములు కొద్దిగా తాల్చుచున్నది. మునుపటికన్న నామె మొగములో నుత్సాహము ద్యోతక మగుచున్నది. ఆమె శరీరసౌందర్య మంతంతకు బొల్లుపూవువలె మొగలిపుప్పొడివలె తెల్లనియేకువలె కొండు విరిగిపోయిన కాలువవలె మల్లెపూవువలె నిగనిగలై సొగసు మీఱుచున్నది. చకితములైన యామె లోచనములు అంతంతకు నిశ్చలము లగుచున్నవి.

శిశిరము వెనుక బట్టినది. మందారము పూయుట మానినది. మల్లెతీవ విరియబూసినది. ఆపూతోటలో శ్వేత యొక యుత్తరము చదువుకొనుచు నడచుచున్నది. ఆమె చేతులకు సన్ననిబంగారు మురుగులును మెడలో నొక బంగరుగొలుసును మాత్రమే యున్నవి. జరీపోగులుగల తెల్లనిపట్టుచీర యామె యొడలిపై శరత్కాలమేఘశకలము వలె వాయుధూత మగుచున్నది.

రాధారాం వచ్చినాడింతలో. ఒకరొకరు కౌగిలించుకొన్నారు. తాను చదువుచున్న నాటి మధ్యాహ్నము తమ పెండ్లివేళ నామె నల్లి వేషము సంతరించుకొమ్మని చెప్పినాడు.



శ్వేత కొంచెము లజ్జావనతవదనయైనది. రాధారాముఁన కా లజ్జామధురిమవలన నానందమై యామెనుకౌగిలించుకుని యామె చుబుకమునెత్తి యా యెఱ్ఱని పెదవులపై నొక చుంబనము చేసినాడు. అప్పటి యానందపారవశ్యమున నప్రయత్నముగా శ్వేత కనులు మూతపడినవి. శ్వేతకు చప్పున తెలివి వచ్చినది. నీలలోచనుడు కనంబడ లేదు. ఆమె కాశ్చర్యమైనది. అది నిజమో అబద్ధమో, అని యుత్తరమును శ్వేత మాటుచేసినది. రాధారాం దానివంక చూచి యామెకు తెలియునట్లు నవ్వినాడు. రాధారాం శ్వేతవంక నిలువున చూచి యామె యానాటి వేషము మిక్కిలి రమ్యముగా నున్నదని చెప్పి మఱు నాటి తరువాత పదినిమేషములలో నామె యొకవందసార్లు కనులుమూసికొన్నది. నీలలోచనుని చిహ్నముకూడ లేదు. అదిమొదలామె జీవితాంతమువరకు మరల నామెకు నీలలోచనుని రూపము కనిపించలేదు.

# నెలపూర్ణిమ్మ

## సవరణ

భారతి సంపుటము ౧. సంచిక ౧౨.

ఈ సంచికయందు "భారతీవందనము" అనుపద్యమున (౭౧ వ పుట కెదురు) "జ్ఞానముక్తియుక్తి" అనుటకు మారుగ "జ్ఞానముద్రాయుక్తి" అని చదువునది.




దుగ్గమహాంతి సీతారామ శర్మ గారు

గగనభాగంబు మేఘసంకలితమగుట
గాఢతిమిరంబు దిశలెల్లఁ గ్రమ్ముకొనుటఁ
గన్గొనఁగలేక దుర్గమగహనసీమఁ
జిక్కితిని గమ్యభవనంబు సేరుటెటులో !!

గీ. అభ్రనిర్గతకరకాప్రహారములను
శీతవాతతరంగ సంఘాతములను
గొయ్యవడి బిగువెల్లను గోలుపోయి
బడలి తనువెల్లఁ గంపింపఁదొడఁగె నకట!

గీ. శ్రుతిపుటకఠోరమై ప్రతిశ్రుతుల నీని
వనమృగారావము ల్వినవచ్చుచుండె
మృదులనవనీతహృదయంబు చెదరదొడఁగె
నక్కటా! ముక్తిమార్గంబు దక్కుటెటులో?

గీ. కంటకపరీతమై కాలుఁ గదలుపుటకుఁ
గూడ నలవికొదవించె నీ జాడలెల్లఁ
గష్టములపాలుగాక సౌఖ్యముగ గమ్య
గృహము సేరంగ సత్పథం బెయ్యదియొకో!

గీ. కారుచీఁకటి నెద్దియుఁ గానరాదు
మెఱుపుఁదీఁగ నిశ్చలముగా మెఱయఁబోదు
మొగులుచాటున దాఁగిలిమూఁతలాడు
మించు నాసించిపోవ నూహించునెడల
మధ్యమార్గంబునం దేమి మాయ కలదో!!

గీ. మారుతోద్వేలమున రూపు మాసిపోక
వర్షధారాహతిని గాంచివాసి చనక
ధ్వాంతవిధ్వంసమై శాశ్వతప్రభలను
గలుగుదీపిక నెన్నఁడు కాంచఁగలనో!

గీ. కడలు దెలివొందుజాడయే కానరాదు
పూర్వదిశ వేగుఁజుక్కయే పొడమలేదు
లోకబాంధవదివ్యావలోకనమున
కగ్గమై కృతకృత్యుండ నగుట యెపుడో !!

గీ. ప్రమదభవనాంతరమునఁ బూఁబాన్పుమీఁద
నచలితాత్ముండ నగుచు నే నధివసించి
శ్రమమువాయంగ నమృతగానమును వినుచు
గాలమంతయు హాయిగాఁ గడపు టెపుడో!





## కాశీనాథుని భైరవమూర్తి గారు

[మొదటి సంపుటము—పదునొకండవ సంచిక తరువాయి]

శ్లో. ఐందేవాగ్భవమైంద్రవాక్యసదృశం వేదాదివిద్యాగిరో, భాషా దేశముద్భవాః పదగతాః ఛందాంసిసప్తస్వరాన్, తాళాన్ పంచమహాధ్వనీన్ప్రకటయ త్యత్యంత్రప్రసారేణయ, ద్ద్రీబీజంపదవాక్యమానజనకం శ్రీమాతృకేతే పరమ్.
(దేవీమహిమ్నస్తవమ్)

ఇంతకుఁబూర్వము మూర్ఛనా వివరము లుదాహరింపబడినవి. ఈమూర్ఛనలందు గల్గు తానభేదవివర మిందు వ్రాయబడును.

శ్లో. తానా స్యుః మూర్ఛనా శ్శుద్ధాః,
షాడవౌడువితాశ్రితాః.—(సం॥ రత్నాకరం)

తన్యతే—విస్తార్యతే, అనగ విస్తరింప బడునట్టిదిగనుక 'తాన' మనబడుచున్న దని శార్ఙ్గదేవ ప్రణీతసంగీతరత్నాకరమునకు వ్యాఖ్యానకర్తలగు కల్లినాథులనువా రుదాహరించియున్నారు. మూర్ఛనలలో శుద్ధము లగునట్టివి తానములనియునిరూపించిరి. వీటిలో స్వరముల విస్తరింపు లేక గుణించుటయనియు గలదు. దీనియందు రెండువిధములు: శుద్ధ తానము, కూటతానము. ఒక్కొక్కరాగమును ప్రకాశిల్లునట్లు చూపించుటయే శుద్ధతాన మనియు; భాషాంగరాగస్ఫూర్తిచే ననగ రెండు రాగములు ప్రకాశిల్లునట్లు చూపించుటయే కూటతానమనియు గలదు. దీని కుదాహరణ ముగ సుబ్బరామదీక్షితులవారు తమసంగీత సంప్రదాయప్రదర్శినియను గ్రంథరాజమందు కాంభోజియనురాగమున కాకలినిషాదమును అవరోహణమందు (సని పద సా) అను ప్రయోగమందు మాత్రము పట్టుట ఆచార ముగ నుండినందున తానముగూడ నట్లే సంచారము చేయవలసియుండవలయును గనుక నిది రెండురాగములుగ ప్రకాశింపచేయుట మాత్రము గలుగ నేరదనియు వ్రాసియున్నారు. ఈతానభేదములలో షాడవౌడవము లని యు గలదు. కొందఱు, తానసంఖ్య మున్నూట ముప్పదియారు యనియు భరతులు చతురశీతి యనియు, ఉత్తరవ్యాఖ్యయందు "షడ్జగాస్సప్త, మధ్యమే సప్త" అను సంఖ్యోపపాదన మనుప పన్న మగుచున్నది. కనుక శుద్ధములనగ

"కాకల్యన్తరరహితత్వ" మనియు "వ్యుత్క్రమణో చ్చారిత స్వరరహితత్వం" అనియును కల్లినాథులు వ్రాసియున్నారు. సప్తస్వరములలో షడ్జముతక్క శేషించిన ఆరుస్వరములయం దొక్కొక్కస్వరలోపముచే షాడవములగుచున్నవి. షడ్జముమాత్ర మేలలోపమనగ అదిశ్రుతియగుటచేతను శ్రుతిలేనిపాట సమ్మతి కాదు గనుకను షడ్జవర్జము మాత్రము నిషిద్ధము. ఇట్లే నియతస్వరద్వయలోపమువలన ఔడవము లగుచున్నవి.

శ్లో. షడ్జగా స్సప్తహీనా శ్చేత్ క్రమాత్
సరిపస ప్తమైః, తథాఽష్టవింశతి స్తానాః
మధ్యమేసరిగోజ్ఝితాః; సప్తక్రమాద్యదా
తానా స్స్యు స్తదా త్వేకవింశతిః, ఏతేచై
కోనపంచాశ దుభయే షాడవామతాః;
(యుతాః)

సపాభ్యాం ద్విశ్రుతిభ్యాంచ రిపాభ్యాం
సప్తవర్జితాః, షడ్జగ్రామే పృథక్తానాః ఏక
వింశతి రౌడవాః; రిధాభ్యాం ద్విశ్రుతి
భ్యాంచ మధ్యమగ్రామగాస్తు తే, హీనా
శ్చతుర్దశైవ స్యుః పంచత్రింశత్తు తే
యుతాః; సర్వే చతురశీతి స్స్యుః మిళి
తాః షాడవౌడ వాః.

(రత్నాకరం, సం॥ దర్పణం)

ఈ మూర్ఛనాదికములం దుత్పన్నములగునవన్నియు తానములనియో కూటతానములనియో యనవచ్చునుగాని, తానములన్నియుమాత్రము మూర్ఛనలని చెప్పఁగూడదు. బ్రాహ్మణుల కందఱకును జందెమున్నదిగాని జందెమున్నవారెల్లరు బ్రాహ్మణులే యని చెప్పగూడదు. ప్రథమమున షడ్జగ్రామసంబంధములగు మూర్ఛనాదులందు నొక్కొకదానియందు సను శుద్ధతానములందు వికృతస్వర వర్జము గావలెను. దీనియందు షాడవములు సరిపనియను స్వరములవరుసగ వర్జముచేయ ($4 \times 7=28$) యిరువది ఎనిమిది షాడవతానములు వర్జము లౌచున్నవి. ఇట్లే మధ్యమగ్రామమునందు స, రి, గ,ముల వలన వర్జములను షాడవము లిరువదియొకటి ($3 \times 7=21$) యగుచున్నది. యీరెండును చేరి ($28+21=49$) నలువదితొమ్మిది యగుచున్నవి.

మరియు షడ్జగ్రామమున రెండుశ్రుతులు తగ్గించుటచే ఔడవములు గల్గుటచే, సప, గని, రిప, ఈ స్వరములు శుద్ధతానములందు వర్జనీయములు గనుక $3 \times 7=21$ శుద్ధతానము లేర్పడుచున్నవి.

ఇట్లే మధ్యమగ్రామమున రిధ, గని ఈరెండువర్జనీయము లౌటచే, $2 \times 7=14$ శుద్ధతానములు; గనుక నీగ్రామద్వయమున చేరి $21+14=35$ అగుచున్నవి. అన్నియు షాడవఔడవములు చేరి $49+35=84$ భరతులవారి మతానుసారము చతురశీతియని యేర్పడుచున్నదని తాత్పర్యము. ఇక కూటతానవిషయము:

శ్లో. అసంపూర్ణాశ్చ సంపూర్ణాః వ్యుత్క్ర-
మోచ్చారితస్వరాః, మూర్ఛనాః కూట
తానా స్స్యు రితి శాస్త్రవినిర్ణయః.

అనగ సంపూర్ణములనియు, నసంపూర్ణము లనియు, వ్యుత్క్రమో చ్చారిత స్వరము

ఇందు శ్రీరాగకుటుంబము అనగా పంచభార్యా సహిత శ్రీరాగముయొక్క స్వరూప ధ్యానాదికము లుదహరింప బడు చున్నవి.

శ్రీరాగము

శ్లో. షడ్జే షాడ్జీ సముద్భూతం శ్రీరాగం స్వల్పపంచమమ్, సన్యాసాంశగ్రహం మన్ద్ర గాంధారం తారమధ్యమమ్; సమశేష స్వరం వీరే శాస్తి శ్రీకరణాగ్రణీ.

(సం. రత్నాకరం.)

శ్లో. శ్రీరాగ స్సగ్రహః పూర్ణ శ్చారోహే చాల్పధైవతః; అవరోహే గవక్రం స్యా త్సాయంగేయ శ్శుభావహః.

(చతుర్దండిప్రకాశిక.)

శ్లో. శ్రీరాగ స్సచ విఖ్యాత స్సత్రయేణ విభూషితః, పూర్ణ స్సర్వగుణోపేతో మూర్ఛనా ప్రథమా మతా; కేచిత్తు కథయం త్యేనం ఋషభత్రయ సంయుతమ్.

(సం. దర్పణం.)

శ్రీరాగము

రాగధ్యానము:—

శ్లో. అష్టాదశాబ్ద స్స్మరచారుమూర్తిః ధీరో లసత్పల్లవకర్ణపూరః, షడ్జాదిసేవ్యోఽరుణ వస్త్రధారీ శ్రీరాగ ఏష క్షితిపాల మూర్తిః.

(సం. దర్పణం.)

రూపము:—పద్మమునుగాని లేక వీణనుగాని చేతబూని స్ఫటికాక్ష మాలాధారియై శ్వేతారుణ వస్త్రములధరియించి పదునెనిమి దేండ్ల ప్రాయముగల్గి రెండవ మన్మథునివలె శోభిల్లుచుండుననియు, ఉద్యాన వనమందు హాయిగ గూర్చుని గానము జేయుచుండి నట్లును, గలదు. మఱికొందఱ మతమున, రత్నకిరీటము ధరించి చేత కరవాలముబూని సింహాసనాసీనుండై యున్నట్లును గాయకులు గానముజేయుచుండ చక్కనిస్త్రీ లాతనితో సల్లాపములాడి సంతోష పెట్టుచున్నట్లును గలదు. ఈరాగము సాయంకాలమున పాడ దగిన దనిరి. మఱికొందరు పగలు రెండవ యామమునందు గానముచేయవలెననిరి. యీ వాడుకనుబట్టి ప్రస్తుతముగూడ ఉదయము 9 గంటలుమొదలు మధ్యాహ్నము 12 గంటల వరకు గానముచేయుట గలదు. కాని ఎప్పుడు పాడినను సర్వమంగళకరమనియు గలదు. దీనికి స్వరము:—సరిగమపదనిస. అథవా:— రిగమ పదనిసరి.

(సం. దర్పణం.)

మాళవశ్రీరాగిణి

శ్లో. సమస్వరా తారమంద్ర షడ్జాంశన్యాస షడ్జభాక్.

(రత్నాకరం.)

శ్లో. మాళవశ్రీరాగాంగా, పూర్ణా సత్రయ భూషితా, మూర్ఛనోత్తరమంద్రా స్యాత్ శృంగారరసమండితా.

(సం. దర్పణం.)

ధ్యానము:—

శ్లో. రక్తోత్పలం హస్తతలే దధానా విభావయన్తీ తనుదేహవల్లీ, రసాలవృక్షస్య తలే నిషణ్ణా స్తోకస్మితా సా కిల మాళవశ్రీః.

(సం. దర్పణం.)

రూపము:—

ప్రియవియోగిని యయ్యు వృక్షచ్ఛాయ యందు విశ్రమించి చేడియతో హాస మొన రించుచున్నట్లును, అప్రతిమానమగు సౌంద ర్యము గల్గి రక్తాంబరముల దాల్చి పీతవర్ణపు మేలిముసుగు ధరించినట్లును నుడివియున్నారు. మఱికొందఱు పద్మహస్తయై, చూతతరు మూలమున సింహాసనముపై నధిష్ఠించి, తన కట్టెదుర నాడుచు పాడుచున్న తన చేడియల తో కాలక్షేపము చేయుచున్నట్లు వ్రాసి యున్నారు. దీనికి స్వరము:—సరిగమపదనిస.

(సం. దర్పణం.)

మాళవిరాగిణి

శ్లో. ఔడవా మాళవీ జ్ఞేయా, నిత్రయా రిప
వర్జితా, రజనీ మూర్ఛనా చాత్ర కాకలీ
స్వరమండితా.

ధ్యానము:—

స్వకాన్తసంచుంబిత వక్త్రపద్మా శుక
ద్యుతిః కుండలినీ ప్రమత్తా, సంకేతశాలాం
విశతీ ప్రదోషే. మాలాధరా మాళవికేయ
ముక్తా.

రూపము:—సువర్ణ చేలాంచలము ధరించి, పుష్పికాభరణభూషితయై సాంకేతిక నిర్దిష్ట స్థలోపవిష్టయై సంపూర్ణమోహావేశము తో చుంబనోత్సుకుడగు భర్తను తదేకదృష్టిని విలోకించుచున్నట్లు వర్ణింపబడినది. కొందఱు, పత్యాగమనమునకై నిరీక్షించు చున్నట్లును మరికొందఱు తన ప్రభునితో రహస్యగోష్ఠి సల్పుచున్నట్లును వర్ణించియున్నారు. స్వరము =నిసగమధని.

(సం. దర్పణం.)

ధనాశ్రీ=ధనాసరి=ధన్యాసి

శ్లో. దూర్వాదళశ్యామలతను ర్మనోజ్ఞా కాంతం
లిఖన్తీ విరహేణ దూనా, శ్వేతే కపోలే దధతీ
దృగమ్బు నిష్యందినీ ధౌతకుచా ధనాశ్రీ.

రూపము:—దూర్వాదళ శ్యామకాంతిగల్గుమైచాయతో సుందరమగు మోముతో ప్రియ విరహాకులచిత్తయై కాంతుని విగ్రహము లిఖించుచు కన్నుల రాల్చిన స్రువులు పాండుర మగు కపోలముల దడిపి అనంతరము కుచము లను ప్రక్షాళనము చేయుచున్నట్లు వర్ణించిరి. మరియు రక్తాంబరముల ధరించి యుపవన మందు మోర(శ్రీ) (?) తరుచ్ఛాయోపవిష్టయై ప్రియగమనోత్కంఠయై యున్నట్లు వర్ణించి యున్నారు దీనికిస్వరము:—సగమపదనిస.

(సం. దర్పణం.)

వసన్తీ=వసన్త=వసన్తము.

శ్లో. వసన్తీ స్యాత్తు సంపూర్ణా సత్రయా కథితా
బుధైః, శ్రీరాగ మూర్ఛనైవాత్ర జ్ఞే
యా రాగవిశారదైః.

(సం. దర్పణం)

ధ్యానము:—శ్లో. శిఖండిబర్హోచ్చయబద్ధచూ
డా, కర్ణావతంసీ కృతశోభనామ్రా, ఇందీ
వరశ్యామతను స్సుచిత్రా వసంతికా స్యా
దళిమంజుళశ్రీః.

రూపము:—ఝుమ్మను తుమ్మెదలచే నావరింపబడి, మయూర పింఛాలంకృతమగు శిరోచూడము గల్గి, లేమామిడి చిగుళ్లను పుష్పములను కరపల్లవమున ధరించి, శ్వేత, రక్తాంబరములఁ దాల్చి, హరిద్రాచూర్ణము బూర్ణముగ మైనలఁది, ఉపవన తరుచ్ఛాయయం దుపవిష్టయై భర్తృహృదయాకర్షణ సంతోషజనకోపాయాన్వేషణాకులిత చిత్తయని

వర్ణించి యుండిరి. కొందఱు శ్రీకృష్ణునితో వసన్తోత్సవము (హోళీపండుగ) జరుపుచున్నట్లూహించి మఱికొందరు తనచేడియలతో నాటపాటలయందు నిమగ్నచిత్తయై యుండినట్లును దెలిపిరి. వసన్త ఋతువునందు గానము సేయదగుననిరి.

దీనికిస్వరము :—సరిగమపదనిస.

(సం. దర్పణం.)

ఆసావరీ=ఆశావరీ= అసావేరి.

శ్లో. అసావరీ గనిత్యక్తా ధగ్రహాంశాచ ఔడవా, న్యాసస్తు ధైవతో జ్ఞేయః కరుణారస నిర్భరా.

అథవా, శ్లో. కుకుభాయా స్సముత్పన్నా ధాంతా మాంశగ్రహా మతా, పంచమేనైవ రహితా షాడవాచ నిగద్యతే.

(సం. దర్పణం.)

ధ్యానము:—శ్రీఖండశైలశిఖరే శిఖిపింఛవస్త్రా, మాతంగ హస్తికమనోహర హారవల్లీ, ఆకృష్య చందనతరో రురగం వహన్తీ, ఆసావరీ వలయ ముజ్జ్వల నీలకాన్తిః.

(సం. దర్పణం.)

రూపము:—ధౌతవస్త్రముల ధరించి, సర్పాభరణముల దాల్చి నీలదేహచ్ఛాయ గల్గి, నుదుట చందన మలది పుష్పమాలికల ధరించి యుపవనమధ్యస్థతరుమూలస్నిగ్ధశీతల ఛాయాసీనయై యుండినట్లును, తత్ పరిమళము తదుపాన్తసీమలందు వ్యాప్తమాచున్నదనియు వర్ణించిరి. కొందఱు, పర్వతాగ్రమున స్వావోధకవనం దుపవిష్టయై యున్నదనిరి. మఱికొందఱు పర్వతాగ్రమున చందనతరుమూలమున ఆత్తిఆకును గుహ్యప్రదేశమున కడ్డువైచికొనుట తప్ప దిగంబరాకారముగల్గి వివస్త్రయై పుంగీవాద్యవినోదము సల్పుచున్నట్లు గలదనిరి. రెండుపెద్దసర్పములును, బర్హాబహుళము గలిగినమయూరములును శ్రద్ధగా సామగానమును వినుచు నానంద పారవశ్యము నొందుచున్నవనియు గలదు. స్వరము:—ధనిసమధ. అథవా మధనిసరిగమ.

(సం. దర్పణం.)

# అ ను తా ప ము

మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు

శ్రీకల్యాణగుణాకరుండ వయి నిర్నిద్రప్రభావుండవై
లోకానందముఁ గూర్చువాఁడవయి మేలుం గీడుఁ గల్పించి నా
వాకుల్ సేరనిచోట నిల్తువుగదా వర్ణింపఁగా శక్యమే
నీకారుణ్యపుఁద్రోవ యిట్టిదని తండ్రీ! దీనచింతామణీ!

మ. బహుళార్తిం బడియున్నయప్పు డది సైరంపన్ లేక నిన్నున్న న
న్వహమున్ నింద యొనర్చుచుందు నది చింతాకంత చల్లారినన్
విహరింతుం దమి మోహవారినిధి నువ్విళ్లూరుచిత్తంబుతో
నిహిహీ! చిత్రము నాచరిత్ర మిది తండ్రీ! దీనచింతామణీ!

శా. నే నీచుండ నటంచు నొక్కపరి నన్నిందించుకొందున్ భయా
ధీనస్వాంతుడనై మహామరణవార్ధింగూలిన ట్లింత యో
గ్లానిం జెందుదుఁ దత్పరక్షణమునన్ హమ్మాచక్రముం ద్రిప్పఁగా
నేనే చాలెదనంచు నిక్కెదను తండ్రీ! దీనచింతామణీ!

శా. ఆనందాకృతిఁ దాల్చి లోకములలో వ్యాపించియున్నావు నీ
యానం దాల్చి పిపీలికాదికము బ్రహ్మాంతంబు నౌ సృష్టి య
గ్లానిం బుట్టుచు గిట్టుచున్నయది యేలా నాకుగర్వంబు? హా!
నేనెవ్వండను గార్యముల్ సలుపఁ దండ్రీ! దీనచింతామణీ!

శా. కల్పంబుల్ గతియించె సృష్టిగతు లక్షయ్యంబుగా మారెఁ బెక్
వేల్పుల్ పుట్టిరి గిట్టి రిట్లయిన నీవెం పొక్కఁడై నిల్చె హా!
యల్పజ్ఞుండ నెఱుంగలేను నిను నా కారాటమేలా మదిన్
నిల్పం జేయుము నిన్నుఁ జాలునది తండ్రీ! దీనచింతామణీ!

శా. ఆకల్లాడదు నీవనుజ్ఞ యిడకే యాపత్తో సంపత్తో యే
దో కల్పింతువు నీదుసృష్టి కది యెట్లో యంచు నూహించుటల్
నీకే చెల్లును జెల్ల దింకొకనికిన్ నేనెవ్వఁడన్ మూఢుఁడన్
నీకుం జెప్పఁగ నేర్తునే జడుఁడఁ దండ్రీ! దీనచింతామణీ!

శా. ఆపత్తే దియొ యేదిసంపదయొ యావంతైన రూపింపఁగా
నోపన్ సంపదకల్గినప్పు డది యెంతో యాపదేయంచుఁ బె
ల్లాపత్తైనపు డద్ది సంపదయటం చట్లిట్లు భావించి నా
యేపుం గోల్పడుచుందు వ్యర్థముగఁ దండ్రీ! దీనచింతామణీ!

శా. వానిం జంపెద వానిఁ గొల్చెదను నే వానిం బడం ద్రోతు న
వ్వానిం జీల్చెద నంచు డంబముల నల్పంబౌ గతిం బల్కుదున్
హా! నీచుండను నే నొనర్పఁగల నే యందొక్కఁడై నం గటా!
యీ నాగర్వమడంప వేమిటికిఁ దండ్రీ! దీనచింతామణీ!

శా. గర్వం బేకద మూలమంత్రమయినన్ గష్టాలపాల్ నేసె దృక్
పర్వంబై తగు నీదుసృష్టి నెదుటన్ గన్పట్టు నీనేర్పు దు
స్సర్వజ్ఞత్వముచే నెఱుంగక మహా శాస్త్రార్థముల్ చేసితిన్
నిర్వాణంబును జేర్తు వెట్లు ననుఁ దండ్రీ! దీనచింతామణీ!

మ. మునుఁ జూడన్ వెనుఁజూడ లేను వెనుఁజూపుల్ నిల్ప మున్ జూడలే
ను నిమేషార్థమునం దలంచెదను మిన్నున్ మన్నుఁ గల్పంగ న
ల్పుని నన్నుం గనవెట్టిహాస్యపుఁ దలంపుల్ గల్గునో జాలినోం
దినచిత్తంబునఁ జూడకుందువో తండ్రీ! దీనచింతామణీ!




జనమంచి శేషాద్రి శర్మ గారు

కావ్యములు శ్రవ్యదృశ్య భేదములచే రెండువిధములు. అందు శ్రవ్యకావ్యములు భారత భాగవత రామాయణాదులు. వీనియందుఁ బ్రధానముగ వర్ణింపఁబడునది కథాభాగము. దృశ్యకావ్యములు నాటకములనం బ్రఖ్యాతి నొందినవి. ఇవి మూలకథను బ్రధానము చేసికొని యిచ్చవచ్చినట్లు మార్పునొంది సదాచారము మొదలగువానిని బోధించుచుండవలయును. నాటకకర్తకుఁ గథనుమార్చు నధికారము కలదుగాని యామార్పులచే మూల కథాసారమునకు మార్పు గలుగఁగూడదు.

నాటకమునందు భావపోషణము ప్రధానము. పాండిత్యమును జూపి కవితచెప్పుటమాత్రము గాక సుబోధకముగునట్లు భావమును బోషించి తదుపయుక్తముగఁ బాత్రప్రవేశాదుల సమకూర్పవలయు. ఇదియే ప్రధానము. రసమును బోషింపక నాటకము వ్రాసినచో నది సజ్జనాదృతిం గాంచదు.

నాటకమును జదువుటచే నాకాలపు లోకాచారములు స్పష్టముగఁ దెలియును. అదియే నాటకమునుజూచువారు నేర్చుకొనఁదగినది. కాని యందలి పాటలు లోనగువానిని విని యానందించుట మాత్రముగాదు. అందేకాలపు నాయకుఁడు పేర్కొనంబడునో ఆమహాపురుషుని యౌదార్యాదులు, ఆకుటుంబములోని యాచారములు, ఆకాలపుజనుల వాక్ప్రవృత్తి, అభిప్రాయవిశేషములు లోనగునవి కరతలామలకము లగుచుండవలయును. అట్లుకాదేని యానాటకము లోకమున కుపకరింపదు.

పాత్రప్రవేశాదులు యథేష్టముగనుండక లక్షణములకు లోఁబడి యుండవలయును. పాత్రప్రవేశమువలననే కథాసారము దేటపడవలయు. భోజనాదులు ప్రదర్శింపఁదగవుగాన వాని నవాంతరపాత్రసంభాషణమువలనఁ దేటపడఁజేసి ముఖ్యకథాభాగమును బ్రదర్శింపఁజేయవలయు. దాన ద్రష్టలకు నాటకవస్తువు బోధపడును. ఎట్టిపామరులైనను అట్టినాటకమును జూచినపుడు దాని సారమును గ్రహించి నీతిని నేర్చుకొందురు.

సావిత్రీచరిత్రమును నాటకముగా వ్రాయునపుడు సావిత్రికిభర్తపైఁగల ప్రేమను బెంచివ్రాయుట మాని ఆమెపతిభక్తి, అత్తమామలయందుంచిన ప్రీతి, ఆమె వనమధ్యభాగమున యముని దర్శించినపు డామె మనోధైర్యాదులు, విశేషించి చమత్కారముగ వ్రాయఁదగునే కాని మామగారి గ్రుడ్డితనము మొదలగు వానిని వర్ణించుటలో పెంచి వ్రాయఁగూడదు. సావిత్రి పితృగృహమున ననుభవించిన సుఖములనుగాని, అడవులలో నామె పడిన యిడుములనుగాని వ్రాయఁబూనఁగూడదు. సావిత్రీ నాటకమునుజూచువారు నేర్చుకొనఁదగిన నీతులు, పతిభక్తి, ధైర్యము ఔచిత్యజ్ఞత లోనగునవి కదా! కాఁబట్టి యానీతులు స్పష్టమగునట్లు నాటకవస్తువును నిర్వహింపవలయు. ప్రాచీనరాజచరిత్రములందు లోపములే యుండవని యెవ్వరు చెప్పఁజాలరుగాని నాటకము వ్రాయునపుడు, కవి యారాజకుటుంబాచారములనుబట్టి ద్రష్టలు చక్కని యలవాటులు నేర్చుకొనునట్లు వ్రాయవలయునే కాని యాచరిత్రమునందున్న లోపములను జూపి యిట్టి దురాచారములు పూర్వచరిత్రములందుఁ గలవుకదాయని తోఁపఁజేయరాదు.

నాటకమున వలయునన్ని మార్పులు చేసికొను నధికారము కవికింగలదుగాన జాగరూకుఁడై కథావస్తునిర్వచనమునఁ దనశక్తి నుపయోగింపవలయునే కాని యున్నదున్నట్లు వ్రాయరాదు. సారంగధరచరిత్రమును

నాటకముగా వ్రాయఁదలఁచుచో నందుఁ జిత్రాంగిరాజపత్ని యనువిషయమును మఱునొక, గొప్ప రాజకుటుంబమునందుఁ బుత్రుని మోహించునట్టి దుశ్చరిత్రయుండెనని లోకులకుఁ దెలియఁజేయుచున్నట్లు చెప్పవలయు గదా యను బుద్ధిని నశింపఁజేయక యేదోయొక కారణమును గల్పించి యా చిత్రాంగి స్వబుద్ధిచే నట్టి యనుచిత కృత్యమును జేయఁబూనలేదనువిషయము ద్రష్టలకుఁ దోఁచునట్లు వ్రాయుట యావశ్యకమును నింగిలేమి గలిగి తన దుష్కృతిని జూపవలయునేకాని యంతఃపురమున నిట్టివారు గలరని లోకులకుఁ దోఁపఁజేయునట్లు వ్రాయరాదు. ఇట్టివిషయములయందుఁ గవి తనశక్తిని వినియోగింపకున్న నదియొక నాటకముకాదు. భాషకది గౌరవము నొసఁగదు. నాటకములే భాషకు గౌరవము నీయఁజాలియుండును. ఈకాలమున నెవరాక్షేపించుచున్నను భవిష్యత్కాలమునవారైన బుద్ధిమంతులు నాటకమును జదివి నపుడు చప్పరింపరాదు. కాఁబట్టియే "కాలోహ్యయం నిరవధి ర్విపులాచ పృథ్వీ" అని మహాకవులు వచించిరి. ఒకప్పుడు కవియందున్న యసూయచేత నాటకమును బ్రదర్శింపకున్నను నెవరైన బుద్ధిమంతులు చూచి మెచ్చుకొన్నఁ జాలునని కవి సద్భావముతో నాటకమును వ్రాసి భాషాగౌరవమును బోషింప వలయును. నాలుగుచోట్ల నాటకమాడి చప్పట్లు కొట్టినంతమాత్రమున నది నాటకముగాదు; ఆమెప్పు మెప్పుకాదు. అట్లేయైనచో జెందునాటకము ప్రథమతాంబూలార్హమగును.

ఇపుడిపుడు సూత్రధారుఁడుకూడ లేకుండునట్లు నాటకములు వ్రాయుచున్నారు. పదిమంది దానిని మెచ్చుకొనుచున్నారు. కాలము మాఱినకొలఁది నాటకలక్షణములు మాఱవలయుననువాద మొకటి బయలుదేఱినది. కాలముమాఱినంతమాత్రమున సదాచారముల మార్పఁబూనరాదు. నాటకోద్దేశము పూర్వచరిత్రములు ప్రదర్శింపఁగా వానిం జూచి చక్కనినీతిని నేర్చుకొనవలయుననియే కాని రంగుపూసికొన్నవారిని జూచి యానందింపవలయునని కాదు.

భాషను లనేకవిధములుగా మాఱుచుండునుగాని దాని ప్రథమోద్దేశము మాఱదు. రాజు మంత్రితో "భోజనము చేయఁబోవుదము రమ్ము" అని పల్కినచో నారాజగౌరవ మెట్లుండునో మఱియు చెప్పనక్కఱయే లేదు. మార్పులనఁగా నిట్టివికావు. ఇవిమర్యాదను నశింపఁజేయునవి. రాజు ఆస్థానమండపము నలంకరింపఁబోవుచుండ నందఱును దాని ప్రశంసయే లేకుండఁజేసినచో నది రాజగౌరవము నశింపఁజేసినట్లే కాని వేఱుగాదు. ఏకాలమునఁగాని మర్యాదలు శాశ్వతములు. కాలానుసారముగ మార్పులనఁగా రాజు భృత్యునికృత్యములఁ జేయునట్లు, భృత్యుఁడు రాజకృత్యములు చేయునట్లు కాదు. ఇట్టి నాటకము లాభాషాగౌరవమును దుడమట్టి నశింపఁజేయునేకాని భాషాగౌరవమును గాపాడనేరవు. కాపాడనిచో నట్టినాటకము లుండియు లాభము లేదు.

నాటకమున భాషపాత్రోచితమై యుండవలయు ననువాదను ఇపుడు త్రోసివేయఁబడుచున్నది. ఐనను నీచపాత్రములకు సంస్కృత బహుళముగాక దేశభాషాపదములలో దేశ్యపదముల నుపయోగించి వ్రాయుట సముచితమని తోఁచెడి. కాని యిదియే శాస్త్రీయమార్గముకాదు. పాత్రోచితముగ భాష నుపయోగించుటయే యుత్కృష్టమార్గము. పూర్వమార్గములఁ బాటింపరాదనువా రింతమాత్రమైన నంగీకరింపకుందురాయని వ్రాయవలసివచ్చినది. కాళిదాసాదులు పాత్రోచిత భాషనే కాపాడిరి. ఈ కాలపు మహాకవులుగూడ నాటకములగౌరవమును గాపాడి యాంధ్రభాష దేశభాషలలో గౌరవార్హమైనదన్న ఖ్యాతిని బోషింతురుగాక యని వారిని బ్రార్థించుచున్నాఁడను.



వసంతరాగిణి



శ్లో. శిఖండిబర్హోచ్చయ బద్ధచూడా, కర్ణావతంసీకృతశోభనామ్రా;
ఇందీవరశ్యామ తను స్సుచిత్రా, వసంతికాస్యా దళి మంజుళశ్రీః.

అసావేరి రాగిణి



శ్లో. శ్రీఖండశైలశిఖరే శిఖిసుందవస్త్రా, మాతంగ మౌక్తిక మనోహరహారవల్లీ;
ఆకృష్య చందనతరో రురగం వహన్తీ, అసావరీ వలయ ముజ్జ్వలనీల కాన్తిః.

# ప్రాచీనాంధ్రు లెవ్వరు? ఆర్యులు కారా?

చిలుకూరి వీరభద్రరావుగారు

(వెనుకటిసంపుటము-౧౧ వ సంచిక తరువాయి)

అంధఋషి (దీర్ఘతమస్సు) నిజముగా గ్రుడ్డివాఁడు కాఁడు. జాత్యంధుఁ డనఁగాఁ బుట్టుగ్రుడ్డివాఁడని యిటీవలి వ్యాఖ్యాత లర్థములు వ్రాసియున్నారు. జాత్యంధుఁ డనగా సంఘజాతివాఁడని యర్థముచేసికొనవలయును. అట్లర్థముచేసికొనని యెడల నా గ్రంథకర్తల వ్రాఁత లస్వాభావికములు నప్రామాణ్యములై హాస్యాస్పదంబు లగుటయేకాక మానవుని నైసర్గికగుణవిశేషంబుల నెఱుంగఁజాలనంతటి పశుప్రాయులని గ్రంథకర్తలనుగూర్చి తలంప వలసివచ్చును. కాని యట్టిమహాగ్రంథములను రచించి ప్రఖ్యాతిఁగన్నవారు వ్రాసినకథల భావమును మనము సరిగా గ్రహించలేక పోవునట్టి దోషము మనదికాని వారిది కాదు. అనేకపురాణములు వీనిచరిత్రమును వాకొని యున్నవి. చిత్రవిచిత్రములై జ్ఞానద్యోతకము లగుచున్నవి. ఈతఁడు పుట్టుగ్రుడ్డివాఁడైనను అంధత్వము చిరకాలము నిలువంబడియుండ లేదు. తరువాత దృష్టికలిగినదనియు "దీర్ఘతమస్సు" అనునామమునకు బదులు గోతముఁడు లేక గౌతముఁడను నామమును వహించెనని బృహద్దేవతాది పురాణములు వక్కాణించుచున్నవి. మఱియు వీనిసంతానము బాలేయ క్షత్రియులు, బాలేయ బ్రాహ్మణులు నైరఁట. మఱికొన్నిట నీతఁడు ఔశీనరియను శూద్రస్త్రీని వివాహము చేసికొని బిడ్డలను గాంచి తనబిడ్డలతోఁగూడ మగధరాజధానియైన గిరివ్రజపురమునకుఁ బోయి యచ్చట తపస్సు మూలమునను, కర్మసంస్కారముల మూలమునను బ్రాహ్మణులైరని చెప్పఁబడియుండెను. వీనికుమారుఁడైన కాక్షీవంతుఁ డనేకులను కొమాళ్లను గనెను. వారెల్లరు కూష్మాండ గౌతము లనంబడుచుండిరఁట. వాయుపురాణము ప్రతులలోఁ గొన్నిటమాత్రము వారు కృష్ణాంగగౌతములని వక్కాణింపఁబడియుండిరి. అన్నిటికంటె నితఁడు గావించిన మహత్కార్యము నొక్కటి వివరింపవలసి యున్నది. ఆసేతు హిమాచల మధ్యస్థమైన యీభూభాగమునకు నెవ్వని నామముచేత భరతవర్షమని పేరుగలిగెనో యట్టి మహాచక్రవర్తియైన భరతునకు (దౌష్యంతి) మంత్రియై మహాపట్టాభిషేకము గావించినవాఁడే దీర్ఘతమస్సని యైతరేయ బ్రాహ్మణమున వక్కాణింపఁబడినది. (ఐ. బ్రా. ౮, అ. ౪. ౨౩). ఇక్కడ

నీతఁడు కన్యాపుత్రుఁడని వక్కాణింపఁబడి యుండెను. వీనియొక్కయు, వీనిసంతతిలోని వారియొక్కయుఁ, బేర్లతోఁ, బెక్కుమంత్రములు ఋగ్వేదమున సంపుటీకరణములు గావింపఁబడినవి. అనగాఁ బెక్కండ్రుమంత్రద్రష్టలుగ నున్నారు. అంగీరసుఁడును, గోతముఁడను నామాంతరమునుగల యీ దీర్ఘతమస్సు దీర్ఘకాలము బ్రదికి యుండెనని ఋగ్వేదమున వ్రాయఁబడినది. (ఋ.వే.మం. ౧.౧౫౮.౬). అంధఋషి యెట్టిజన్మ గాంచినను శైశవావస్థ నెట్టిపరిస్థితులలోఁ బెఱిఁగినను, బాల్యమున నెట్లు ప్రవర్తించినను, యౌవనమున నెట్టిమదోన్మత్తుఁడై తిరిగినను, వయస్సు గడచినకొలఁది బుద్ధిమంతుఁ డగుచు, తపోమహిమ గలిగి, వివిధసంస్కారములచే పూతుఁడై, మాంధాత మొదలగు రాజన్యవరులకుధర్మోపదేశకుఁడై దౌష్యంతియగు భరతునకుఁ బట్టాభిషేకముగావించి, వానిచే నశ్వమేధయాగమును జేయించి, వాని మంత్రియై వానికి జగత్ప్రఖ్యాతి గలిగించి మంత్రద్రష్టయై తుదకు దనపరిణామ చరిత్రమునందే యంధజాతివారి పరిణామచరిత్ర యిమిడియున్నదను జ్ఞానమును మనకుఁ బ్రసాదించుటకుఁ గారణభూతుఁడై, నేఁటికిని చిరంజీవియై మనమనస్సుల నాకర్షించుచున్నాఁడు. అతఁ డెంతటిసుకృతాత్ముఁడోకదా! ఇమ్మహనీయుని చరిత్రమును గూర్చి యెంతచెప్పినను తనివితీఱదు. గొప్ప రాజనీతివేత్తగ నున్నవాఁడు. గ్రంథవిస్తరభీతిచేత విరమించుచున్నాను. ఈ చరిత్రకథనమువలన మనము దెలిసికొనఁదగినది యీ దేశమునకు భారతవర్ష మను పేరు ప్రాక్పూర్వమె యాంధ్రు లీదేశమునఁ బ్రాతకాపులై యున్నట్లు స్పష్టమగుచున్నది. "అంధ-అంధ్ర" అనుమాటలు చెవికొకటిమాత్రముగ నుండునట్లు కనుపించుట తక్క మఱే యే సంబంధ మీ రెంటికిలేదు" అని శ్రీ వేంకటరంగయ్యగారు వ్రాసియున్నారు. కాని యీ చరిత్రాధ్యాపకునకు అంధ్ర- నిషాదశబ్దములకు దగ్గఱ సంబంధము గన్పట్టి అంధ- అంధ్ర శబ్దములకుఁ గనుపట్టకపోవుట యొక యద్భుతవిషయమే. కాని, ఆంధ్రశబ్దమునకు నిషాదశబ్దము పర్యాయపదముగాఁ జెప్పఁబడియుండలేదు. బహుప్రాచీనకాలమునుండియు అంధ్ర నిషాదశబ్దములు రెండును వాఙ్మయమునందు గానంబడుచుండినను పర్యాయపదములుగాకుండుటకుఁ గారణమేమి? అదియునుగాక యాంధ్రశబ్దము జనరంజకమై శిష్టులవలనఁ గూడ వ్యవహరించుకొనఁబడుచున్నది. మన మాలలు మొదలగువారు తామాదిమాంధ్రులమని చాటుచున్నారుగాని తామాదినిషాదులమని చెప్పుకొను చుండలేదు. మఱియు నాంధ్రు లిట్టివారని నిరూపించి చెప్పుటకు వారిస్వరూప స్వభావాదులను వర్ణించు ఘట్టములు ప్రాచీనవాఙ్మయమునందుఁ గానరావు నిషాదులను వర్ణించిన ఘట్టములు గలవు. ఆవర్ణనములు పొందికలేనివియును, నేకాభిప్రాయములు లేనివియు నైయున్నవి. వానిని వినిపింపు వినుఁడు. శ్రీ వేంకట రంగయ్యగారు శ్వేతవర్ణులయిన యెరోపియనులే యార్యలనియు, ఆంధ్రులు నిషాదులనియు నాదిమ

నివాసులనియు వచించిరికదా! ఆంధ్రు లాదిమ నివాసు లనిరి;* అంతియ చాలు. దీని నేల యొప్పుకొనరాదని మాచదువరులు ప్రశ్నింప వచ్చును. ఇది యెంత హాస్యాస్పదమయిన సిద్ధాంతమో యీ క్రిందివిషయములను బరికింపుడు. "ఐరోపియనులు తెల్లనివారు; భారతీయులు కృష్ణవర్ణులు;" అని వ్రాసిరి. శరీరముల వర్ణములనుబట్టియే వర్ణాశ్రమ ధర్మము లేర్పడినవనుపక్ష మొకటియు, గుణకర్మములనుబట్టి యేర్పడినవనుపక్ష మొకటియు మన దేశమునం దేర్పడిన రెండుపక్షములవారును చిరకాలమునుండి పోరాడుచు తమతమ వాదోపవాదములతో వాఙ్మయమంతయు నిదివఱకే నింపియున్నారు.

౧. శంకరాచార్య స్వాములవారివంటి మహానుభావులుగూడ 'సర్వసిద్ధాంతసంగ్రహ' మను గ్రంథములో నొకచోట వ్యాసమత మిదియని నిరూపించుచు "విప్రశ్శ్వేతో నృపో రక్తః పీతో వైశ్యోఽన్త్యజోఽసితః" అనఁగా బ్రాహ్మణునివర్ణము తెలుపు. క్షత్రియునివర్ణ మెఱుపు, వైశ్యునివర్ణము పసుపు, అంత్యజునివర్ణము నలుపు" అని వ్రాసియున్నారు. శ్రీ వేంకటరంగయ్యగారి సిద్ధాంత మంగీకరింతుమేని బ్రాహ్మణులను నైరోపియనులుగ, భారతీయులయిన శూద్రులనెడు నిషాదులను నిర్జించి యీదేశమున నైరోపియనుల నాగరికత నెలకొల్పినారనుట ధ్రువపడఁగలదు. తమ గొప్పతనము చాటుచున్నారని యొకవేళ బ్రాహ్మణులు సంతోషించిన సంతోషింపవచ్చునుగాని యియ్యది బ్రాహ్మణ బ్రాహ్మణేతరులకు మును ముందు మృత్యుపాశమగునని యెఱుంగవలయును.

౨. యాజ్ఞవల్క్యమహర్షి తనస్మృతిలో:—

"విప్రాన్మూర్ధావసిక్తోహి క్షత్రియాయాం విశస్త్రియామ్; అంబష్ఠశ్శూద్ర్యాం నిషాదో జాతః పారశవోఽపివా."

అని విప్రునికి శూద్రస్త్రీయందుఁ బుట్టినవాఁడు నిషాదుఁడని చెప్పియున్నవాఁడు. దీనిని బట్టి యాదిమనివాసులు బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రు లగుచున్నారు గాని వేంకటరంగయ్యగారు చెప్పినట్లు నిషాదు లగుచుండ లేదు. అటువంటి స్వచ్ఛదేహులకు సర్వాంగసుందరు లగువారికి నల్లనివారు, ఎఱ్ఱని కన్నులవారు, కురుచ చేతులవారు, గూనియొడలువారు, ఎత్తు బుగ్గలవారు, చితుకముక్కులవారు నే ప్రకృతిశాస్త్రము ననుసరించి పుట్టెదరో?

3. హారీతుఁడు తనస్మృతిలో:—

"క్షత్రియాయాం వైశ్యశూద్రో వందీపాదో వైశ్యాయాం శూద్రః పుల్కసాన్"

అని క్షత్రియస్త్రీకిని శూద్రునకుఁ బుట్టినవారు నిషాదులని పై యాజ్ఞవల్క్యునికి భిన్నముగాఁ జెప్పినాఁడు.

ఇట్లే వ్యాసవచనమున:—

శూద్రాన్నిషాదో మత్స్యఘ్నః
క్షత్రియాయాం వ్యతిక్రమాత్.

అని నిషాదుఁడనఁగాఁ జేపలహింసించు జాలరివాఁడని చెప్పినాఁడు ఇట్లే. క్షత్రియస్త్రీకి శూద్రునకుఁ బుట్టినవారు నిషాదులని మఱి

* శారద. సంపుటము ౨. సంచిక ౬ చూడుఁడు.

కొందఱు వ్రాసియున్నారు. ఈ వ్యాసవచనమునకు భిన్నముగా ఆదిపురాణమున:.

> మార్గవాసి క్రోధప్రాయః క్షత్రియాయాం ప్రసూయతే; సకరోతి మనుష్యాణాం చికిత్సాం రోగిణామపి. బ్రాహ్మణా చ్ఛూద్రకన్యాయాం భవేత్పారశవస్తుసః. నిషాదో మత్స్యఘాతిత్వం చరేద్రాజాజ్ఞయా సదా.

అని బ్రాహ్మణునకు శూద్రస్త్రీయందుఁ బుట్టినవాఁడు నిషాదుఁడనియు నతఁడే మత్స్యఘాతుకుఁడగు జాలరివాఁడనియు వక్కాణింపఁ బడియుండెను.

మొదటి యాక్షేపణములు వీనియున్నింటికిని బట్టును. వీనికి భిన్నముగా జాతివివేక మను గ్రంథమునందు:—

> క్షత్రియా చ్ఛూద్రసంయోగాత్ క్షత్తారం జనయేత్సుతమ్
> నిషాద ఇతి విఖ్యాత స్సర్వవర్ణ బహిష్కృతః
> వాగురాపాశపాణిస్తు మృగబంధనకోవిదః
> అరణ్యపశుఘాతీ వా మాంసికశ్చవనేచరః
> క్రోధాన్వితో మాంసవృత్త్యా తయా జీవే త్సదైవహి
> ఘంటాంవాపరికాం కుర్యా ద్రాత్రౌ విస్మయకారిణీమ్
> వ్యాధానమృగయూ ప్రోక్తా వ్యోషధూచారిణా మిహ
> విక్రయం మధునః కుర్యా ద్ధనమిచ్ఛన్ సమృద్ధయే.

అని యున్నది. అనఁగా క్షత్రియజాతి స్త్రీయందు శూద్రునికిఁ బుట్టినవాఁడు నిషాదుఁ డనఁబడును. సర్వవర్ణములకు వెలియైనవాఁడు వలలు నురులుపట్టి మృగముల వేటాడుచు నరణ్యమృగముల కంతకుఁడై యడవినుండుచు క్రోధస్వభావముతో రాత్రియందాశ్చర్యమగు నట్లు ఘంటవాయించుచు పక్షులను మృగములను బట్టుచు జీవించును. మఱియు ద్రవ్యలాభమునకు పట్టులుగొట్టి తేనెనమ్మును. ఇందు వృత్తిభేదము మాత్రమె వక్కాణింపఁబడియెను గాని తక్కినవిషయములఁ బైవానిం బోలియే యున్నది.

౭. పై ధర్మశాస్త్రపురాణవచనములకు భిన్నముగా సాయనాచార్యులవారు ఐతరేయ బ్రాహ్మణములలో పంచమానవులను వారెవ రనుదాని వివరించుచు బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులను నైదవవారు నిషాదులనుఁ జెప్పి నిషాదులను చాతుర్వర్ణ్యేతరులనుగఁ జెప్పియున్నారు. (ఐ.బ్రా.సం.౨. అ.౭.౨౩) కొన్ని ఋగ్వేదమంత్రములలో పంచజనులు లేక పంచకృష్టులు పంచచర్షణులని పేర్కొనఁబడిన యదు,ద్రుహ్యు,తుర్వసు, అను,పూరులకు బదులుగా సాయనాచార్యులవారు పంచమానవులనఁగా నిషాదులని చెప్పుట కేవలము విరుద్ధముగా నున్నది. అమరకోశములో మనుష్యులకు పంచజను లను నామము చెప్పఁబడినది. వీరివాక్యమైనను బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులకు బాహ్యము నిషాదు లున్నవారని తెలుపదు.

౮. శ్రీమద్రామాయణము నాంధ్రీకరించి యాంధ్రవాల్మీకి యని బిరుదువహించిన శ్రీ వావిలకొలను సుబ్బారావుపంతులువారి నడుమ నెల్లూరునఁ బ్రకటింపఁబడు పినాకిని పత్రికయందు నిమ్నజాతులవారిని గూర్చి వ్రాయుచు:

> “చండాలప్లవమాతంగ దివాకీర్తిజనంగమాః
> నిషాదశ్శ్వపచాంతే వాసి చాండాలపుల్కసాః.”

అనువాని నుదహరించి చండాలనిషాదు లార్యులేకాని బహిష్కృతార్యులనియు అర్యులు పైనుండిరాలేదనియు నిక్కడివారే

యనియు నుడివియున్నారు. వీరివాక్యములు శ్రీ వేంకటరంగయ్యగారివాదమును ఖండించుచున్నవి. వీరు నిజముగా బహిష్కృతు లైనవారు కారనియు లింగాభట్లుగారు వీరి కారోపించిన దోషములు సరియైనవి కావనియు, ఈ తెగలవారు పురాతనాచారములకే బద్ధులై నూతనపరిస్థితుల కనువుపడలేకపోయినందున పురాతనాచారములు భ్రష్టములుకాగా తోడి సంఘములలోనుండినిలిచిపోయి యీరీతిదుస్థితికి వచ్చినవారని నా యభిప్రాయము. వీరిని గూర్చి బ్రహ్మశ్రీ కావ్యకంఠము గణపతి శాస్త్రులవారు వ్రాసిన యభిప్రాయములు చాలవఱకు నాకు సమ్మతములుగా నున్నవి. వీరెల్ల రార్యులనియు నాంధ్రులలోనివారే యనియు నా యభిప్రాయముగూడ నై యున్నదిగాని వీరిలో నొక్కనిషాదులను మాత్రమే యాంధ్రులని పక్కాణించుటకుమాత్రము నేనొల్లను. ఈకారణముచేతనే నిషాదశబ్దము నాంధ్ర శబ్దమునకు బర్యాయపదముగా గ్రహించుట కిష్టపడలేదు. అంతియకాని ద్వేషముచేతకాదు. ఇంతియకాక దీని కంతకు ముఖ్యకారణము వేఱొకటి యున్నది.

౭. మహాభారతములో నీ క్రిందికథ చెప్పఁబడినది. పూర్వము వేనుఁడను రాజు దుష్పరిపాలనముఁ జేయుచుఁ బ్రజలను బాధించుచుండ బ్రహ్మవాదినులగు ఋషులు మంత్రములచే వానిసంహరించి వానితొడమథించగను మథించ నందుండి నల్లని హ్రస్వాంగుఁడైన యొక పురుషుఁ డుదయించె నాతనిజూచి ఋషులు 'నిషీద- కూర్చుండుము' అనిరట.

శ్లో. తస్మాత్ నిషాదాస్సంభూతాః క్రూరాశ్శైలవనాశ్రయాః
యేచాన్యే వింధ్యనిలయా మ్లేచ్ఛాశ్శతసహస్రశః.

అనఁగా నతనినుండి క్రూరులును శైలవనాటులలో సంచరించు నిషాదులు మాత్రమేకాక వింధ్యపర్వతములలో నివసించు శతసహస్రముల మ్లేచ్ఛులు సహితము నుద్భవించిరి. శ్రీ వేంకటరంగయ్యగారు శారదాపత్రికయందుఁ బ్రకటించిన నిషాదవర్ణనముగల యీ క్రింది

"కాకకృష్ణోఽతిహ్రస్వాంగో హ్రస్వబాహు ర్మహాహనుః, హ్రస్వపా న్నిమ్ననాసాగ్రో రక్తాక్ష స్తామ్రమూర్ధజః"

అనుశ్లోక మీ కథాసందర్భమున భాగవతమునందు వ్రాయఁబడియుండెనని జ్ఞప్తికలదు. ఈ పృథు చక్రవర్తికథ పురాణేతిహాసములలో నవీనముగాఁ జేర్పఁబడినది. వేనుఁడనురాజు తొడ మథింపగా నిషాదులు పుట్టినారనుట పట్టికల్ల. ఈ వేనుఁడనువాఁడు 'వోనోనీస్' (Vononese) అను పహ్లవ (పార్థియన్) రాజు. ఇతఁడు ఇరాన్‌లోని తూర్పుభాగము పార్థియాను బరిపాలించు కడపటి పార్థియనురాజు. హిందూదేశముపై దండెత్తివచ్చెను. ఈతని సంతతివారయిన పార్థియను రాజులు పంజాబులోఁ బరిపాలించిరి. ఇది నవీనముగా మహాభారతములోను భాగవతములోను జేర్పఁబడినది. ఇదంతయు క్రీస్తుశకము మొదటిశతాబ్దములో జరిగినదిగనుక నంతకుఁ బూర్వమే బహుశతాబ్దములనుండియాంధ్రులు నిషాదులుభారతవర్షమునందుండియే యున్నారు గావున నీకథను మనమెంతమాత్రము విశ్వసింపరాదు. అవస

రమైనయెడల మఱియొకమాఱు దీనిని జర్చింపఁదలఁచి ప్రస్తుతము విరమించుచున్నాను.

ఇన్ని యసందర్భవిషయములతోఁగూడుకొన్న యీనిషాదశబ్దమును గైకొని వీరే ప్రాచీనాంధ్రులని చెప్పుట యెంతరసవత్తరమైనదిగా నుండునో యూహింపుఁడు. ఇప్పుడాంధ్రదేశములో నేతెగవారైననుసరే, ఏకులమువారైననుసరే తాము నిషాదులమని చెప్పకొందురని నేను తలంపఁజాలను. మేము స్వచ్ఛవర్ణులమని గర్వపడుచుండినవారు తమ ప్రతిపక్షులపట్ల ససహ్యతను దెలియఁపఱచునట్టి శబ్దమిది. ఇట్టిద్వేషము చూపుటచేతనే యీ నిషాదులు తమది విష్ణుకులమని చెప్పుకొనుచు వచ్చిరి. ఈ నిషాదులయొక్క దేవుఁడే విష్ణువు. ఇదియుఁగూడ ప్రత్యేకముగాఁ దెలిసికొనవలసినవిషయము గావున ప్రస్తుతము విరమించుచున్నాను. కాబట్టి నిషాదశబ్దమును మఱచిపోవలయును. ఆంధ్రులలోఁ బెక్కుశాఖలు గలవు. మనలో మాలలు మొదలగువారు కూడ నిషాదశబ్దమును తలవను తలంపరాదు. వా రాంధ్రులమని [illegible]ముగాఁ జెప్పికొనవచ్చును.

ఇంక, అంధులను ఆంధ్రులని యేట్లందువని ప్రశ్న. అవును. ఇదియొక దేవరహస్యమే; దేవభాషారహస్యము దేవతలకుఁ దెలియవలయును; లేక భూదేవతలకుఁ దెలియవలెను. ఐంద్రజాలికుని యింద్రజాలవిద్య యైంద్రజాలికునకే బోధపడవలయునుగాని తదితరులకు బోధపడుట దుస్సాధ్యము. ఏపిచ్చిసంగతి వక్కాణించినను విని నమ్మునట్టి కాలము పోయినది. దేవత లెప్పుడును పరోక్షప్రియులఁట. అనఁగాఁ దమ నిజనామములతోఁ బేర్కొనఁబడుట కెప్పుడు నిచ్ఛగింపకుండిరట! తమ విషయములపట్లనే కాక తమ [illegible] పక్షుల విషయమునఁగూడ నట్లే ప్రవర్తి[illegible] ఇందుకుఁ గారణముగూడ స్పష్టముగఁ దె[illegible]లుపఁబడినది. ఐతరేయోపనిషత్తులో ప్ర[illegible]మాధ్యాయము తృతీయఖండము చివర నిట్లు[illegible]న్నది.

> "సవేత మేవపురుషం బ్రహ్మ తత మము[illegible]పశ్ దిద మదర్శతి, అహ్మాదితం ద్రోనా మేదం ద్రోవ[illegible]త్వైనామ త మిసంద్రం సంమిరమింద్ర మిత్యాచక్ష తే[illegible] పరోక్షేణపరోక్ష ప్రియా ఇవహి దేవాః.

ఇంద్రునకుఁ దొలుత యిదం[illegible]ద్రుఁడని పేరుగలదట. దేవతలు పరోక్ష[illegible]ప్రియులు [illegible] గావున 'ఇదంద్ర' శబ్దమును 'ఇం[illegible]చిరఁట ముగ మార్చి ఇంద్రుఁడని వ్యవహరి[illegible] "పరోక్షే దీనికి శంకరాచార్యస్వాములవారు [illegible]మ గ్రహణపూజ్యత్వాత్ ప్రత్యక్షే నా[illegible]మము చెప్పభయాత్" అనఁగా నిజమయిననా[illegible]ను, మాఱుకొన్నందున భయముగలుగుటవ[illegible]యు కలుగుట పేరు చెప్పుకొనుటవలన గౌరవవ[illegible] వల్లను నట్లు చేయుచుండిరనియును దమభాష్యములోఁ దమభావమును వెల్లడించియున్నారు. జరాతుష్ట్రులజెండా అవేస్టాలో ఇంద్రుని వారు అంద్రుఁడనియె వచించియున్నారు. అంద్రుని దయ్యమనిరి. దీనిం బురస్కరించుకొనియే మఱికొందఱు పండితు లిట్లుచెప్పిరి:

> "అనంతం ధారయత్యేవ దేశ శ్శైలాకృతిం దతః,
> అనంతభ్రస్య వీవాంధ్రాః పరోక్షే గేంద్రవత్స్మృతాః.

అనగా శైలస్వభావముతోనుండు అనంతుని సీదేశమునం ధరించియున్నకతమున దీని

కనంత ధ్రదేశమను పేరువచ్చెనట. అదియే అంధ్రమని చెప్పంబడుచున్నదట. ఇంద్రునకుఁ దొలుత ఇదంద్రుఁడని పేరు గలదు. దేవతలు పరోక్షప్రియులు గావున నింద్రుఁడని యతనిం జెప్పిరి. అట్లే అనంత ధ్రశబ్దమునకు అంధ్రమను పేరు కలిగెనట!

మన కోయదొరలవంటి సంఘములవారాకాలమున తమ దేవుని తురారాట్ అని పేరు పెట్టి, సేవించుచుండ నే కారణముచేతనైన నేమి వారికంటె నాగరికులై వారిలోనుండి వేఱుపడిపోయి స్వర్గభూముల నధిగమించి యే కారణముచేతనైన నేమి మరల తిరిగివచ్చి, నపుడు పూజ్యతఁగాంచవలె నన్నచో దేవతలమని చెప్పుకొన్నప్పుడు సంఘములో గౌరవముండునుగాని మీవారమే యని చెప్పుకొన్న వారికి నేమిగౌరవము లభించును? ఐశ్వర్యప్రాభవములను మైపూఁతలునుగలిగి జాత్యహంకారగర్వితులగు వారు తమ సోదరమానవులను, పేదవారిని సమదృష్టితోఁ జూచువారు నాఁడును నేఁడును గూడఁ గానరారు గదా. ఇంద్రునకు తురాషాట్ అను నామాంతరము గూడఁ గలదు. దీనినిబట్టి మనము తెలిసికోఁదగిన దేమన్న దేవభాషా వాఙ్మయమందును, సంస్కృత భాషా వాఙ్మయమందును వ్యవహరింపఁ బడిన నామములు చాలవఱకు గూఢములయినవిగ నున్నవి. కథలుగూడ గూఢార్థములనే తెలుపును. అసలు వస్తుస్వరూపమును మఱుఁగుపెట్టి లేనిది కల్పనచేసి యదియే యిదియని చూపించు పద్ధతికి దిగినది దేవభాషా రహస్యతత్త్వము. ఇదంతయు నాత్మసంరక్షణార్థము చేసికొనవలసివచ్చెను. "ఎలుకుజేఁడు" అనునది పేలవముగను తక్కువజాతులలోఁ దమవారిలోఁ గూడ ప్రభుత్వముచేసిన ప్రభువులున్నారను భావమును పుట్టించి వారిని గర్వితులను గావించి తమసత్త్వము నపహరించు నట్టివారినిగఁ జేయునేమో యన్న భీతిని బుట్టించునదిగ నుండుటచేత దానినే 'ధర్మరాజు' అని ప్రయోగించినచో నెంతో గూఢమును గాంభీర్యము గలదియు నై పై బాధవంటిబాధ లేనిదై నిమ్మకు నీరెత్తినట్లు హాయిగ నుండును గదా! దేవభాష యనునది మొట్టమొదట దేవతలకొఱ కుద్దేశింపఁబడినదిగాని మానవులకొఱకు గాదు. మానవులకొఱకు వచ్చునప్పటి కది సంస్కృతము గావలసి వచ్చినది. ఇంక దీనిమహిమ చెప్పనక్కరయేలేదు. ఎవరికంటుచిక్కనిభాష. ఇట్టి పరిస్థితులందు 'అంధ్రుని' ఇంద్రునిగ మార్చి వ్యవహరింపఁగలిగిన వారు అంధ్రుని అంధునిగ మార్చి వ్యవహరింపలేరా? మనము దోషారోపణము చేయుటకాదు. అప్పటిపరిస్థితు లట్టివి. పూర్వకాలమున బ్రాహ్మణమత మవలంబించిన భార్గవులకును క్షత్రియులుగనుండిన హైహయులకును చిరకాలము పోరాటముజరుగుచుండెను. అయ్యది భయంకరమైన విప్లవముగఁ బరిణమించెను. హైహయులలోనివాఁడగు కార్తవీర్యార్జునచక్రవర్తి యనేక యజ్ఞములను గావించి ధనధాన్యములనన్నింటిని తన గురువులును పురోహితులును వేదవిదులునైన భార్గవులకుధారపోసి స్వర్గస్థుఁడయ్యెను. అందువలన భార్గవులు

ధనవంతులైరి. క్షత్రియులు ధనవిహీనులైరి. అందువలన క్షత్రియులు హీనహావ్యులైరి. హైహయులును తత్సంతతివారయిన తాళజంఘులును భార్గవులును ధనమిమ్మనియడిగిరి. భార్గవులు తమధనమునంతయు భూస్థాపితము గావించి లేదుపొమ్మనిరి.కొందఱుమాత్రము క్షత్రియుల భయముచేత తమధనమును నొసంగిరి. కాని యొకప్పుడు క్షత్రియు లొకభార్గవుని యిల్లు త్రవ్వుచు నందపారమైన ధననిధిని గను పెట్టిరి. భార్గవులు తమ్ము మోసముచేసిరని యాగ్రహ మహోదగ్రులై క్షత్రియులెల్లఁ దేకమై శస్త్రాస్త్రపరంపరలచే నాభార్గవుల నెల్లర సంహరింప మొదలుపెట్టిరి. స్త్రీలగర్భములలో నున్న శిశువులనుసయితము క్రూరకర్ములై సంహరింప మొదలుపెట్టిరి. అప్పుడు పెక్కండ్రు భార్గవస్త్రీలు భీతచిత్తలై హిమనద్రులకుఁ బాఱిపోయిరి. దీనినంతయును గ్రహించి గర్భవతియగు నొకస్త్రీ కులసంరక్షణార్థము తనగర్భములోని పిండమును తనయూరువులో దాచికొనియెనఁట.క్షత్రియు లాతేజస్వినియగు స్త్రీయొక్కగర్భమును ఛేదించుటకై యామెను జుట్టుముట్టినప్పు డామెతొడలోనుండి మధ్యాహ్నభాస్కరుని బురుడించుచు నొకబిడ్డ బయలువెడలి క్షత్రియులకన్నులు మిఱుమిట్లుగొనునట్లు తీవ్రదృష్టిఁబఱపి చూచెనఁట. అంత నా క్షత్రియులెల్లరును జాత్యంధులై పోయిరఁట! ఇట్లు సంపూర్ణముగా దృష్టినంతయుఁ బోఁగొట్టుకొన్న వారయ్యును సంచారమున కర్హములుగాని గిరిదుర్గములలోఁ ద్రిమ్మరులై తిరుగుచుండిరఁట! అంధులయిపోయినందుకు మిగుల దుఃఖించుచు నాక్షత్రియులెల్లరు దమ దృష్టిని మరలఁ బ్రసాదించుటకై శరణార్థులై యామెకడకుఁ బోయిరఁట! చూడుఁడు.

"ముష్ణన్ దృష్టీః క్షత్రియాణాం మధ్యాహ్న ఇవ భాస్కరః, తతశ్చక్షుర్విహీనా స్తే గిరిదుర్గేషు బభ్రముః, తత స్తే మోహ మాపన్నా రాజానో నష్టదృష్టయః, బ్రాహ్మణీం శరణం జగ్ముః దృష్ట్యర్థం తా మనిందితామ్.

(మహాభారతే, ఆదిపర్వాంతర్గత చైత్రరథ పర్వణి, అశీత్యధిక శతతమోఽధ్యాయః).

అట్లు వారు పోయి యామెను శరణువేఁడఁగాఁ బ్రసన్నురాలై యిట్లు పలికెనఁట:

"బిడ్డలారా! నేను మిమ్మంధులను గావింపలేదు. నాకు మీయెడఁ గోపమును లేదు. భృగువంశీయుఁడైన యీబిడ్డకు మీయెడఁ గోపము గలదు. తనవంశమువారిని నాశనము చేసినందుకు నీబిడ్డ కోపించి మీదృష్టి నపహరించిన మాట సత్యము. భృగువంశీయులకుఁ బ్రియమును గలిగించుటకే యాతఁడు గర్భస్థుఁడై యుండునపుడే షడంగములతోఁ గూడ వేదములు వచ్చి యాతని నాశ్రయించినవి. తన తండ్రులను హత్య గావించినందుకుఁ గ్రుద్ధుఁడై మిమ్ముఁజంపనున్నవాఁడు. అతని దివ్యచక్షువుల మూలముననే మీదృష్టి నాశనము గావింపఁబడినది. కనుక బిడ్డలారా! నా యూరువునం బుట్టిన యీ నా దివ్యశిశువును శరణువేఁడి నమస్కరించి ప్రార్థించినయెడల తప్పక మీకు దృష్టిని బ్రసాదించు" నని పలుకగా వారట్లు గావించి యౌర్వునివలన దృష్టిని బడయఁగలిగిరి. ఇందలి సత్యమేమి?

కనంత ప్రదేశమను పేరువచ్చెనంట. అదియే అంధ్రమని చెప్పంబడుచున్నదంట. ఇంద్రునకుం దొలుత ఇదంద్రుండనిపేరు గలదు. దేవతలు పరోక్షప్రియులు గావున నింద్రుండని యతనిం జెప్పిరి: అట్లే అనంత ప్రశబ్దమునకు అంధ్రమను పేరు కలిగెనంట!

మన కోయదొరలవంటి సంఘములవా రాకాలమున తమ దేవుని తురారాట్ అని పేరు పెట్టి, సేవించుచుండ నే కారణముచేతనైన నేమి వారికంటె నాగరికులై వారిలోనుండి వేఱుపడిపోయి స్వర్గభూముల నధిగమించి యే కారణముచేతనైన నేమి మరల తిరిగివచ్చి నపుడు పూజ్యతంగాంచవలె నన్నచో దేవతలమని చెప్పుకొన్నప్పుడు సంఘములో గౌరవముండునుగాని మీవారమే యని చెప్పుకొన్నవారికి నేమిగౌరవము లభించును? ఐశ్వర్య ప్రాభవములను మైపూంతలునుగలిగి జాత్యహంకారగర్వితులగు వారు తమ సోదరమానవులను, పేదవారిని సమదృష్టితోం జూచువారు నాండును నేడును గూడం గానరారు గదా. ఇంద్రునకు తురాషాట్ అను నామాంతరము గూడం గలదు. దీనినిబట్టి మనము తెలిసికోందగిన దేమన్న దేవభాషా వాఙ్మయమందును, సంస్కృత భాషా వాఙ్మయమందును వ్యవహరింపం బడిన నామములు చాలవఱకు గూఢములయినవిగ నున్నవి. కథలుగూడ గూఢార్థములనే తెలుపును. అసలు వస్తుస్వరూపమును మఱుంగుపెట్టి లేనిది కల్పనచేసి యదియే యిదియని చూపించు పద్ధతికిం దిగినది దేవభాషా రహస్యతత్త్వము. ఇదంతయు నాత్మసంరక్షణార్థము చేసికొనవలసివచ్చెను. "ఏఱుకుఱేండు" అనునది పేలవముగను తక్కువజాతులలోం దమవారిలోం గూడ ప్రభుత్వముచేసిన ప్రభువులున్నారను భావమును పుట్టించి వారిని గర్వితులను గావించి తమసత్త్వము నపహరించు నట్టివారి నిగం జేయునేమో యన్న భీతిని బుట్టించున దిగ నుండుటచేత దానినే 'ధర్మరాజు' అని ప్రయోగించినచో నెంతో గూఢమును గాంభీర్యము గలదియు నై పై బాధవంటిబాధ లేనిదై నిమ్మకు నీరెత్తినట్లు హాయిగ నుండును గదా! దేవభాష యనునది మొట్టమొదట దేవతలకొఱకు నుద్దేశింపంబడినదిగాని మానవులకొఱకు గాదు. మానవులకొఱకు వచ్చునప్పటి కది సంస్కృతము గావలసి వచ్చినది. ఇంక దీనిమహిమ చెప్పనక్కరయే లేదు. ఎవరికంతుచిక్కనిభాష. ఇట్టి పరిస్థితులందు 'అంధ్రుని' ఇంద్రునిగ మార్చి వ్యవహరింపంగలిగినవారు అంధ్రుని అంధునిగ మార్చి వ్యవహరింపలేరా? మనము దోషారోపణము చేయుటకాదు. అప్పటిపరిస్థితు లట్టివి. పూర్వకాలమున బ్రాహ్మణమత మవలంబించిన భార్గవులకును క్షత్రియులుగనుండిన హైహయులకును చిరకాలము పోరాటముజరుగుచుండెను. అయ్యది భయంకరమైన విప్లవముగం బరిణమించెను. హైహయులలోనివాండగు కార్తవీర్యార్జునచక్రవర్తి యనేక యజ్ఞములను గావించి ధనధాన్యములనన్నింటిని తన గురువులును పురోహితులును వేదవిదులునైన భార్గవులకుధారపోసి స్వర్గస్థుండయ్యెను. అందువలన భార్గవులు

ధనవంతులైరి. క్షత్త్రియులు ధనవిహీనులైరి. అందువలన క్షత్త్రియులు వీతహవ్యులైరి. హైహయులును తత్సంతతివారయిన తాళజంఘులును భార్గవులును ధనమిమ్మని యడిగిరి. భార్గవులు తమధనమునంతయు భూస్థాపితము గావించి లేదుపొమ్మనిరి. కొందఱుమాత్రము క్షత్త్రియుల భయముచేత తమధనమును నొసంగిరి. కాని యొకప్పుడు క్షత్త్రియు లొకభార్గవుని యిల్లు త్రవ్వుచు నందపారమైన ధననిధిని గనుపెట్టిరి. భార్గవులు తమ్ము మోసముచేసిరని యాగ్రహ మహోదగ్రులై క్షత్త్రియులెల్ల రేకమై శస్త్రాస్త్రపరంపరలచే నాభార్గవుల నెల్లర సంహరింప మొదలుపెట్టిరి. స్త్రీలగర్భములలో నున్న శిశువులనుసయితము క్రూరకర్ములై సంహరింప మొదలుపెట్టిరి. అప్పుడు పెక్కండ్రు భార్గవస్త్రీలు భీతచిత్తలై హిమవద్గిరులకుఁ బారిపోయిరి. దీనినంతయును గ్రహించి గర్భవతియగు నొకస్త్రీ కులసంరక్షణార్థము తనగర్భములోని పిండమును తనయూరువులో దాఁచికొనియెనఁట. క్షత్త్రియు లాతేజస్వినియగు స్త్రీయొక్క గర్భమును ఛేదించుటకై యామెను జుట్టుముట్టినప్పు డామెతొడలోనుండి మధ్యాహ్న భాస్కరుని బురుడించుచు నొకబిడ్డ బయలువెడలి క్షత్త్రియులకన్నులు మిఱుమిట్లు గొనునట్లు తీవ్రదృష్టిఁ బఱపి చూచెనఁట. అంత నా క్షత్త్రియులెల్లరును జాత్యంధులై పోయిరఁట! ఇట్లు సంపూర్ణముగా దృష్టినంతయుఁ బోఁగొట్టుకొన్న వారయ్యును సంచారమున కర్హములుగాని గిరిదుర్గములలోఁ ద్రిమ్మరులై తిరుగుచుండిరఁట! అంధులయిపోయినందుకు మిగుల దుఃఖించుచు నా క్షత్రియులెల్లరు దమ దృష్టిని మరలఁ బ్రసాదించుటకై శరణార్థులై యామెకడకుఁ బోయిరఁట! చూడుఁడు.

"ముష్ణన్ దృష్టీః క్షత్రియాణాం మధ్యాహ్న ఇవ భాస్కరః, తతశ్చక్షు ర్విహీనాస్తే గిరిదుర్గేషు బభ్రముః, తత స్తే మోహ మాపన్నా రాజానో నష్టదృష్టయః, బ్రాహ్మణీం శరణం జగ్ముః దృష్ట్యర్థం తా మనిందితామ్.

(మహాభారతే, ఆదిపర్వాంతర్గత చైత్రరథ పర్వణి, అశీత్యధిక శతతమోఽధ్యాయః).

అట్లు వారు పోయి యామెను శరణు వేఁడఁగాఁ బ్రసన్నురాలై యిట్లు పలికెనఁట:

"బిడ్డలారా! నేను మిమ్మంధులను గావింపలేదు. నాకు మీయెడఁ గోపమును లేదు. భృగువంశీయుఁడైన యీబిడ్డకు మీయెడఁ గోపము గలదు. తనవంశమువారికి నాశనము చేసినందుకు నీబిడ్డ కోపించి మీదృష్టి నపహరించిన మాట సత్యము. భృగువంశీయులకుఁ బ్రియమును గలిగించుటకే యాతఁడు గర్భస్థుఁడై యుండునపుడే షడంగములతోఁ గూడ వేదములు వచ్చి యాతని నాశ్రయించినవి. తన తండ్రులను హత్య గావించినందుకుఁ గ్రుద్ధుఁడై మిమ్ముఁ జంపనున్నవాఁడు. అతని దివ్యచక్షువుల మూలముననే మీదృష్టి నాశనము గావింపఁబడినది. కనుక బిడ్డలారా! నా యూరువునం బుట్టిన యీ నా దివ్యశిశువును శరణువేఁడి నమస్కరించి ప్రార్థించినయెడల తప్పక మీకు దృష్టిని బ్రసాదించు" నని పలుకగా వారట్లు గావించి యౌర్వునివలన దృష్టిని బడయఁగలిగిరి. ఇందలి సత్యమేమి?

వైదికమత మవలంబించిన యాంధ్రులలో నొక శాఖవారయిన భార్గవులకును వైదికమత విరుద్ధప్రవర్తనముగల క్షత్రియులకును విరోధము కలుగగా భార్గవులు తమ ప్రతిపక్షులను అంధులని వ్యవహరించుచుండిరనియు, అంధ క్షత్రియులు బలాఢ్యులై తమ్ము జయించి బాధించుచున్నప్పుడు వారి బాధపడలేక స్పర్ధచే గోబృందములను గాచుకొనుచు వ్యవసాయము చేసికొనుచున్న ప్రజలలో (వైశ్యులు) నుండి కొందఱను వేదవిదులనుగఁ జేసి బ్రహ్మచేత క్షత్రియులను గావించి తమకు విరోధులయిన యంధ క్షత్రియుల కిరు పోటిగా నిలిపి వారిని జయించి తమ మతములోనికి దింపుకొనిరని యర్థము చేసికొనవలయును. ఈకథలోఁ జెప్పఁబడినట్లు హైహయాది క్షత్రియులు నిజముగా దృష్టిని పోఁగొట్టుకొన్న గ్రుడ్డివారేయైనయెడల గిరిదుర్గములలో విచ్చలవిడిగా సంచరించుచుండిరని ప్రకృతిస్వభావమునకు విరుద్ధముగా గ్రంథకర్త యెట్లు వ్రాయఁగలఁడు? కాఁబట్టి యాక్షత్రియులెల్లరు నంధజాతివారే. వీరాంధ్రులే. రామాయణములో వీరిని జాత్యంధులనియే వాల్మీకి చెప్పియున్నాఁడు. అంధు లాంధ్రులగుదురో కారో బౌద్ధవాఙ్మయమును బరిశీలించినవారికి తేటపడకమానదు. అంధశబ్దమునకు ఆంధ్రశబ్దమునకు దగ్గఱసంబంధమున్నదని వ్యాసాంతమునఁ జూపింతును. ధృతరాష్ట్రుఁడంధుఁడని భారతమున వ్రాయఁబడియుండుటచేత నిజముగా మనవా రంధుఁడనియే తలంచుచున్నారు. ప్రపంచమంతయు నావ్యామోహములోనే పడిపోయి సత్యమును గ్రహింపలేకపోయిరి. కొంతకాలము క్రిందట మనదేశములో కురుపాండవదాయభాగ నిర్ణయవిషయమై యొకచర్చజరిగినది. ధృతరాష్ట్రుఁడా, పాండురాజా, ఎవరురాజు? అను ప్రశ్నము పుట్టినది. ధృతరాష్ట్రుఁ డంధుఁడగుటవలన రాజ్యార్హత లేకపోయినదని యొకపల్లవనాటి బ్రాహ్మణపండితుఁడును పాండురాజు శ్వేతకుష్ఠరోగముగలవాఁడుగావున నతఁడు రాజ్యార్హుఁడు గాకపోయెనని యొక తెలగాణ్య బ్రాహ్మణపండితుఁడును, చర్చకు దిగి యుభయులును తమతమవాదములును సమర్థించుకొనుటకై భారతమునుండి ప్రమాణములను జూప మొదలుపెట్టిరి. ఆవాదములయొక్క పట్టుదలలను జూచినప్పుడు వారికిని వీరికిని పూర్వజన్మములలో నేమైన సంబంధముండునా యని తోఁచినదిగాని వారివంటి పండితుఁడను గాకపోవుటచేత నందేమియు జోక్యముకలిగించుకొనక వినోదించుచుఁదటస్థముగానుంటిని. కాని నేఁడు పరిశీలించిచూడ వారిరువురి వాదములును గూడ సత్యమునకు దూరములయినవిగానే కన్పట్టుచున్నవి. ఏమన ధృతరాష్ట్రుఁడు గ్రుడ్డివాఁడు కాఁడు. పాండురాజు శ్వేతకుష్ఠము కలవాఁడును గాఁడు. ధృతరాష్ట్రవిదురపాండులను గుఱించి మహాభారతమున నిట్లు వర్ణనముగలదు.

"జన్మప్రభృతి భీష్మేణ పుత్రవత్పరిపాలితాః, సంస్కారైః సంస్కృతాస్తేతు తతోఽధ్యయన సంయుతాః, శ్రమవ్యాయామకుశలాః సమపద్యంత యౌవనమ్, ధనుర్వేదేచ వేదేచ గదాయుద్ధేఽసిచర్మణి, త

శ్చైవ గజశిక్షాయాం నీతిశాస్త్రేషు పారగాః, ఇతి
హాస పురాణేషు నానాశిక్షాసు బోధితాః.

అనఁగా జన్మప్రభృతి భీష్మునిచేత స్వపుత్రులవలెఁ బెంపఁ బడుచుండిరి. కులోచిత సంస్కారములచే సంస్కృతులై యధ్యయన సంయుతులై యొప్పుచుండిరి. క్రమముగా యౌవనవంతులై శ్రమవ్యాయామకుశలులై, ధనుర్వేదమునందును, గదాయుద్ధములందును, కత్తిసాము మొదలగు వానియందును నిపుణులగుటయేకాక గజశిక్షాది విద్యలయందును, నీతిశాస్త్రములయందును పారగులై యుండిరి. ఇంతియకాక వేదవేదాంగ విద్యలయందును పురాణేతిహాసములను నేర్చుటయందును మఱియు నానావిధములయిన శిక్షలయందు నాఱితేఱినవారుగ నుండిరి. నిజముగా ధృతరాష్ట్రుఁడు పుట్టుగ్రుడ్డియే యైనయెడల ధనుర్విద్యయందు నిపుణుఁ డెట్లయ్యెను? గదాయుద్ధములయందు కత్తిసాములందు, కుస్తీపట్లయందు, గజశిక్షలందు, అశ్వశిక్షలయం దెట్లు ప్రవీణుఁడయ్యెను? ఇతఁ డంధజాతివాఁడు గాని నిజముగా గ్రుడ్డివాఁడు కాఁడు. అంధజాతులవారి రాజ్యము మొట్టమొదట ప్రజాసత్తాక రాజ్యముగ (Republican Government) నుండెను. అంధుఁడయిన ధృతరాష్ట్రుఁ డిన్నివిద్యలయం దాఱితేఱినవాఁ డననేమి? అంధజాతి వారయిన రాష్ట్రికు లిన్నివిద్యలయందు నాఁకాలమున నిపుణులై యున్నవారను మాట మహాభారతములో "ధృతరాష్ట్ర స్త్వచక్షుష్ట్వా ద్రాజ్యం న ప్రత్యపద్యత" అని అంధుఁడగుట ధృతరాష్ట్రుఁడు రాజ్యమును బొందలేదని చెప్పినకారణ మంధజాతులవారి కాకాలమున ప్రజాసత్తాక రాజ్యమునం దుండెడి యభిలాషచేత నే కాని మఱి యొండు కాదు. తా మొకరాజుయొక్క నిరంకుశ పరిపాలనమున నుండ నిచ్ఛలేనివారుగ నుండిరనుట. అంధులలో నిది యొకశాఖ. కాని అంధుఁడైన ధృతరాష్ట్రునకు శ్రీకృష్ణభగవానునియొక్క కరుణాకటాక్షముచేత దృష్టిగలిగి విశ్వరూపసందర్శన భాగ్యము లభించినదఁట. పాండవుల కడనుండి ధార్తరాష్ట్రులకడకు శ్రీకృష్ణుఁడు రాయబారిగ వచ్చినప్పుడు ధృతరాష్ట్రుఁడు శ్రీకృష్ణభగవానునిఁ గాంచి యిట్లు పలికెనట.

"త్వమేవ పుండరీకాక్ష! సర్వస్య జగతో హితః,
తస్మాత్త్వం యాదవశ్రేష్ఠ! ప్రసాదం కర్తు మర్హసి.
భగవ! న్మమ నేత్రాణా మంతర్ధానం వృణే పునః,
భవంతం ద్రష్టుమిచ్ఛామి నాన్యం ద్రష్టుమిహోత్సహే"

ఓ పుండరీకాక్షా! లోకము నంతకును మేలుచేయువాఁడవు. ఓ యాదవశ్రేష్ఠుఁడా! నన్నాశీర్వదింపుము. ఓ దేవా! నిన్నుమాత్రమే నేను చూడఁగోరుచున్నాను. అన్యముతో నాకు నిమిత్తము లేదు. నాకు మరల దృష్టి నొసంగి నీదివ్యరూపమును జూపుము. ఇట్లు ప్రార్థింప ధృతరాష్ట్రునకుఁ గరుణించి శ్రీకృష్ణభగవానుండు వానికి దృష్టిని బ్రసాదించి దివ్యరూపసందర్శన భాగ్యము లభింపఁజేసెను. ఈయంధుఁడు విశ్వరూపము నెప్పుడు సందర్శించెనో యపుడు వెంటనే భూమండలము కంపించెను; సముద్రము సంక్షుభిత మయ్యెను. పార్థివు లందఱు నద్భుతపడిరి.

అంధశబ్దముయొక్క యర్థము వర్ణింపఁ బడినవిధము ననుసరించి యది జాతిపరముగ—

చెప్పఁబడినదో కేవలము గ్రుడ్డియను నర్థము బోధించు సందర్భమునఁ జెప్పఁబడినదో బుద్ధిమంతులకుఁ దెలిసికొనుట కవకాశములు లేకపోలేదు. ఎప్పుడో యుగములనాఁడు కూపకూర్మములవలె నున్నవారు నేఁడును కూపకూర్మములవలె నున్నవారని భ్రమించి యాకాలమునందును వలె నీ కాలమునందును పరోక్షనామములతోఁ గాలము గడుప సాధ్యపడదు. సందర్భవశమున ధృతరాష్ట్రుని కథ తలపెట్టితినిగాని దీని గుఱించి విశేషముగాఁ జెప్పవలసిన సందర్భము వేఱొకప్పుడు రాఁగలదు. ప్రస్తుతము దీని నిట్లుండనిండు. మన పురాణేతిహాసములలో నత్యంత ప్రాచీనములైన చరిత్రాంశములను దెలుపు గాథలు కలవుగాని వాని గూఢార్థములను మనము గ్రహింపఁగలుగు నపుడే మనకా కాలము నాఁటి సత్యచరిత్రము చక్కగా బోధపడును. కాని లేనియపు డయ్యవి పిచ్చికథలుగాఁ గాన్పించును. అంతియ కాదు. వాని వ్రాసిన గ్రంథకర్తలయెడ దురభిప్రాయము లుదయించి వారివాక్యములందు విశ్వాసము తొలఁగిపోవును. వానిసమదృష్టితో విచారించి వాని రహస్యచరిత్రము తెలిసికొన్నప్పుడు నిజమైన యానందమును బొందఁగలుగుదుము గాని యస్వాభావికములై ప్రకృతివిరుద్ధములగ నుండి విశ్వాసార్హములు కాని వాని లోకమునకుఁ బ్రదర్శించిన నేమి యానందము గలుగును ? వానివలన సంఘమునకుఁ గలుగవలసిన ప్రయోజనము గలుగునా? ఒక్క రామాయణమును దీసికొని చూడుఁడు; కోతులు సంస్కృతము మాట్లాడునా? బట్టలు కట్టుకొనునా? అలంకారములు పెట్టుకొనునా? వీరందఱు హీనమానవులని శ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు వక్కాణించినారు. పై పెచ్చు ఆ అంగుళములతోఁ గలుగల మానవులని వ్రాసినారు. (శారద సంపుటము, 3. సంచిక ౫) త్రివేదములు నేర్చినవారివలెను, సంస్కృతమున నొక్క యపశబ్దము నైన లేకుండ మాట్లాడ నేర్చినవారివలెను మాట్లాడగల వాఁడును, సుగ్రీవునికడను పేర్కడయురుగ(ప్రెగడ) నున్న హనుమద్దేవుఁడు హీనమానవుఁడగునా? ఆంధ్రపహ్లవ లేక ఆంధ్రపణ్ణవ యొక్క ప్రాకృతభాషారూపమే అంధపవన యనునది. రామాయణములో హనుమంతుఁడు పవనపుత్త్రుఁడనియే వక్కాణింపఁబడియుండెను. వాలిసుగ్రీవు లంధ్రులె. ఇదియు రామాయణములో గ్రంథకర్త యొకవిధముగా సూచించియే యున్నాఁడు. శ్రీ రాముఁడు చాటున దాఁగొనియుండి తన కేయుపకారము చేసియుండని తన్ను బాణముతోఁ గూల్చినందుకు ఖేదపడి యాతని దూరఁగా రాముఁడు మరల వాని దుర్నీతి నుగ్గడించు సందర్భమున శ్రీ మద్రామాయణములో, కిష్కింధాకాండమున, అష్టాదశసర్గమున,

"చపలశ్చపలై స్సార్ధం వానరై రకృతాత్మభిః;
జాత్యంధ ఇవజాత్యంధై ర్మంత్రయన్ ద్రక్ష్యసే ను కిమ్"

అను శ్లోకము గానంబడుచున్నది. ఈ శ్లోకమునకు రెండర్థములు చెప్పుకొనవచ్చును. ఏయర్థము చెప్పుకొన్నను నేదో యొకవిధముగా వాలి జాత్యంధుఁడని సూచింపఁబడెనని

గ్రంథకర్త యభిప్రాయమై యుతఁడిట్లు సూచించెనని నాయభిప్రాయము. కనుక వాలిసుగ్రీవులిరువు రంధజాతివారని తలంపవచ్చును. వాలి సనాతనధర్మపరాయణుఁడు. సుగ్రీవుఁడు నవీనాచారతత్పరుఁడు. మహాభారతములో భీష్మపర్వములో భూమిపర్వములోఁ బదునొకండవ యధ్యాయములో శాకద్వీపము ౧ మృగదేశమనియు ౨ మశకదేశమనియు, 3 మనసదేశమనియు ౪ మందగదేశమనియు నాలుగుభాగములుగ నుండెననియు, మృగదేశములోని మృగాలు బ్రాహ్మణులుగను, మశకదేశములోని మశకులు క్షత్రియులుగను, మనసదేశములోని మనసులు వైశ్యులుగను, మందగదేశములోని మందగులు శూద్రులుగను నుండి వారివారి విధ్యుక్తధర్మములను నిర్వర్తించుచుండిరని వక్కాణింపఁబడియుండెను. విష్ణుపురాణాదులలో మృగా బ్రాహ్మణులు మగా బ్రాహ్మణులని వక్కాణింపఁబడిరి. మర్గియానా, పార్థియా, మేదియా మొదలగు దేశములయందు పురోహితకార్యములను నిర్వర్తించువారిని మగీ లేక మాగా లనుచుండిరి. ఈశాకమృగాలు బ్రాహ్మణులయినను రామాయణములో శాఖామృగములని వక్కాణింపఁబడిరి. శాఖామృగము లనఁగాఁ గోతులని యర్థముకదా! వాలిసుగ్రీవులు శాకబ్రాహ్మణులే. గోతమ శాఖలోని గోతములై యుండ వలయును. ఆ కాలములోఁ గొన్ని తెగలకు వీరు ప్రభువులై యుండుటచేతనే వీరిపేరిట మగండు అనుశబ్దము పుట్టినది. మగ + అండు అనఁగా మగజాతి వారి ప్రభువని యర్థము. అందువలననే తెలుఁగు భాషలో మగఁడు (మగండు) అనఁగా; (౧) పురుషుఁడు (౨) భర్త (3) రాజు (౪) శూరుఁడు మొదలగు నర్థము లేర్పడినవి. సుగ్రీవుఁడు బ్రాహ్మణుఁడగుటచేతనే శ్రీరామచంద్రు (అయోధ్య ఐక్ష్వాకులక్షత్రియుఁడు) నిపంటి క్షత్రియుఁడు స్వకార్యనిర్వహణార్థము శరణాగతుఁడయ్యెను. వాలిసుగ్రీవులు బ్రాహ్మణు లగుదురా కారా యని మనము సంశయింప నక్కరలేదు. ఏమనఁగా సనాతనధర్మపరాయణు లయిన బ్రహ్మశ్రీ కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రులవారు శారద పత్రికలో వ్రాసిన యీ క్రిందివాక్యములను జిత్తగింపుఁడు. "కిష్కింధా రాజ్యమందుఁగల వానరులు కొందఱు సంస్కృతమునఁ బ్రవీణులైయుండెడివారు. సంస్కృత భాషను బాగుగ నభ్యసించెడివారు. హనుమన్నామకవానరుని సంస్కృత పరిజ్ఞానమును గూర్చి శ్రీరామచంద్రుఁడు లక్ష్మణునితో నిట్లు దెలిపి యుండెను:

ఏతచ్ఛ్రుత్వా వచ స్తస్య రామో లక్ష్మణ మబ్రవీత్, ప్రహృష్టవదన శ్శ్రీమాన్ భ్రాతరం పార్శ్వత స్థితమ్ సచివోఽయం కపీంద్రస్య సుగ్రీవస్య మహాత్మనః, తమేవ కాంక్షమాణస్య మమాంతిక ముపాగతః. అభిభాషస్వ సౌమిత్రే! సుగ్రీవ సచివం కపిమ్, వాక్యజ్ఞం మధురై ర్వాక్యై స్స్నేహయుక్త మరిందమ! నానృగ్వేదవినీతస్య నా యజుర్వేద ధారిణః, నాసామవేద విదుష శ్శక్యమేవం ప్రభాషితుం. నూనం వ్యాకరణం కృత్స్నమనేన బహుధా శ్రుతమ్, బహువ్యాహరతానేన నకించి దపశబ్దితమ్.

(శారద. రెండవసంవత్సరము. సంపుటము ౧. సంచిక ౫.) వీరిని వైదికమత మవలంబించిన

వారని వీరినాగరికతను బెక్కువిధముల నుద్ఘో
షించుచు వ్రాసిన శాస్త్రులవారే వానరులు
కారని వక్కాణించుచు హీనమానవులని
వక్కాణించుచున్నారు. ఇది యాశ్చర్యము
కదా! వీరు వానరు లెప్పుడు కాకపోయినారో
రామదండులోఁ జేరిన తక్కినవారు కూడ
వానరులుకారని చెప్పకతప్పదు. అప్పుడు పల్లె
కాపులను కపులనియును, ప్లవులను ప్లవంగు
లనియు మరకాండులను(పల్లెనావికులు)మర్క
టములనియు మనమర్థము చేసికొనవలయును.
బ్రహ్మక్షత్రియ వైశ్యులను హీనమానవులని
యనలేముగదా. ఇంక మిగిలినవారుశూద్రులు.
మున్నొకప్పుడు నేను మనలోని రెడ్డి, కమ్మ,
వెలమ, బలిజ, తెలగ మొదలగు తెగలవా
రిని మనము శూద్రులనరాదనియు, వారిని
వైశ్యులుగను, క్షత్రియులగను భావింపవలసి
నదనియు శూద్రు లపవిత్రులుగావున శూద్ర
శబ్దము వీరికి వర్తింపఁజేయరాదనియు నాంధ్రు
లచరిత్ర మొదలగు వానిలో వ్రాసియుండగాఁ
శూద్రులు పవిత్రులే యని వక్కాణించిరి.
శ్రీవత్సవాయ నీలాద్రిరాజ కవిరాజ విరచిత
మైన 'ఆంధ్రక్షత్రియు' లను గ్రంథమునకు
వీరి వ్రాసిన పీఠికచూడుఁడు. ఇంక మిగిలిన హీన
మానవు లెవ్వరయి యుందురు? నిమ్న
జాతులవారా? ఈ వైదికమత మవలంబించిన
హీనమానవులు నిమ్నజాతులవారనియూ వీరి
యభిప్రాయము. శతపథబ్రాహ్మణములో
"పద్యుహవా ఏతచ్ఛ్మశానం యచ్ఛూద్రః"
శూద్రుఁడు పాదములతోఁగూడిన అనఁగా
మనుష్యాకారముతో నున్న శ్మశానము గనుక
నపవిత్రుఁడు. వానికి కర్మాధికారము లేదని చెప్పఁ
బడియుండెను. శూద్రులగతియే యిట్లుండఁగా
నిమ్నజాతులను గూర్చి వక్కాణింప నక్కర
లేదు. కాఁబట్టి దేవాంశసంభూతులమని చెప్పు
కొనెడు భూదేవత లింతటనైనను తమదేశము
యొక్కయు, తమసంఘముయొక్కయు గౌర
వమును నిలుపుకొనఁదలంచి రేని వంకరటింకర
మార్గములను విడిచి సత్యమునకును, ధర్మ
మునకును గట్టుపడి సరళమార్గమున
నాంధ్రసంఘాభివృద్ధికిఁ దోడ్పడుదురు
గాక యని ప్రార్థింతును. శ్రీరాముఁ
డును, సుగ్రీవహనుమదాదులును, తక్కిన
శ్రీరామదండంతయు నాంధ్రులే యని
తెలిసికొనవలయును. మన యాంధ్రదేశీయు
లెల్లరు శ్రీమద్రామాయణమును బరమ
పవిత్ర గ్రంథముగాను చరిత్ర గ్రంథముగాను
భావించి నిరంతరము పారాయణము చేయు
చుండవలెనని కోరుచున్నాఁడను.






ఆదిపూడి సోమనాథరావు గారు

౧

భూనభంబులుగల్గి పొడలకపూర్వమే
వర్తిల్లుచుండెను వస్తువొకటి
నిశ్చలంబును మఱి నిర్వికారంబయి
బుద్ధికగ్రాహ్యమై పొలుచుచుండె
సుస్థిరంబును మఱి శుద్ధమై చెల్వొంది
యుత్తమోత్తమమయి యొప్పుచుండె
దీనిపే రేదియో తెలియదుగాని నే
దేవుఁడందును దీనిఁ దెలుపుటకును

౨

గీ. పేరుగలపెద్దియునుగూడ విశ్వమునకు
నాదిమూలమ్ము గాఁజాల దన్నిటికిని
పేరులేనిద మూలమై వెలయుచుండు
విషయములఁ జిక్కకుండెడు వీరవరుఁడె
దీని నీయాదిమూలముఁ దెలియఁగలఁడు

౩

సీ. దేవుఁడు ప్రకటమై తేజరిల్లఁదొడంగ
వెంటనే యతనికిఁ బేరుగల్గె

౪

అవ్యక్తుఁడయ్యున్న యంతకాలమ్మును
నొక్కపేరైనను నుండదయ్యె
అతిశక్తిమంతుఁడై యలరుచునుండెను
యతనియాధీనమం దన్నియుండె

౫

సర్వజీవులకును శరణము నాతండె
ధార్మికులకునెల్ల ధనమతండె
గీ. పాపులను నుద్ధరించు పావనుఁడతండె

౬

అన్ని యాతనిలోనుండి యవతరించు
అతఁడు గల్గుట కొకమూల మనఁగ లేదు
తనకుఁ దా నాదిమూలమై తనరుచుండు

౭

గీ. ఏదియును దనది గాదని యెంచి తాను
బూర్ణవైరాగ్యమును బొంది పూతభక్తి
నతని శరణాగతుండయి యలరుఁగాన
నన్నియునువచ్చిబుహిఁబొందునద్భుతముగ

౮

సీ. పరిపూర్ణవృద్ధిని బడసిన వెంటనే
ప్రతిజీవుఁడును మూలపదవిఁ జేరుఁ
దన మూలపదవిని దాఁ జేరు నననేమి
పరమశాంతాత్ముఁడై పరఁగుచుండు
పరమశాంతాత్ముఁడై పరఁగును నననేమి
తనవిధి నెరవేర్చి తనరుచుండు
తనవిధి నెఱవేర్చి తనరారు నననేమి
నిత్యాత్మపదవిలో నెగడుచుండు

౯

గీ. క్రూరపురుషునిఁ గడుమేదకుండ గెల్చు
బలముగలవాని నిలను దుర్బలుఁడు గెల్చు

౧౦

అతికఠినుఁడైనవానిని నతిశయముగ
లొంగువాఁడె జయించు నీ లోకమందు

౧౧

మాటలాడక బోధించు మార్గ మెదిరొ
శుద్ధనిష్క్రియయందలి సుగుణ మెదిరొ
యిలను దెలిసినవారలు గలుగు టరుదు
అందఱకు వీనిఁ దెలియ శక్యంబు గాదు

౧౨

సీ. ఆకులుపదుమూఁడు నతిభద్రముగఁగూడఁ
జక్రనాభికిఁ జుట్టుఁ సక్రమముగ
వానిమధ్యఁ జెలంగు వట్టితావునుబట్టి
యరదంపుగతి యెల్ల నమరియుండు
కుండకు నాకృతిఁ గూర్చుమృత్తికగాని
వట్టితావేకద వచ్చుఁ బనికి?
గృహమునకుండును గిటికీలుద్వారమ్ము
లింటికి నుపయోగ మివియె కావె?

గీ. వట్టియీ తావులట్లుండ వలయుఋషియు
దేనియందును మమకారదృష్టి లేక
అప్పుడగా యుర్విలోపలి వన్ని గూడ
నన్ని వైపులవచ్చి తన్నాశ్రయించు

౧౩

గీ. వెలుపలికిఁబోక కిటికీల వెంటఁగనక
స్వాంతమునఁజూడవచ్చు నా స్వర్గపథము
తెలివిలగ్గను దూరమ్ము తొలఁగుకొలఁదిఁ
గాన నే ఋషి యిటునటుఁ గదలకుండ
దివ్యచక్షువుచేతను దెలియుచుండు
చూడకయె పేళ్ల చేతను జూపుచుండుఁ
చాటుపడకయె సిద్ధిని బడయుచుండు

౧౪

గీ. ఏదియో యొకమతమున నేగువాఁడు
కార్యరతియందునానాఁడు కరముఁ బెరుఁగు
ఈశ్వరార్పితచిత్తుఁడై యేగువాఁడు
కార్యరతియందునానాఁడు కరముఁ దఱుగు
అనఁగ స్వార్థైక కార్యమ్ము లన్ని వీడి
చిట్టచివఱకు నిష్కర్మ శీలుఁడగుచు
నేమి సేయకయుండి సర్వేశుకరణి
విశ్వనాథుండు దానయి వెలయుచుండు
కార్యరతిలో మునింగిన కర్మరతుఁడు
విశ్వనాథుండు గాలేఁడు వెలయలేఁడు

౧౫

గీ. హృదయమునఁబట్టుదల లేదు ఋషివరునకుఁ
దనమదిని లీనపఱచును జనులమదిని
సదయుఁడై చూచు సుజనదుర్జనుల నెల్ల
సత్యవంతుని మఱియు నసత్యవంతు
నొక్కవిధముగ మన్నించుచుండు నతఁడు

౧౬

గీ. మనసు చెడునేమొ యనుభీతి మదిని గలిగి
ఋషివరుఁడు మెలఁగుచుండు నీపృథ్వియందు

౧౭

గీ. తగవులాడక జనులను దగినరీతి
బాగుపఱచెడు నీరంబు పగిది నుండు
నుత్తమంబైన ధర్మ మీ యుర్వియందు

౧౮

గీ. నిత్యమును శాంతపదవిని నెగడు టంచె
యొప్పుచుండును జీవాత్మ గొప్పయెల్ల

౧౯

గీ. ఎవనితోడను ఋషి కలహింపకుండు
గాన నాతనిపైఁ గోప మూనఁ డెవఁడు

౨౦

గీ. మంచి యొనరించి ఋషి దాని నెంచకుండు

౨౧

గీ. కరుణగలవాఁడె జయమును గాంచఁగలఁడు
గాంచి జయమును గర్వము గాంచఁడతఁడు
గాంచిజయమును జయముగా నెంచఁడతఁడు
తనజయమ్మును దనదిగాఁ దలఁపఁ డతఁడు
గెలుపు గనితీరవలెఁ గానఁ గెలుచు నతఁడు
జయముగాంచియు నల్లరి సలుపఁ డతఁడు
మితినిగనుఁగొని జయమున మెఁగునతఁడు
గాన భువిని సహాయంబు గనఁ డతఁడు

౨౨

సీ. దైవతేజంబుతోఁ దనరుచుండెడువాఁడు
అంధకారావృతునట్లు దోఁచు
దేవునినెంతయుఁ దెలిసి వర్తిలువాఁడు
అజ్ఞానపరివృతునట్లు దోఁచు
దివ్యోచ్చపదవిని దేజరిల్లెడువాఁడు
అత్యంతనీచాత్మునట్లు దోఁచు
ఉత్తమధర్మాన నొప్పుచుండెడువాఁడు
అలధర్మహీనుని యట్లుదోఁచు
అతినిర్మలుండయి యలరుచుండెడువాఁడు
అత్యంత మలినాత్మునట్లు దోఁచు

గీ. తెలివితో నొప్పుచుండెడు ధీయుతుండు
తెలివిలేనట్టి యవివేకివలెను దోఁచు
ధర్మమున దృఢతరంబుగాఁ దనరువాఁడు
వసుధలోఁ జంచలాత్మునివలెను దోఁచు
సరళవర్తనుఁడును సత్యసంధుఁ డెన్నఁ
బనికిమాలిన పందగాఁ బయికిఁదోఁచు

౨౩

గీ. వసుధలో సన్న పెంట్రుకవంటిదైన
వేరునందుండి యొక గొప్పవృక్ష మొదవు
మహిని వెలసెడి పిడికెడు మట్టినుండి
తొమ్మిదంతస్థులున్న సౌధమ్ము లేచు
వేయిమైళ్లుండి దీర్ఘమై వెలయునట్టి
పథము ప్రారంభమగు నొక్క పదమునుండి
అవనిలోఁ గల దుస్సాధ్యమైన దెల్ల
నతిసులభకార్యమున మొదలగును గానఁ
బొదలు సులభంపుఁబనిచేత మొదలుపెట్టి
కడఁగుచుండుము దుస్సాధ్యకార్యమునకు
అధికతరమైనపనియెల్ల నవనియందు
నల్పకార్యమ్ముచే మొదలగును గానఁ
బొలుచు కడుఁ జిన్నపనిచేత మొదలుపెట్టి
కడఁగుచుండుము ఘనతరకార్యమునకు
పయికి గొప్పగఁదోఁచెడు పనిని దేని
నుర్విలోఁ దాను జేయకయుండుఁ గానఁ
దనకుఁ గొప్పగఁదోఁచెడు పనిని జేయఁ
జాలియుండు మహాత్ముఁడై క్రాలువాఁడు

(సశేషము)





39-వ భారతజాతీయమహాసభా మంటపమధ్యమున వేదికపైనుండి యధ్యక్షు లుపన్యసించుట, బెల్గాము



39-వ భారతజాతీయమహాసభా ప్రతినిధుల స్నానపానాదులకై కావించిన నీటివసతులు, బెల్గాము



మూడవ అఖిల భారత గ్రంథాలయ మహాసభా ప్రతినిధులు, బెల్గాము.



# హిందూదేశపులక్క-పరిశ్రమ

చిర్రావూరి రామ సోమయాజులు గారు

హిందూ దేశమే జన్మస్థానముగా గల లక్క, అతి ప్రాచీనకాలమునుండి మన దేశస్థులకు పరిచితమైనదే. లక్క రెండువేలయేండ్ల క్రింద సహితము వాడుకలో నున్నట్లు హిందువులకు తెలుసైన యాధారము లనేకములు గలవు. అట్టి పదార్థముయొక్క యుపయోగబాహుళ్యము క్రమముగా దేశాంతరముల యందు కూడ వ్యాపించుటకు ప్రారంభించినది మొదలు, దాని యావశ్యకత వృద్ధి జెంద నారంభించినది. వివిధ దేశములు లక్కకు క్రొత్తక్రొత్త యుపయోగములను కల్పించుటలో యొకదాని నొకటి మించుటకు ప్రయత్నించుచున్నవి. ఒక హిందూ దేశమునుండియే ప్రతిసంవత్సరము 4.8 కోట్లరూపాయిలు విలువగల లక్క పైదేశముల కెగుమతి చేయబడుచున్నది. హిందూ, చైనా, సయాము మొదలగు మరికొన్ని దేశములుకూడ లక్కను యెగుమతి చేయుచున్నప్పటికిని హిందూదేశమే ముఖ్యముగా ప్రపంచమంతటను లక్కను పంపుచున్నది. తక్కిన దేశములన్నియు కలసి ప్రపంచమునకు కావలసిన లక్కలో నూటికి రెండు మూడుపాళ్లు మాత్రమే యెగుమతి చేయగలుగుచున్నవి.

మొదట యీపదార్థము దాని సొగసైన యెఱ్ఱటి రంగుచేత యిట్టి ప్రాముఖ్యము వహించినది. నవీనోపయోగములలో చాలవరకు అంతగా సరకుగొనబడక, దాని యందుండు ప్రత్యేకమైన బంకవంటి పదార్థము (Resin) వాడుకలో నున్నది. ఈ రెసినుపదార్థము మును పెప్పుడును యిట్టి యుపయోగప్రాధాన్యము వహించియుండ లేదు.

హిందూదేశములో లక్కను వాడుక చేయు సందర్భము లనేకములు గలవు. గ్రామములయందుగల చెక్కపనివాండ్రు, లోహపుపనివాండ్రు జోళ్లుకుట్టువారు మొదలుగాగల ప్రతిపారిశ్రామికుడును, లక్కను యేదోయొక విధముగా వాడుకలోనికి తెచ్చుచున్నాడు. కాని యీవాడుక లన్నియు హిందూదేశమునుండి ఈపదార్థమును పైదేశముల కెగుమతి గాకుండ జేయుటకు సమర్థములు గాకున్నవి. అందుచే ఈపరిశ్రమకు కూడ వలసినంత యౌన్నత్య మనుభవించుట కవకాశము గలుగలేదు. ప్రస్తుతకాలము జరుగుచున్న ఈకొంచెపు యౌన్నత్యముకూడ మన కమెరికాదేశమువల్ల సంప్రాప్తమైనది. ఏలయన యీదేశమందు గ్రామఫోను రికార్డులుచేయుట కీ లక్క విస్తారముగా వాడుకచేయబడుచున్నది. వైద్యుతోపకరణములకు (Electrical appliances) కూడ ఈలక్క యుపయోగించు ననువిషయము తెలిసినప్పటి నుండియు, చైనా, జపాను మొదలుగా గల దేశములు, మన హిందూదేశమును త్రోసిరాజును జేసి తామే ప్రపంచమునకు కావలసిన లక్కనంతయు నందజేసి యీ లాభమును వడిగట్టుకొన ప్రయత్నములు జేయుచున్నవి. ప్రకృతిసాధ్యమైన ఈలక్కను కృత్రిమముగా గూడ కల్పించి, నీలిమందుకు ప్రాప్తమైన దీనదశను యీలక్కకు కూడ ప్రాప్తింపజేయ నుద్యమములకు గూడ కొరతలేదు. కాని దైవానుగ్రహము వలన, ఈ యుద్యమము లంతఫలవంతము కాలేదు. హిందూదేశమందు లక్కయొక్క పరిశ్రమ యిట్టి దీనదశయం దుండు ఈకాలములో హిందువులు తమ చిరసంచితమైన మాంద్యమును, వైముఖ్యమును బోద్రోసి ఈ పరిశ్రమయొక్క ప్రస్తుతదైన్యావస్థను దలపోసి పేదలకు జీవనోపాధి కల్పించునట్టియు, సనాతనమైనట్టియు ఈ పరిశ్రమను యితరదేశములకు పోకుండ భూతలమునకు

వలసిన లక్క నంతయును హిందూదేశమే యందజేయు నదిగా జేసి, ధృవపరచి పోషించుటకు బద్ధకంకణులు గాకుండుట కడు శోచనీయము. ఈపరిశ్రమయందు హైందవులు మరికొంచెము శ్రద్ధ వహింతురేని, యిట్టి శోచనీయమైన ప్రస్తుతావస్థను తొలగింప జేయవచ్చును. మైసూరు రాజ్యాంగప్రభుత్వ వీనివిషయమై శ్రద్ధవహించుచున్నదియై, హిందూదేశమంతటికి యాదర్శమై యున్నది. బెంగుళూరిలో నున్న ప్రకృతిశాస్త్రశోధనాలయమందున (Indian Institute of Science) ప్రొఫెసర్ గిల్బర్టుఫౌలరు గారి యాజమాన్యముక్రింద ప్రారంభించి వారిశిష్యులు లక్కయొక్క స్వరూపమును బాగుచేయుటయు దానిని వృద్ధిపరచుటయు నుద్దేశములుగా గల శోధన లతిబాహుళ్యముగా నిర్వహించుచున్నారు. రాంచియందు ప్రతిష్ఠింపబడిన "హిందూదేశ లాక్షాసంఘము" కూడ దానివిషయమై అన్వేషణములను, వ్యవసాయపద్ధతులను బాగుచేసి లక్కయొక్క ఫలమును వృద్ధిపరచుటకు ప్రయత్నించుచున్నారు. ఇంతియేకాక మరికొందరు దేశస్థులు యీపరిశ్రమయం దెక్కుడాదరమును దీసికొన్నగాని దీని భవిష్యత్తు ఉండవలసినంత లాభకరముగా నుండనేరదు.

ఈవ్యాసములో లక్కపరిశ్రమను బాగుచేయు పద్ధతులు కొన్ని నిరూపించబడును.

పైన యీలక్కపరిశ్రమ దేశమున కెంత యుపయోగకరమైనదో చెప్పబడినది. ఇక లక్కయొక్క యుత్పత్తి విషయము, దానిని సేకరించువిధము దాని స్వభావము దాని ముఖ్యోపయోగములును చేర్కొనబడును.

లక్క క్రిమిజన్యమను విషయ మిదివర కెల్లరకు తెలిసినదే. కీటకశాస్త్రవిభాగములందు లక్కపురుగు కాక్సిడే (Cocidie) జాతిలో చేరినది. ఆ పురుగు కొన్నిచెట్ల నాశ్రయించి వాటి లేతకొమ్మలమీద లక్కను పట్టుగా పెట్టును. ఆచెట్లకు శాస్త్రమందు 'ఆశ్రయ వృక్షములు' (Host-plants) అని పేరు. ఆచెట్లమీద లక్కపురుగు వ్యాపించుటకు మొదలుపెట్టినది మొదలు లక్క బాగా పెరుగుటకు కావలయు కాలము ఆశ్రయవృక్షములను, దేశమును బట్టియుండును. మైసూరులో లక్క బాగా పెరుగుటకు అనమను నాల నెలలు పట్టును. ఇతర స్థలముల యందు ఆరునెలలవర కాగలదు. ప్రస్తుతము మైసూరులో లక్కపురుగు తన ముఖ్యాశ్రయవృక్షమైన జాలారిచెట్టు మీద (Shorea Talura) 13 నెలలకు మూడు పంటల నిచ్చుచున్నది. ఇతర స్థలములయందు సంవత్సరమునకు రెండుపంటలే సంప్రాప్తమగుచున్నవి. బెంగుళూరు శోధనాలయమందు, శ్రీనివాసయ్య గారు 'కస్తూరితుమ్మ' (Acacia Farnesiana) చెట్టును ఆశ్రయవృక్షముగా కల్పించి చేయుచున్న శోధనల ప్రకారము, లక్కపురుగులు వ్యాపించుకాలమునకును, లక్క ఫలోన్ముఖముగు కాలమునకును గల వ్యవధి తగ్గించుటకు వీలుపడునట్లగుపడుచున్నది.

భిన్న దేశములయం దుండు ఆశ్రయ వృక్షములు, వాటితోపాటు క్రిమిజాతులుగూడ భేదముగానుండును. క్రిములయందు సుమా రొక నూరు భేదములు యిప్పటికి కనుగొనబడినవి. ఆశ్రయవృక్షములలో ముఖ్యమైనవి మోదుగ, కుసుమ (కోశనక్), రేగు, గుగ్గిలము, రావి, శిరీషము, కొన్ని తుమ్మజాతులు, జాలారి. వీటిలో యొక్కొక్కటి యొక్కొక దేశమునందు విస్తారముగా నున్నది. ఇందు మొదటి చెట్టు బీహారునందును, తరువాత రెండుచెట్లు మధ్యపరగణాలయందు, ఆఖరుది మైసూరునందును లక్కపురుగుల కాశ్రయవృక్షములుగా నుపయోగబడుచున్నవి.

భిన్నము యీ లక్క పురుగులజాతులలో నొక్కొక్కటి, యొక్కొక ఆశ్రయవృక్షమును ప్రీతిగా దీసికొనును. ఇతరవృక్షములు అనగా ఆక్రిమికి ఇష్టము లేని వృక్షములమీద పెరుగనే పెరుగదు.

క్రిమినుండి లక్క యుద్భవించుప్రకారము విశదీకరించు రెండు సిద్ధాంతము లేర్పడినవి. అందులో నొక మతప్రకారము, లక్కపురుగు జీర్ణముచేసికొనలేని యాహారము పురీషరూపముగా విసర్జించబడి జతురూపమగును. అందుచే దీనిని పురీషవాద మనవచ్చును. రెండవమతము లక్కను పురీషప్రాయముగా పరిగణించక, లక్కపురుగుయొక్క శరీరముచే యథాక్రమముగా సేకరించబడు నుత్సర్గము (Secretion) గా భావించుచున్నది.

దానికి యుత్సర్గవాదమని పేరిడవచ్చును. ఈ రెండవమతముయొక్క యాథార్థ్యమేమనగా, లక్కపురుగు చెట్టుయొక్క రసమును తనకు భోగద్రవ్యముగా గ్రహించి, తన శరీరమందుగల విపరీతశక్తియుక్తమైన కొన్ని పిండ (glands) విశేషములనుండి, లక్కయనెడు అతి సంకీర్ణపదార్థము సంజనితమై పైకి త్రోసివేయబడుచున్నది. ఆడపురుగులను ఫలవంతములుగా జేసి మొగపురుగులు పైకివచ్చు కాలమునుంచి, కీటడింభములు (larvae) లక్షలకొద్ది వెలువడువరకు, లక్కనుకల్పించు శక్తి యెక్కువగా నుండును. ఈ సమయమందు లక్క బాగా పారి తీసివేయుట కదనుగానుండును. పిల్లపురుగులు మూడు వారములవరకు పైకి వచ్చుచుండును. ఈ వచ్చిన పురుగులు తరువాత తరము పురుగులను పుట్టించును. ఇటులనే యీతరము లవిచ్ఛిన్నముగా గడచుచుండును. ఈ గుడ్లతో నిండియున్నపుడే, యీలక్కపుల్లలను విరిచి మరియొక్క చెట్టుమీద నుంచినయెడల గుడ్లు పురుగులుగా పెరిగి చెట్టుమీద విస్తరించి యీ క్రొత్తచెట్లమీద పట్లను పెట్టుట కారంభించును. గుడ్లనుండి చెట్టుమీద ప్రాకు పురుగులలో కొన్ని చచ్చిపోవచ్చును. గాని నిషేకవ (inoculation) ప్రకారమందు కొంచము జాగ్రత తీసికొన్నయెడల వాటిచావును చాలవరకు తగ్గించవచ్చును.

కీటడింభములు పైకి వచ్చుటను మాని వేసిన తరువాత, ఎండిన కొమ్మలనుండి లక్కపొరలను తీసి వేయుదురు. ఆయవస్థయందు లక్కకు 'పుల్లలక్క' (Stick lac) యనిపేరు. పుల్లలక్కను బాగా చూర్ణము చేసి, జల్లించి కడిగిన తరువాత, అది యిసుకవలె సన్నటి కణములు గలదిగా నుండును. దీనికి 'గుండ లక్క' (grain lac) అని పేరు. పుల్లలక్కను కడుగు సందర్భములో దాని యందు రంగులో చాలభాగమును, కొన్ని కీటశవములును, అందున్న మైనమువంటి పదార్థమును తొలగించబడును. బాగా కడిగిన యీ గుండ లక్కను వేడిమిచే కరగబెట్టి, ఎగుమతిచేయుటకై లక్కదళములను (Shellac) తయారు చేయుదురు. ఈ లక్కదళములను చేయుటలో చాల నేర్పును, జాగ్రతయు నావశ్యకము; మిర్జాపూరు, కలకత్తా మొదలగు పట్టణములయందు గల యనేక కర్మాగారములలో మనుష్యులే యీపనిని చేయుదురు. కొద్ది కర్మాగారములయందు మాత్రము యంత్రసాధనముల నుపయోగించుచున్నారు. లక్కను కడుగుటలో కొన్ని ద్రావకములను గూడ నుపయోగించుచున్నారు. ఈ విధముగా తయారుచేయబడిన లక్కముద్దలకు వాటి రంగునుంచి 'గార్నెట్టులక్క' (Garnet lac) అను పేరు సంభవించినది. అదిగాక యీలక్కను పత్రములుగా నొనర్చునపుడు దీనికి 'గుండీ లక్క' (Button lac) అని పేరు వచ్చుచున్నది. లక్కను కరగించునపుడు దానిలో కొంతహరితాళము, సీమగుగ్గిలమును గూడ కలుపుదురు. మొదటిది లక్కను అస్వచ్ఛముగాను, కొంచెము పసుపు రంగు గలదిగా నొనర్చును. రెండవది లక్కను వేగముగా వేడికి కరుగునట్లు చేసి, దాని నుపయోగించు విధములందు మరింత యుపయోగకారిగా నొనర్చును. ఈకరగించు సందర్భములో సాధారణముగా లాభముకొరకు మరికొన్ని పదార్థముల గలిపి లక్కను పాడు చేయుదురు. అందుచేతనే మార్కెట్టు నందు దొరకు లక్కలో నెంత లక్కయున్నదో నిర్ణయించి ప్రమాణీకరించుట (standardisation) యావశ్యకము. లక్కయొక్క రంగు నారింజపండురంగువలె గాని, యెఱ్ఱగాగాని, కొంచెము లేపసుపుగాగాని యుండును. దాని రంగు అది యుద్భవమగు దేశముయొక్క శీతోష్ణస్థితితో సంబంధించి యుండదు. కాని ఆశ్రయవృక్షము మీదను, దానిని నిర్మించు క్రిమిజాతిమీదను ఆధారపడియున్నది. వ్యాపారమందు మాత్రము లక్క రంగు లేనిదే అపేక్షితము. అందుచేత లక్కను నిర్వర్ణముగా చేయుట కనేకపద్ధతులు వెలువడినవి. తెల్లటి లక్క కొన్ని పరిశ్రామిక సందర్భములలో అనగా ముఖ్యముగా కృత్రిమ దంతమును చేయుటలో, వివిధవర్ణములు గల మెరుగు చమురులను (Varnishes) తయారుచేయుటలో మిక్కిలి ప్రాముఖ్యమును వహించుచున్నది.

లక్కయొక్క స్వరూపము :—పై నిరూపించిన యుత్సర్గవాదము నిజమైనయెడల లక్కయొక్క సంయోగము (Composition) ఆశ్రయవృక్షమును బట్టియు, క్రిమిభేదము బట్టియు మారుచుండును. అందుండు

ప్రధాన సంయోజిత పదార్థములు సాధారణముగా మూడు తరగతులుగా విభాగింపవచ్చును. మైనము, కొన్ని మద్య విశేషములు (higher alcohols), వసామ్లములు (fatty acids), అరాళము (resin). ఇవిగాక, హిమద్రవము (ether) చే విద్రావ్యమగు నూనెలు లక్కరంగు గాక దాని వంటిపెట్టుకొని యుండు నొక రంగు పదార్థముండును. దీని సంయోగస్వభావము బెంగుళూరు శోధనాగారమందు డి. ఎస్. గుప్త గారిచే నన్వేషింపబడినది. నూనెలు లక్కరంగు మాత్రము నిజముగా లక్కలోని సంయోజిత పదార్థము మాత్రము గాదు. అది గుడ్లయొక్క శరీరము నుండియు, పురుగుల రక్తమునుండియు జన్యమైనది. అందుచే గుడ్లతో నిండియున్న లక్క [brood lac] హెచ్చు రంగు నిచ్చునదిగా పరిణమించును. లక్క వృద్ధిచెందు కొన్ని కొన్ని వేళలయందు దానితో సహచారియై తేనె [honey-dew] వంటి పదార్థముగూడ గానవచ్చును. ఈ తేనె చీమల నాకర్షించును. చీమలు లక్క పురుగులను బాధించు కొన్ని కీటకముల నాశముజేసి, లక్కపురుగులకు సహకారిగా నుండును. అంతియేకాని చీమలు లక్కపురుగుల బాధించవు.

లక్కను కడుగగా వచ్చు రంగుపదార్థముయొక్క ప్రాముఖ్యము, జర్మనీదేశమునుండి వచ్చుచున్న కృత్రిమవర్ణ (synthetic dyes) ద్రవ్యములచే నశించినది. పూర్వకాలమునందు యీరంగు చాల బహుమానమును బడయుచుండెను. అందుచేత పైజెప్పినయట్లు మన హిందూదేశపు లక్క పరిశ్రమలో ముఖ్యపదార్థముగా పరిగణింపబడుచుండెడిది. ఈ రంగు పట్టుబట్టలకును, ఉన్ని వస్త్రములకు చాల గాఢముగా బట్టును. ఇప్పటికిని కొందరు పటకారులు యీ లక్కరంగునే పట్టుబట్టల కుపయోగించుచున్నారు.

లక్కనుండి తీయబడు మైనము పెట్రోలు (petrol) తో శుద్ధిచేసినయెడల మంచి స్వచ్ఛమైన పదార్థమగును. దీనితో ఫ్రెంచి పాలిషులు, జోడుకు వేసికొను పాలిషులు తయారుచేయబడుచున్నవి.

లక్కయందుండు అరాళపదార్థము (resin) దానియందుగల పదార్థములన్నిటిలో ముఖ్యమైనదని చెప్పవచ్చును. ఇది మద్యములో కరగును. లక్కకు ప్రస్తుత ముండుబహుమానమునకంతటను నిదియేకారణము. దానిని కృత్రిమముగానిర్మించుటకు ప్రయత్నలోపములు లేకపోయినను, చాల దుస్తరముగా గాన్పించుచున్నది.

లక్కయొక్క ఉపయోగములు:—లక్కయొక్క యుపయోగము చాల మెండుగా నున్నది. అమెరికా దేశములో లక్కతో గ్రామఫోను రికార్డ్లు జేయుచున్నారు. అందుచేత మన లక్క చాలవరకాదేశమునకే యెగుమతి చేయబడుచున్నది. ఇంగ్లండులో టోపీలను తయారుచేయుటలో, టోపీలకు కాఠిన్యము నిచ్చుటకు వాడుచున్నారు. దీనితో తయారుచేసిన వార్నిషు లన్నిటికన్న ప్రశస్తతరముగా నున్నవి. ఈ యుపయోగము ప్రాచీన హైందవకాలమునందు గూడ నగుపడుచున్నది. 'ఐనా అక్బరి' అను 16 వ శతాబ్దపు గ్రంథములో యీలక్క వార్నిషుతో రాజభవనమందు తెరలు తయారు కాబడినట్లు తెలియవచ్చుచున్నది. విద్యుదుపకరణములకు పృథక్కరణ ద్రవ్యముగా (insulating material) నుపయోగించుటలో దీనికి సమానమైన ద్రవ్యమే లేదు. ముద్రలు వేయుట కుపయోగించు లక్కలో ప్రధానభాగము లక్కయే. ఇంతయేల, యేసందర్భమునందైన నొకబంధన పదార్థముగాని, స్తంభన (stiffenning) పదార్థముగాని కావలసివచ్చినపుడు లక్క లేనిదే పనికాదు.

హిందూదేశమందు గూడ లక్కయొక్క యుపయోగములు తక్కువగా లేవు. పైజెప్పిన యుపయోగములు గాక, ఏదేని యొక్క వస్తువుయొక్క ఛిద్రములను కప్పి పుచ్చవలసి వచ్చినపుడు, మంచములు మొదలగు వాటియందు లక్కను విస్తారముగా వాడుచున్నారు. రంగుగలలక్కతో చిత్తరువులనుగూడ వ్రాయుచున్నారు.

బంగారు వెండిపనివాండ్రు, వారి నగిషీపనుల యందు లక్క నుపయోగపరతురు. కత్తులను పదునుబట్టుటకు సానరాళ్లుకూడ లక్కతో యిసుకమిశ్రణముచేసి జేయబడుచున్నవి. కాశీయందు తయారగు లక్కగాజుల సంగతి జనసామాన్యముగా తెలిసిన విషయమే. మైసూరు రాజ్యాంగమందుగల చెన్నపట్టణము, విశాఖపట్టణము జిల్లాయందున్న శృంగవరపుకోట, నక్కపల్లి మొదలగు స్థలములు వాటిలక్కపనులచే లోకప్రసిద్ధిగాంచినవి.



4. కస్తూరి తుమ్మచెట్లను లక్కపురుగులు పట్టుటకుగాను కావించెడి నీటి కృషిపద్ధతి
కుడివైపున నీ పద్ధతి ననుసరించి పట్టిన విత్తనపు లక్కగల చిన్న కొమ్మ



5. లక్కపురుగులు నివసించియున్న కొమ్మ



6. లక్కపురుగులను నశింపజేయు రెక్కపురుగు

లక్క-పరిశ్రమను బాగుచేయు విధానములు:—

సంవర్ధనమందును (cultivation), దానిని తయారుచేయుటయందును, శ్రేష్ఠమైన పద్ధతులు ప్రతిష్ఠించుటయు, లక్కను పెంచు దేశము వృద్ధిచేయుటయు దాని వ్యవహారసంబంధమైన సందర్భమును బాగుచేయుటయు యీ మూడును హిందూదేశపు లక్క-పరిశ్రమను బాగుచేయుటకు ముఖ్యవిధానములుగా గన్పట్టుచున్నవి. ప్రస్తుతము హిందూదేశమందు లక్క పండుస్థలములలో ముఖ్యమైనవి, మధ్యపరగాణాలలో కొన్ని ప్రదేశములు, చోటా నాగపూర్, ఒరిస్సా బెంగాలు మధ్యముగా గలదేశము, నైజాము రాజ్యమందు తూర్పు ఉత్తరముల కుండు అరణ్యములు, సింధుదేశము, అసాము మధ్యదేశము, ఉత్తరబర్మా, షాన్‌మాగాణాములు, జయపుర జమీందారిలో కొన్ని భాగములు. ఈస్థలములయందు గూడ లక్క పండించు ప్రదేశము మరింత విరివిగా జేయుటకు, అవకాశము విస్తారముగా నున్నది.

క్రిమివృక్షసంయోగ మీయగలిగినంత లక్కను ఏడాదికి అనేకసారులు సంపాదించుట ముఖ్యోద్దేశముగా గలుగు శస్యతరమైనశాస్త్ర విధానములు. చెట్లయొక్క శాఖలను ఖండించుట యందును, పురుగును ప్రవేశపెట్టుటయందును అభ్యసించుట; ఆడపురుగులు హెచ్చుగా నుండునటుల, పురుగులు ఆరోగ్యదశలో నుండునటుల ఎరువువేయు వ్యవసాయకోపాయములను కనుగొనుట; లక్కయొక్క వృద్ధి కుపకరించు కారణకలాపమంతయు చక్కగా పరిశీలించి, వివిధమైన లక్కపదార్థములను వ్యాకరించి (analyse) లక్కను ప్రమాణీకరించు (standardise) మార్గములను ప్రయోగశాలలందు కనిపెట్టుట; వివిధజాతుల యాశ్రయవృక్షముల మీద వివిధమైన యెరువులతో అన్వేషణములు జరిపించి, కొద్దికాలములో ఫలమివ్వగలిగిన ఆశ్రయములను గనుగొనుట యీ మున్నగు నుద్దేశములు లక్కనుపండించి దానివలననే తనకును దేశమునకును లాభమును పొందజేయుదమనుకొన్న ప్రతి వర్తకుడును, ముఖ్యముగా పాటింపదగినవై యున్నవి.

చెట్లనుండి తీసిన తర్వాత యీ పదార్థమును కర్మాగారమందు బాగుచేయు నవసరమందు శాస్త్రీయ మార్గము నవలంబించిన యెడల, యీవర్తకమందు మెలగుచున్న అనాచారము చాలవరకు తగ్గింపవచ్చును.

ప్రస్తుతము లక్క పండుచున్న దేశములు విస్తీర్ణముగా చేయుటయే కాక మరికొన్ని క్రొత్తదేశములు, క్రొత్త రాజ్యాంగములు, క్రొత్త ఆర్థికసంఘములు యీ వ్యవసాయమునకు పూనుకొనిన చాల బాగుండును. ఈ నూతనవ్యవసాయము అంతమందు బహు లాభకారియైనను మొదట చాల కష్టసాధ్యమైనది. అందు మొదటికష్టము; విత్తనపులక్క (brood-lac) సంపాదించుట. దానికి కారణము; దేశములో లక్కను పండించు అధికారులకు పరస్పరము వ్యవస్థగాని సహకారిభావముగాని లేకుండుటయే. అధికారులు అనుమానావిష్టులుగాక సహకారిత్వమువలన తమకు, దేశమునకు గలుగు మేలు నుద్దేశించి, పరిశ్రమను దృఢపరచి దేశమునకు కావలసిన లక్కవంతయు సర్వకాలములయందు లోపములేకుండ సమగ్రముగా జేసినయెడల లక్కపరిశ్రమకు మహత్తరమైన భవిష్యత్తు కలదు. ఇట్లు సంహత్యుద్యమము జేసినయెడల, మధ్య మనుష్యులు దగాచేసి లాభములు తీయుటకూడ చాల తగ్గును.

కాని యిట్టి యుద్యమము కొనసాగింపవలెనన్న, దానికి పూర్వరంగమందు ప్రయత్న బాహుళ్యము గలదు. మొట్టమొదట లక్క పండుటకు శీతోష్ణస్థితులను బట్టి దేశముయొక్క అనుకూల్యతను నిర్ధారణ చేయవలయును. అనేక ఆశ్రయవృక్షములను పరిశీలించి ప్రదేశమునకు తగిన వృక్షములను పెంచుకోవలెను.

[ఈసందర్భమున శ్రీనివాసయ్యగారు తమశోధనలలో మైసూరుశీతోష్ణస్థితులకును, మైసూరులో పెరుగు లక్కపురుగునకును కస్తూరి తుమ్మచెట్టు (acacia Farnesiana) అతిశ్రేష్ఠకరముగా పనికివచ్చుచున్నదని కనుగొనియున్నారు. ఈకస్తూరి తుమ్మచెట్టు ప్రయోగములయందేకాక బాహుళ్యమందు వ్యవసాయము చేయుటకు కూడ చాల పనికివచ్చునది.]

ఎంచుకొనిన వృక్షము, లక్కయు, శ్రీనివాసయ్యగారి కస్తూరి తుమ్మవలె, వీలయినంత త్వరలో ఫలించునదిగా యుండవలయును. ఈ పై జెప్పిన విధానములన్నియు మనసులోనుంచుకొని పరిశ్రమవిషయమై కృషిసల్పినయెడల, యీ పరిశ్రమయొక్క భావి ఉత్కృష్టతకేమియు భంగము కలుగనేరదని యీ వ్యాసరచయితయొక్క దృఢవిశ్వాసము.

# గ్రాంథిక వ్యావహారిక భాషా వివాద తారావళి

త్రిపురాన వేంకట సూర్యప్రసాదరావు దొరగారు.

శ్రీ ఖంచునొదలం జెరువు క్రొన్నెలపూవు, చెలువారు లేఁత వెన్నెలలు గాయ
వెలిదామరలకు విందులు సేయు కన్దోయిఁ, గరుణాకటాక్షవీక్షణము లొలయ
నాల్గుహస్తములవీణాలతాపుస్తక, స్ఫటికాక్షమాలికల్ పరిఢవిల్ల
స్తనగళత్సంగీత సాహిత్యరసమయ, క్షీరముల్ సుతుల నోరూరఁజేయ

ఆ. దమ్మిగద్దెమీఁద నెమ్మిఁగొల్వయి మహా, దరము వెలయ దివ్యదర్శనమ్ము
మాకొసంగుచున్న మాతల్లి నీకివే, వందనమ్ము లాంధ్రవాఙ్మతల్లి!

ఆ. "దేశభాషలందుఁ దెలుఁగులె" స్సని మహా, రాజనుతులుగాంచి ప్రబలు నీదు
పతులభాగ్యవతికి సుతులమైతిమి మాకు, నింతకంటెఁ బెం పిఁకేమిగలదు?

చ. విరిసినపూలమెత్తనయుఁ దేనియతీపును బండువెన్నెలం
బరఁగిన తేట గప్పురపుఁ బల్కుల చల్లని తావి గల్గి పె
న్మురు వెసలారఁగాఁ గరము ముద్దులుగుల్కెడు కల్కిపల్కులన్
మురిసెడు నీదుగర్భమునఁ బుట్టిన యాంధ్రుల భాగ్యమెట్టిదో!

శా. మాయమ్మా! నిజపుత్రకుల్ గలసి యెమ్మాడ్కిన్ నినున్ బెద్దగాఁ
జేయంగల్గునొ యంచుఁ బెక్కుగతులం జింతించుచున్నారు నీ
శ్రేయోవృద్ధికి నేది మంచితెరువో చెప్పంగదే దేశభా
షాయోషామకుటీమణీమయవిభూషా! యాంధ్రభాషాసతీ!

చ. కడుకొని నీదు పెంపునకుఁగా నిది యా నిది గాదటంచు నీ
కొడుకులలోన నొండొరులకుం దగవుల్ ఘటియిల్లెనమ్మ! నీ
యెడ నెడ భక్తిలేనిసుతు లేరును లే రిరువాఁగునందు నే
వడువున నింక వీరల వివాదములం దొలఁగించి ప్రోచెదో!

---

* తెనాలిలో జరిగిన యాంధ్రసాహిత్య పరిషత్త్రయోదశ వార్షికోత్సవసభలోఁ జదువఁబడినవి.

సీ. నిను వేల్పుబాసతోఁ బెనఁచి ప్రోడను జేయు, నన్నయ్యకవినాథు డెన్న హితవొ
జిలిబిలిముద్దుఁబల్కుల నేర్పి నినుఁ బెంచు, తిక్కన్న సుకవీంద్రు శక్తి హితవొ
సూక్తివైచిత్రిచే సొబగునించి ప్రసిద్ధి, గావించు నెఱ్ఱన్న త్రోవ హితవొ
కమనీయగజరాజగమనమ్ము గఱపి నీకు, దగఁ బ్రోచు శ్రీనాథుదారి హితవొ
తే. కోమలశిరీషతులిత సుధామయోక్తి, పంపదలఁగూర్చు పెద్దన్న సరణి హితవొ
కాక యీనాఁటి గ్రామ్యోక్తి కలన హితవొ, చెప్పవే తల్లి! యేమార్గ మొప్పు నీకు.

ఉ. నన్నయముఖ్యపూర్వకవినాథులు సొంపులు దిద్ది గ్రామ్యతా
పన్నతఁ బాపి నిన్నుఁ జెఱబాస వెలందులలోన నెంతయుం
మిన్నగఁ జేసినా రదియు మేలనుకొంటిమిగాని దాన నీ
కున్నతి గల్గదందు రిది యొప్పునొ యొప్పదొ నీవ చెప్పుమా?

సీ. పరమపావనకథావిరచనాకలనమై, మనసు రంజించు రామాయణమ్ము
తత్త్వరసములందుఁ దన్మయత్వమ్ము నా,పాదించు శ్రీమహాభారతమ్ము
ముక్తినిధానమై భక్తిరసావేశ, పరవశత్వముఁ గూర్చు భాగవతము
శ్రుతిపర్వమై ప్రౌఢకృతిసంతతికి శిరో,భూషణమై యొప్పు నైషధమ్ము
తే. మొదలయినపూర్వకృతులలోఁ బొదలుభాష, ప్రాఁబలుకు బాసయుం బోలెఁ బ్రోఁతపడియెఁ
బనికిరా దది యీనాఁటి ప్రజల కందు, రకట! కొంద ఱీవేమందు వంబ! చెపుమ.

తే. అతులితాధ్యాత్మరామాయణాదికృతులు, నందనులచేతఁ బాడించినావు తొల్లి
యిపుడు కటకట "మెట్టినా మొంకి" పాట, నీకు నింపయ్యెనే యాంధ్రలోకజనని!

ఆ. దినదినమ్మొకొక్కతీరుగా మాఱుచు, దారి తెన్ను లేక నోరికొలఁది
వాడఁబడుచునున్న పలువేసముల బాస, తల్లి! కైఁతలకును దగునె చెపుమ.

ఆ. బ్రదుకు దారవోసి పాశ్చాత్యభాషైక, పాండితిం గడించు ప్రౌఢులకును
గొన్ని నెలలు నిన్నుఁ గొలువ నోపిక లేదొ, మాత! నీదు రూపు మాపనేల?

తే. పండితులు మాటలాడెడు భాషలోనఁ, గైఁత సెప్పుట లోకోపకార మండ్రు
పామరుల బాస చేసిన సాప మేమి, మాత! యదిగూడ నుద్ధరింపంగఁ దగదె?

క. ఇద్దానికి దగినట్ల మఱి, హద్దుండునె యిచ్చవచ్చినట్టులు మార్పన్
ముద్దులుగులికెడునీదగు, సుద్దులు చెడిపోవె నియమశూన్యము లగుటన్.

ఆ. కన్నతల్లి పీచు గావంచు నీపద, సేన లింక శవము సేవలంచు
మఱియు నీదు రూపు మాఱిపోయె నటంచు, నిందు నందు దూఱుచుండు రకట!

మ. అవునో మాఱవె నీవునుర్వ నిజము గాదా లేదనర్వ వచ్చునే
కవివర్యుల్ నిజకావ్యసంతతులఁ దత్కాలమ్మునం గల్గు న
వ్యవహారోక్తులు సంస్కరించి కయికోరా దాననే నీకుఁ బెం
పవుఁగా కొక్కటఁ బుట్టిమున్గినటు కట్టా! యిట్టిమార్పేటికో?

శా. స్వాతంత్ర్యప్రియులయ్యుఁ దిక్కనముఖుల్ ప్రాచీనమార్గమ్మునం
జేతఃప్రీతి దలిర్పఁ గైతలను దేశీయోక్తులం గూర్పరే
యాలి రొప్పదే? మాటలాడుకొనుచున్నట్లుండవే యానుడు
ల్మాతా! దీనికి లేనిపోని తగవేలా నీవ యూహింపుమా!

ఆ. తొంటిదారి మార్చ దొరకొన్న నీసుతుల్, వ్రేలు సూప మండ విఱ్ఱఁగాఁజూతు
రదియుఁగా కొకింత బెదరులే కెద నీదు, కొలుపు సేవగించుకొందు రకట!

క. నట్టన మునుతమపట్టిన, పట్టు విడువలేక విపిని పలుదెఱఁగుల నిర్
దిట్టలయి సభలలోఁ బడఁ, దిట్టుదురట కొడుకు లెంత తెంపరితనమో?

సీ. పువుఁ దేనసోనలై చెవులపండువు సేయు, కలికిపల్కుల ముద్దుగులుకు నిన్ను
నియతి దప్పక కృతిక్రియల మెప్పులుగొన్న, యిల్లాలవై యుల్లసిల్లు నిన్ను
నాచంద్రతారార్క మనని నిల్చెడు మహా, కవులైన కొడుకులం గన్న నిన్నుఁ
బ్రణుత విద్వత్కవిప్రభువర్యులగు నేల, మన్నీండ్ర మన్ననల్ గొన్న నిన్నుఁ
ఆ. "చెవులుగదిరి త్రుళ్లి చివుకులంజియయయి, త్రెళ్లె" ననిమెఁ బ్రాఁత తెనుఁగుఁగవ్వ
జనని సాధ్వి! నిట్టు లనఁగూడునే వింటె, కొడుకునుడులు చెప్పికొనిన సిగ్గు.

ఉ. భారతి కిల్లునాఁబరఁగి పండితపామరహృద్యమైన యా
భారతభాష నచ్చనని పల్కిరి పాపము శాంతమాత మీ
పై రచియింతురో మరల భారతమున్ వ్యవహారభాష నే
డీ రచియింపరాదె యది యెట్లు రుచించునో చూత మంబరో!

ఉ. చీటికిమాటికిన్ నిను నినీ యనుచున్ వెలయాలవంచుఁ దా
టేటికి దూఱఁగావలె నదేపనిగా నిది యేటినాయ మీ
పాటి భవత్తిరస్కరణపద్ధతి మాని సుబోధమంచు ము
మ్మాటికిఁ దారుమెచ్చెడు సమంచితభాష నె కొల్వరాదొకో!

ఆ. పుట్టగొడుగు లెన్ని పుట్టవో గిట్టవో, కట్టులేని బాసఁ బుట్టుకృతులు
గాలి కెగిరిపోవుఁగా కవి నిల్చునే, భారతాదికృతుల పగిది జగతి.

ఉ. భారతముఖ్యసత్కృతుల పద్ధతి నాఱడివుచ్చి యిచ్ఛమై
నోరికివచ్చినట్టులు సినుం గృతులన్ వికృతస్వరూపగాఁ
గూరిచి వాడఁజొచ్చి రిది గూడదనా విని మానువార లె
వ్వారును గారు కాల మనివార్య మిఁకేగతి మాఱిపోవునో?

తే. ప్రకృతిమాఱెఁ గాలము మాఱె భాషమాఱె, మంచికో చెడ్డకో యిట్టిమార్పువచ్చె
మాన్ప నెవ్వరికిశక్య మీ మార్పు తుదకు, నంబ! నీకు శుభోదర్క మగునుగాక.

ఉ. కన్నులుమూసి పెన్గడుపుకక్కఱతిం బెఱబాసఁ గొల్చుటన్
మున్నటిదౌఁక నీదగు సమున్నతి యేగతిఁ గల్గునట్టులం
బున్నదె నీదుపుత్త్రుల కహో! యదియిప్పుడుగల్గెఁ దావకా
భ్యున్నతిసూచక మ్మిదియ పో యెటులైన శుభమ్ము నీకగున్.

సీ. సంస్కృతాంధ్రాంగ్లేయసారస్వతానూన, విజ్ఞానసంపత్ప్రవీణమతులు
సామాన్యదుర్జ్ఞేయసకలభాషాతత్వ, సారసంగ్రాహకళాసంగరతులు
ధారాళవిమలవాగ్ధాటీరమాతోషి, తాశేషవిద్వజ్జనాభినుతులు
భాషాంగనామణిభూషాయితవిచిత్ర, కల్పనాకల్పితానల్పకృతులు
తే. గానిసర్వసాధారణుల్ గారు సూవె, యిరుదెఱంగుల నినుఁగొల్వ నెంచువారు
వీరినొండొరు నేకీభవింపఁజేసి, మంచిదారిని నడపింపు మా మదంబ!

ఆ. ఉభయవాదులకును నుల్లమ్ములందు నీ, హిత మిదంచుఁ జక్కనెఱుఁగఁజెప్పి
యీసు లుడిపి కలపి నీసేవ సేయించి, ప్రోవునొంది మమ్ముఁ బ్రోవు మంబ!





# కొన్ని కాకతీయ శాసనములు

మానవల్లి రామకృష్ణకవిగారు, యం. ఏ.,

## ౧

ఈ క్రిందిశాసనము కాకతీయ రుద్రమదేవి పరిపాలించుచుండ నామెక్రింద సైన్యాధిపతియగు మల్యాలగుండ దండాధినాథుని భార్యయగు కుప్పమాంబ హైదరాబాదునుండి పవపత్తికిఁ బోవుమార్గమున "బూతుపూరు" అను గ్రామమునకు సమీపమునఁ గట్టించిన గణపవరములోనఁ దటాకము నిర్మించి యందు వేయించిన ప్రశస్తి కావ్యము. దీనిలోఁ గవితావిశేషములు పెక్కులుగలవు. ఇది నల్లఱాతిపై నాలుగుముఖములను లిఖింపఁబడినదైనను మొదటి ముఖములోన మల్యాలగుండ దండనాథునిగుఱించి తెనుఁగున వచనరూపముగఁ బ్రశస్తియున్నది. తక్కిన మూఁడుముఖముల నక్షరములు చిత్రకవితావిశేషసూచకములు. ఈ శాసన మీక్రింద నామూలాగ్రము యథాలబ్ధముగాఁ బ్రచురించుచున్నాము. ఈ శాసనమునఁ గ్రిందిభాగమునఁ బద్మబంధము రేఖారూపముగా లిఖింపఁబడియె. దానిని మాత్రము శ్లోకరూపముగానుద్ధరించి దానిలో నంతర్గతమగు గోమూత్రికాబంధశ్లోకమును వేఱుగా వ్రాయుచున్నాము.

### మొదటి ముఖము.

శ్రీస్వస్తి సమధిగత పంచమహాశబ్ద మహామండలేశ్వ
ర అనుమకొండపుర వరాధీశ్వర మూరురాజజగడాళ
విదితవిక్రమశీల పరమమాహేశ్వర వీరలక్ష్మీనిజ
శరీర చలమర్తిగండ కదనప్రచండ శ్రీస్వయంభూ
దేవదివ్య శ్రీపాదపద్మారాధక పరబలసాధక నామా
దిసమస్త ప్రశస్తిసహితం శ్రీమన్మహామండలేశ్వర కా
కతీయ రుద్రదేవ మహారాజులు ఓరుంగల్లు
......గా సుఖసంకథా వినోదంబులం
(పృథివీరా)జ్యంబు సేయుచుండంగాం దత్పాదప్రసా
......క్ష్మీ సమాశ్లిష్టదక్షిణ భుజదండుండును
......కొండుండును పంకిప పురాధినాథరి
......ండును పెదమట్టు గండండును బా
......కీర్తిజ పారావారసంజాత హరిచందను
......వరూధినీశ వరనందనుండును కుప్పాంబా
మనఃసరోవర విహారమాణ రాజహంసుండును నిజ
గుణ...ండును శ్రీవిశ్వనాథదేవ దివ్య శ్రీపాదపద్మా
రాధకుండును రిపుకుల భేదకుండును నైన శ్రీమ

సత్కావ్యాలసుండ దండాధీశ్వరుండు మంత్రిపురోహిత సే
నాపతి దౌవారికమహాప్రధానానంత సామంతసుభట
విటవిదూషక పాఠక పీఠమర్దన నట నర్తక రాజ కరంజకకవిగ
మకవాదివాగ్మి వందిస్తై తాళికహేళక భావక గాయకా
ద్యనేక విద్వజ్జనంబులుం గొలువ సుఖోప విష్టుండై యి
ష్టకథా వినోదంబులనుండి పాణినీయ వ్యాకరణ విచిత్ర క
విత్వ తత్త్వజ్ఞుండును పదక్రమయుత యజుర్వేదపారగు
ండును నాత్రేయగోత్ర పవిత్రుండును మయూరాచార్య
పుత్రుండునూ నైన ఈశ్వర సూరిం గారుణ్య దృష్టింజూచి శ
కవర్షంబులు ౧౧౦౮ వర్తింపం గాను ఆంగిరస సంవ
త్సరాన బూదుపూరి సమీపంబునం దనస్వామి గణప
తి దేవమహారాజు పేర తటాగంబు నిర్మించి అశ్రా
వణశుద్ధ ౧౫ బుధవారాన సోమగ్రహణకాలము
ందు అత్యంత సంతోష సమాహిత చిత్తుండై సత్కార పూ
ర్వకంబుగం గులశీల విద్యాతపస్వంపం నులైన బ్రాహ్మల
......డోపరహితంబైన ఈ గణపసముద్రము వెన
.. ...చంద్రార్కస్థాయిగాను వృత్తులు ఇచ్చి తన్మర్మ స
......ర్థంబై సకల లక్షణ లక్షితంబుగాను
......సంబు చెప్పించినం దత్ప్రారంభం బెట్టినదివ.

రెండవముఖము. (సంఖ్యాపంక్తినిసూచించును)

1. శ్రీబాహాబహుళరాగకారిరుచిర క్రీడాకరశ్రీకర
2. శ్రేయశ్శ్రేణిమరంక పిష్టపరమాంయుషాక్షవిలాశ్రీయ...,
3. ... మిర్మద్రప్రక్రీడను డంబరాంబర పర ప్రాచుర్యచర్యాతుర
4. క్షీరాపారగభీరకూబరపయోరాశిప్రకాశాశయః॥
5. నిర్దంత్యము. 1. పోత్రీధా త్రీసలీలోద్ధరణపరిణత శ్రీధరః
6. పాతుయూష్మా న్య (?) ష్టస్యోమ్నక్షణోద్ధశ్యసవపరిహృతాపారనీరప్ర
7. పూరః। యద్దంష్ట్రావిందలగ్నా క్షితిరతిలసతిప్రస్ఫురద్గ
8. ర్వాపప్రక్రీడాసంసక్తరేణు శ్రియమియ మురరీకు (ర్వతీ)
9. పర్వతాం శా॥ (2) ఇది ఆర్యాగర్భము॥ ఇందుల ఆర్య॥
10. లసతి ప్రసరతి తారక్రీడాలోల ప్రకారసంనీరే। శ్రీ ...
11. స్ఫురదలిసోష్మాధా త్రీధరపరవరః పోత్రీ॥ ఈశతే కురు
12. తేనూతే ఖ్యాతియాలివిపద్యతే। నీయతేద్యోతతేఒత్యేతి కీర్తన
13. యుత్యధికాయతే. 3. క్రియాపదభ్రామకము॥ అస్తుభూ
14. యాన్నమస్తస్య జగతో మంగళం శివం। జనోజంతుకతో
15. నాతితరస్తస్మాదితో గతః॥ (4) పునరుక్తాభాస॥ హిరణ్యగర్భః ప్ర

16. థమం మురారి గభీరవార్ధే కమలాద్య భూవ । మరీ (చిను)
17. భాగ్యనవలేశపోఽపి తస్యాగ్నిర్బభూవుః ప్రథవాః (శః) ప్రజానా (మ్ । ర)
18. తోఽభవన్మా సురసత్త్రభా వా వర్ణా స్సువర్ణాః వరపుణ్యార్హ కామాః
19. లో కప్ప్ర కామ స్వకధర్మ్య కర్మైః రక్తాః కలాలోల మనోఽమ భావాః॥ (5)
20. నిస్తాలవ్యము ॥ కలౌయుగే కాకతిరాజ వంశో విశాలకీర్తిః కీ
21. తిపాన్వరోపు । తత్ర ప్రిపిరాజా మహాదేవ నామా జాతోఽంధ్రదేశ
22. ంపమలంచకార ॥ (6) తస్యాత్మజస్య క్షితిపాన దక్షస్య ధా స్వ తేక
23. మ్యాణాం గమణామాలే । సుతస్సమాసీ దసమానభూతి ర్వ్యాపా వల్ల
24. భః శ్రీ గణపాభిధానః ॥ (7) శత్రూనాశు కిపేన. పిరనిరతా స్బంధూ
25. న్పపోషాత్మజా న్దారేష్వేవతు తోష. నిత్యవిలసం నితోఽన్యత్ర మేషా (ఠ)
26. ని । సౌందర్యాణాంచ మునిమోప. శంబరరిపో ర్విజేత్వం విజేమ. తిగ్మా
27. (స) ద్ధర్మాణాం విశేషే పః పరహితం తోషాదిరేష ప్రభుః॥ (8)
28. తద్ధాత్రీజ భువి సద్బుద్ధి ముద్ర్ధి రుద్రి పహీపతో । అస్మి న్విస్మిత విక్రాన్తం
29. తా సుకీర్తిం (మూర్తిం) ప్రకాశతి ॥ (9) ని రీతి నీతేషు ప్రీతి భూరి భూ
30. తి సతిద్యుతి । సుధీనిధి ధృతి మ్మాపత్రిణా శ్రీ సూతి భువి నిద్విణా పి॥ (10)
31. నిమ్మాంత్యము ॥ తదీయపాదాంబుజ షట్పద తీవి మల్యాలవం
32. శకమలేక్షణాంశః । దిగంత విశ్రాంతయశో విలాసః శ్రీచన్న
33. సేనాధిపతిః ప్రసూతః॥ (11) తస్మా దభూ దతుల భావితపుణ్యమూ
34. ర్తిః శ్రీ బాచసైనికపతిః ప్రథితప్రభావః । ఉద్దామరాయ గరుడ
35. ధ్వజ వీరలక్ష్మీ లక్ష్మీకృమారల సురక్షణ నిత్య దక్షః॥ (12) తస్యా దస్యాన
36. భాసీదరికరిరఘినీ నాథయూథ ప్రభేద క్రీడా గాథ ప్రరూఢ ప్రబ
37. లపరిలసద్ధామ సంగ్రామ భీమః । ప్రాచాం వాచాం విచా
38. రే స మధిక చతురశ్చారు సంచార కీర్తి ర్వ్యాప్తో చక్రే గండ సే
39. నాపతిరతిరసి కస్సచ్చరిత్రైః కమిత్రైః ॥ (13) సా భారతీ నియమితా రస
40. నాగ్రే భాగే సా కోమలాద కమలానయనాంచలేచ । సా నిమ్మాణ
41. లా లలిత తత్వ కలా విలాస లీలాకలాప కలితా ఖలు యేన (చిత్రే 14)
42. సర్వాత్రి సంతతం సాయ మతాపి స పతిస్సపతి స్వయం । అవశ్యం
43. యాతి మా నావం సహాసా స్వః స దా సమం ॥ (15) అవ్యయా
44. భాసః తను తే తనుతేరాయం విద్యతే విద్యతేరపి । రాజతే
46. రాజతేయం భూ భరతే భరతే శతా ॥ పాదాదియమకం ॥ (16,

## మూఁడవ ముఖము

1. శ్రీమ న్నృత్త శరాసనాదికరణే కర్ణాటపుణ్యోర్జసా వీరం
2. మన్యసమాజసేవణపతే సంగ్రామ రంగస్పృహాం । ధాటీం లా
3. ట నృపాటవీ మనుదినం గంటం మతిం మా భటై రుద్యద్గుం
4. డయదండనాథ విల స ద్దోర్విణ క్రీడా నిర్మమః ॥ (17) క్రియాప ద త్రి

5. య గోపకము ॥ శ్రీ గోనకుల దుగ్ధాబ్ధి జాతా సహజ చంద్రికా।
6. శ్రీరి వ శ్రీప తేయ్యస్య శ్రేయసీ రుప్యమాంబికా॥ (18) సా హాం
7. చక్రే దిశానా మహామహామికయా వ్యాప్యవైస్తైస్తుతోఽపః (తో)
8. యస్సారంగజో హైః రతి కవినికరా స్సంప్రహసా జగా
9. ...ప్టావస్థాతినాం రతి మిహ కృతినాం కువ్వతే స్వస్వతోఽపిక్
10. ...జీ విశ్వే ద ప్రకటిత యశ సో యస్య వేం సే ర తస్య ॥ (19) ఇందు రి...
11. ఖాః పదాలు ఆబు ॥ య దీయ చాతుర్య్యణ కృతో తి పర్య్యణ
12. పర్య్యణ ప్త మాధుర్య్యణ కరాంబు చయ్యణః। అహోర్య్యణ ధైర్య్యణ
13. బుధ పుణ్యణ వాయ్యణ మర్యాద్యణ ద సౌదయ్యణ కర ప్రతాపః ॥ (20) ప్రబల
14. వళి॥ కలిత లలిత సార స్ఫార వారి ప్రసారి ప్రమద సమదలోక
15. స్తోక గణ్యపుణ్యః। జలజసహజరంగ ద్భంగ రాజీ విరాజీ విపు
16. లవిమల తుంగరంగ దాలి ప్ర శాలీః ॥ (21) మిశ్రవాపళి ॥ కవయ తిక...
17. పౌ సమ్యగన్వదః ప్రభుతామితో గణపజలధే స్తారం నీరంకి
18. వ సుశీతలం। అమృతరుచిరం పీత్వా నూనం చకోర గణాః ప్ర...
19. యదధిక రుచిం సాంద్రానం దాం త్యజేదపిచంద్రికాం ॥ (22] శేదా రా
20. రతశాలి శాలిజన తా చేత స్వదానంద కృతాన్వరాకారనిరంతర నీరజర
21. జప్పంచార చదజ్జలః, సైజాధిక ఫలీల సాగరస దా హుంకార శం
22. కాకరాః కీర్తిం యస్య దిగంత సంతతి తతాం తంతన్యతే యం సదా ॥ (23)
23. నిరోష్ఠ్యము ॥ తడాగోఽసౌ సదా సేతుసరణిం తరలైరపి। స్వసార (మి
24. వ సంసారీ వ స్సల తే త్యాజిన్యక్షపాణిభిః॥ (24) అంతస్నిగ్ధ రంతస్థితపద్మపన్మపద్మా
25. లయాం దిత్సు రిపోత్సు కోఽసౌ। తరంగహస్త్రై గ్గగనాంబు రా
26. శేః ప్రకాశయ న్విష్ణుపదం చకాస్తి ॥ (25) బుధపురవరస్ఫారా పార
27. ప్రచారముదాకరైర్గగన జలధిరంగత్తుంగై స్తరంగ కరై రసౌ।
28. కుతుక ఇవ తాం ప్రత్యు ద్యాతుం ద్యులోకతరంగిణీం గగన
29. మలం శేషి ప్రాప్య ఘప్ప క్లిష్ట చలజ్జలః ॥ (26) కమలావాసిత తనుః కమలా
30. వాసితా తనుః। కమలావాసి లలితః కమలావాసి లాలితః ॥ (27)
31. అక్షర ముష్టి క ॥ పురతః ప్రభురాచార నీరపూరేణ దూరతః।
32. ...గీవగణ పాంభోధిః ప్రత్యుద్యాతి ప్రియా నదీః ॥ (28) పద్మాతు...
33. ద పృథ్వ్యాబ్ధి సమాసాలి సమన్వితః। నదీపూరణ సంపూర్ణా ణాః పా
34. ణి పీయూయ తే దయః ॥ (29) కాంతోపాంత సుజాత మాతవాస ద్వి
35. వ్యాస వన్యామిళి త్ఫుల్లత్పల్లవ సంచలన్వి కసుకస్తో మైస్తుతి స్తాయతే।
36. (య) శ్చా కాంత వికాశమాన మహిమావాసైక లీలాలసద్వైశద్యద్యుతి వీచి
37. సూచితయశసో యస్యాతిశస్యాత్మనః ॥ (30॥) నిరూష్ఠ్య ణ్యము ॥ అస్యశస్యత
38. డాగ స్య కర్తుణ గ్గణాండ చ మూప తేః। దిశో దశ యశో రాశి రాశిషి
39. ష్ట సదాశిపా ॥ (31) విదుషీపామలం విద్య ద్వి దోగ్గణం దయశోపహా। తనస్య
40. సకలాంనారీ నంగనేషు నఖిశు త్రైః ॥ (32) అపశబ్దా భాస ॥ ఈశ త్రైపాన భో భో

31. (వ) ధాద యే హ భువోగుణః । రోద్ధామోఘు పదో నాథ కళోరక్షితా
42. జడ॥ (33) అనా వృతాశుకము॥ శాకాబ్దే యుగవండళం కర విలే వర్యేణం౭౫రోవ
43. త్సరే మాసే శ్రావణనామకే బుధ దినే చంద్రోప రాగే సతి । సోయం
44. గుండ భవూపతిః కతిపయ క్షేత్రాం లిడాగేధికే
45. శాలేయం ల షదితు శాకట మదా త్త త్రి ద్విజే భోక్ష ముదా॥

నాల్గవ ప్రక్క

1. శ్రీ మన్మల్యాలగుండ దండా ధీశ్వగుండు ఈ గణప సముద్రము (నందు)
2. బ్రాహ్మణులకు ఇచ్చిన క్షేత్రము । భరద్వాజగోత్రులైన సోమనాథ భట్టో (పా)
3. ధ్యాయులకూను...భట్టో పాధ్యాయులకును సర్వేా ప్రాయశ్చిత్తా ర్థ
4. ంబైగో చర్మ్మణము నాలుగు మఱుతులూను అడ్డ । ఆసోమనాథ భట్టో పా
5. ధ్యాయులకు ఈ చెఱువు ప్రతిష్ఠాచార్యదక్షిణ అడ్డ । హారిత గోత్రులైన బొమ్మక
6. ......యంగారికి చాతుర్మాస్య నిత్యభూదా న(వ్ర)తానకై ఇను మ
7. ......ఆసూరదేవపూరిం గారికి మఱుతులుం బాది
8. ......కుంబుణ్యముగాను గౌతమ గోత్రులైన దేవరే
9. ......(మ) అుతుంబాదిక । అడ్డ । ఆయి అక్కన ఘటశాను
10. ......జగోత్రులైన కేశవ ఘటశాసులకు ఉభయము ఖ ద
11. ......తులు । కామకాయన విశ్వామి త్రిగోత్రి లైన సోమ య
12. ......టింగారికి సేతు దర్శనమున్ను సముద్రస్నానమున్ను చేయించిన దక్షి
13. (ణ) మఱుతులు । శ్రీ వత్సగోత్రులైన ఆలేటి పోతమ ఘటశాసులకు లేమ
14. శ్రీపర్వతప్రదక్షిణము సేయించిన దక్షిణ ముప్పాదిక । భర
15. ద్వాజగోత్రులైన పురాణము ప్రోల్లెన పెద్దింగారికి అలంపూరను త
16. మ్లైకర్కాటక మాసానను తుంగ భద్రలందు స్నానాలు సేయించినద
17. క్షిణమఱుతులు । కౌండినకులో త్తంసులైన పరమతేజ్వజ్ఞ నారాయణ
18. మంచెవంగారికి అడ్డ । లరణికంటి ఈశ్వర భట్టోపాధ్యాయులకు మఱుతు
19. లుంబాదిక । ఏవం ప్రార్థిత వానత్వా భావిన స్సర్వ భూపతీన్ । య...
20. రనిశం యత్నః క ర్తవ్యం ధర్మరక్షణే॥ శత్రుణాపిక్ళ తో ధర్మః పాల
21. నీయః ప్రయత్న తః । శత్రురేవహి శత్రుః స్యాన్న ధర్మః శత్రు న్న కస్యచి
22. త్॥ స్వ దత్తా ద్వి గుణం పుణ్యం పరదత్తానుపాలనం। పరదత్తాపహారే
23. ణ స్వదత్తం నిష్ఫలం భవేత్॥ స్వదత్తాం పరదత్తాం వా యో హరేత వసు
24. ంధరాం। షష్టిం వర్ష సహస్రాణి విష్ఠాయాం జాయతే క్రిమిః॥ శ్రీ.




ప్రథిత సత్కుల ధవాచయనయ్యాణా సుతోల్లస | ద్యుదిత తత్త్వాకర కౌశల పీరయ సూరిణా
లిఖిత మన్నుత కవీశ్వర భాషిత శాసనం | లలిత కౌతుక రస ప్రథితోషిత వాచకం
శ్రీజభోజ భజన్నై ౨ జగుం జద్విజగ జప్రజ | అజరాజ డజన్యాజ ధీజరాజయజన్యజ॥ (గోమూత్రి బంధము)

నాల్గవ ముఖమున పద్మబంధము క్రింద

1. ఈపద్మబంధమునందు శ్రీగుండయ అనెడి నామమున్నది | ఈశ్లోకము రెండు గో
2. మూత్రికలు | ఈ రెండుం గూఢజాలబంధము | ఈపద్మ వృత్తమునందు వ్రాసినది
3. గూఢ చతుర్థ్థపైన పద్మవృత్తము | ఇది సదివి (వు) క్రమము | ప్రామొదలు గాను రేకులథు
4. దుల అక్షరాలు మొదలిపాదము | ద్వి మొదలైన మొదలి అక్షరాలు రెండ
5. వ పాదము | లి మొదలైన రెండవ అక్షరాలు మూండవ పాద
6. ము | నాలవ పాదము యీమూం డుపాదాలందున నున్నది
7. ఈపాదము లలిత కౌతుక రస ప్రథి తోషిత వాచకం॥



# శ్రీ వేంకటేశ్వర స్తవము

(మునుపటిసంపుటము తొమ్మిదవ సంచిక తరువాయి)

మండలేముల వేంకటశాస్త్రి గారు, బి. ఏ., యల్. టి.

ఏమివిచిత్రమో? యెఱుఁగ; మెల్లప్రపంచము మోహబద్ధమై
పామర వృత్తిఁబొల్చు; క్షణభంగురవైభవ మొందఁగోరి ప్ర
జ్ఞామయు సర్వరక్షకు మనమ్మున నిన్ భజియింప శాశ్వత
క్షేమము గల్గునంచుఁ బరికింపరు మూఢులు; వేంకటేశ్వరా!

చ. తనయుఁడయమ్మునన్ గడుముదమ్మును బంధుగు లొందువేళ బో
రని పసికూన యేడ్చు నకటా! కలుషంబగుజన్మ మెత్తినా
ననుచు; శరీరమున్ విడచి యాప్తులు గుందఁగ శాంతచిత్తుఁడై
చను నినుఁ జూచువేడ్క నిట జన్మము దీరఁగ వేంకటేశ్వరా!

ఉ. నిర్మలమైనచిత్తము ననిందితబోధము నొందఁగల్గియున్
కర్మనిబద్ధమై వెలయు క్ష్మాస్థలి జన్మము నెత్తియుండి స
ద్ధర్మములెల్లఁ బోవిడిచి దైన్యమునన్ జనుచుంటి మక్కటా!
కర్మమహోదధిన్ బడి; జగన్నుత ప్రోవవె? వేంకటేశ్వరా!

చ. అకలుషచిత్తవృత్తుల మహాత్ములఁ బుణ్యుల సచ్చరిత్రులన్
సుకృతుల భక్తులన్ గరుణఁ జూచి గతాయువులై చనంగ నీ
వకట! యనుగ్రహింతువు; చిరాయువుఁ గాంచి మనున్ ధరాస్థలిన్
బ్రకటిత దుష్టచిత్తుఁడగు పాపి యదెట్లగు? వేంకటేశ్వరా!

చ. అరయ నధర్మవర్తనుల నందరి నుక్కడఁపంగ సద్గుణా
భరణులఁ బుణ్యవర్తనులఁ బావనమూర్తుల నుద్ధరింప; భా
సురతరమైన ధర్మపథసూత్రము నిల్పి యనుగ్రహింప నీ
ధరణికి నేగుదెంతువుకదా? యపుడప్పుడు వేంకటేశ్వరా!

చ. మనుజుఁడు జీర్ణవస్త్రముల మాని నవీనములన్ గ్రహించి హె
చ్చిన విభవమ్ము నొందుగతి జీర్ణశరీరములన్ త్యజించి నూ
తనములఁ దాల్చి యాత్మవిదితంబగు తేజము నొందు దీనికై
మనుజునికేల? రిత్తయభిమానముఁ బూనఁగ వేంకటేశ్వరా!

గరమందున్ సుఖనిద్రఁ దేలె; నపు డొక్కండేనియున్ గాని
మా కరయన్ రాదుగ; నెంటనంటిచను ఛాయాకింకరుండున్ వినా.

మ. దినమెల్లన్ నిజకుక్షిభారభరణార్తిన్ దేలుచున్, బీద లెం
దునవో, కూలియొ నాలియో సలిపి, మేనుల్ స్రుక్కఁ బ్రొద్దుండునం
తనె వేపంచనొ చేరి, గుజ్జులిడి నిద్రన్ మున్గి తేలాడ, వా
రిని నందందునఁ గాంచుచున్ జనితి మా రేయిన్ బ్రమోదంబునన్.

శా. శ్రీరాజన్నిజకేళికాగృహా రహఃక్రీడాపరీరంభ సం
చార శ్రాంత వధూవర ప్రలపితా స్పష్ట ప్రియాలాప సం
భారంబుల్ చెలరేగె నొక్కయెడ; స్వప్న భ్రాంతులౌ వారి ఫూ
త్కారాలాప పురస్కృతార్భటులు, వేడ్కన్ గూర్చె మా కొక్కటన్.

గీ. తదితరానేక చిత్ర చిత్ర ప్రపంచ,సరణిఁ గనులారఁజూచుచుఁ బురముదాఁటి
యల్లనల్లన సాగితి మా నిశీథ,మందె, డెందంబు లానంద మొందుచుండ.

గీ. అటులఁ జనుచుండఁ బార్శ్వంబులందు నున్న, పల్వలంబుల డాసి సర్పంబులొకట
నాకటనుడోఁగి 'కొక్కొకో' యనెడుకూత, లప్పటప్పట వీనులయందుఁ బడియె.

గీ. మట్టమధ్యాహ్నమున దీపమట్టు లాత్మ,కాంతి సర్వస్వమును బాసి చెంతనున్న
పొదలలోదాఁగు ఖద్యోతములును నొకటఁ,గూడి, డాఁగురుమూఁతల నాడఁజొచ్చె.

సీ. కమనీయకుంజపుంజములలోఁ గీచురా,యలశబ్దమొకట వీనులకు సోఁక
గుంపుగుంపులుగాఁగఁ గూడి పారు సృగాల,రవములొక్కట మాదు చెవులఁదాక
తరునీడములఁ గలంతను జెందు పక్షుల, రావంబులొకటఁ గర్ణములఁ జొచ్చె
వినువీథి నెగయుచుండిన ఘూకపక్షశ,బ్దము లొక్కమారు శ్రోత్రములఁ జేర

గీ. వివిధ పరిపక్వ సస్యాఢ్య విభవమొదవు, క్షేత్రభాగంబులందు మంచెలను జేరి
కాపు లిడుకూఁత లభ్రభాగమున కెగసి, తడయకయె మాదు వీనులఁ బడియె నొకట.

చ. క్రమముగఁ బోవుచున్ బొలముగట్టున నెవ్వరొ పూర్షు లున్నటుల్
భ్రమఁగొని వీరలెవ్వరని ప్రశ్న నొనర్చితిఁగాని, మారు ప
ల్కమి మది భీతిఁ జెంది, ధృతిఁ గైకొని వెంటనె యందుఁ జేరఁ గృ
త్రిమమగు గడ్డిబొమ్మ యని తేలె సమస్తముఁ, బాసె భీతియున్.

గీ. అటులఁ జనఁ జన మమ్ము వెన్నంటివచ్చు, ఛాయ లల్లన దీర్ఘమై సా
ఇందుఁ డాకాశ దుగ్ధాబ్ధి నీదులాడి, యాత్మకరశోభఁ దక్కి యాయాసమ

సీ. మలయానిలము మందమందంబుగా వీచి, యాత్మకు నూతనాహ్లాద మిచ్చె
వాడిన మల్లెపుష్పముల చెండునుబోలి, గగనంబున విధుండు కానవచ్చె
చిచ్చుబుడ్డి విధంబు చెలఁగి యాశ్వప్లుతి,తోడఁ జుక్కయు నింగి దుముకఁజొచ్చె
పతివిరహంబు సైఁపని పడంతులరీతిఁ, దారకల్ వెలవెలఁ బారఁజొచ్చె
గీ. అదివఱకు మున్ను కనులార నఱసినట్టి, తన్నిశావైభవంబు చిత్రముల కపుడు
తోఁటివిధమునఁ బరితుష్టిఁ దొంగలింప,దాయె; నూతనకాంతి పెంపాయె నంత.

క. ఇరుగడల నున్నతంబుగఁ, బెరిగిన తరుశాఖ లొకటఁ బెనయుచు గుబురై
సురుచిరగతిఁ గన్పట్టెను, బరువడి నిశ యొక్క మూఁడుపాళ్లుఁ గడచెన్.

చ. కర మనురాగ ముప్పతిలఁగా నటు లే మరుదెంచు వేళ, స
త్వరగతి మూర్ధమందు, వివిధంబుల శాకములన్ ధరించి, త
చ్చరణమునందు నందియలు సందడి సేయఁగఁ, గట్టు కోఁకలో
చెరఁగుల నోటఁదాల్చి చను చేడెలు మా కెదురైరి యత్తఱిన్.

చ. అరకలఁ బైనిదాల్చి, గళమందలి ఘంటలు మ్రోగుచుండ బా
హిరి సుఖమీయఁగా, నెమరువేయుచు, నర్ధనిమీలితాక్షముల్
మెరయుచునుండ, బాటపయి మెల్లనఁ బోయెడి దుక్కిటెద్దులన్
నరుస నదల్చు కాపు లొకపట్టున మా కెదురైరి యింతలోన్.

సీ. పొదలలో గుంపుగుంపులుగ వాసముచేయు, గిజిగాండ్ల కిచకిచల్ గేరఁదొడఁగె
చిగురుజొంపములపైఁ జేరి కోయిల లొక్క,జాడ మేల్కొల్పులఁ బాడఁగడఁగె
చటచట రెక్కలజాడించి కాకముల్, కావుకావని ప్రేలఁగాఁ దొడంగె
పల్లవి వెనువెంటఁబట్టి కుక్కుటకోటి, కొక్కొరొక్కోయంచుఁ గూయఁగడఁగె
గీ. పార్శ్వ వటవృక్షశాఖా ప్రపంచముక్త, తుహినబిందులు బొటబొట మహిని గురియఁ
బుడమి కలయంపి చల్లిన పోలుపు మీఱె, నధికసంప్రీతి మా మదులందుఁ జేరె.

గీ. అపుడు కనుగొంటి మొక్కట నమృతకల్ప, సలిలపూర్ణంబు, శైవాల సంవృతంబు
భాసురోత్ఫుల్ల పద్మ వికాసితంబు, శ్రీకరంబగు నొక్క పద్మాకరంబు.

ె జనపద మిందుల నిం,పొదవఁగఁ దానంబులాడి, యురుగతి నటఁ బో
ని తలపోయుచు నం,దు దిగితి మొకరేవుఁ జేరి తోడన యచటన్.

ఁదల! యేమె, నాదుపయి, మక్కువఁ దప్పితి, కానరా" వనన్
కియొకర్తు చిర్నగవునన్, 'నరిలే నరసంబు లింక, నీ

పొరుగున నెవ్వరేని వినిపోదురు సు' మ్మని పల్కులాడు చె
ప్వరో చనువెంచి రిక్త రట భాండముల్ గయిఁబూని నీటికై.

క. జనముల సందడియును గ్రామమున వృద్ధిం జెందుచుండఁ, బూర్వాశను దె
ల్లని రేఖలు దోఁచుట సంతసె తటమును జేరి, పోవఁ దరలితి మపుడే.

సీ. హుంకారరవసమాయుక్తమై చను కమ్మపడుచుల మేటి సువ్వాలపాట
కంకణ ఝణఝణత్కారసమ్మిళితమౌ, చిలికెడునట్టి మజ్జిగల రవళి
వత్సంబు లిడెడి యంబారవంబులకు మార్వలుకుధేనువుల యంబారవంబు
పోరువెట్టెడి చిన్నిబుడుతల లాలింప, సుదతు లొక్కటఁ బాడు జోలపాట
గీ. మొనసి యొకరీతి నాకాశమునకు నంటఁ, గర్ణరంధ్రంబులందు వేడ్కలు జనించెఁ
గోకిలాలాపములనంటి కూయునట్టి, బాలబృందంబు మాకంటఁబడియె నొకట.

గీ. అపుడు, 'సరిగదమాపని' యనుచు నొకట, విధివిరామములేక నాపితుఁ డొకండు
చేరి పూరింట కర్ణకఠోరముగను, పాడఁగాఁజొచ్చె సన్నాయిపాట నంత.

సీ. మునికదోవతులను మోకాలిపైఁగట్టి, బుట్టపాగల నెత్తిఁ జుట్టువారు
యింజను ధూమంబునేని క్రిందొనరించు, చుట్టపీకెల నోటఁ బట్టువారు
కిఱ్ఱుచెప్పులఁ గాలఁ గీలించి తమ చిన్ని, బొట్టెలఁ జంకలఁ బెట్టువారు
మాటమాటకు బూతుమాటల జోడించి, చుట్టాలతో సోదిఁ బెట్టువారు
గీ. 'ఎవరయా మీర లెందుల కేగువార', లనుచు మమ్ముల బ్రశ్నించునట్టివారు
కన్నులార్పక మముఁ జూచుచున్నవారు, కానవచ్చిరి పెక్కు రక్కాలమందు.

*　　*　　*　　*　　*　　*

గీ. అంత సూర్యోదయంబౌట సతిరయమున, దజ్జనపదంబునందు బాంధవగృహంబు
జేరి యచ్చట విందుల నారగించి, మరలితిమి యంత వచ్చినమార్గమున నె.



# పద్మనాయక విక్రమ నాటక విమర్శనము

శ్రీరంగము సోమేశ్వరశాస్త్రి గారు

ఈ నాటకమును రచించినవారు ప్రస్తుతము బ్రహ్మపురవాసు లగు బ్ర. శ్రీ. భాగవతుల నృసింహశర్మగారు. ఆంధ్ర దేశంబునందుఁ బ్రసిద్ధికెక్కిన బొబ్బిలియుద్ధమును గూర్చి రచింపఁబడిన దీనాటకము. 'ప్రతిజ్ఞా విజయరామరాజీయ'మని దీనికింకొక నామ మీఁబడినది. ఇందు విజయనగరరాజ్యాధిపతి యగు విజయరామభూపాలుని రాజనీతిఁగూర్చియు, నాతని ప్రతిజ్ఞనుగూర్చియు, మొదటి మూఁడంకములయందును బొబ్బిలి పద్మనాయకవీరుల రణవిక్రమముఁగూర్చియు విశేషముగ వ్రాయఁబడుటచే రెండుపేర్లును సన్వర్థము లగుచున్నవి. ఆధునికభారతయుద్ధముం బోలిన బొబ్బిలియుద్ధమునందు బొబ్బిలివీరులు ప్రకటించిన ధైర్యశౌర్య పరాక్రమంబులు వర్ణించుటకు వీలులేదని చరిత్రకారుల యనుశాసనము. ఈగ్రంథకర్తగా రిదివఱ కాంధ్రజనుల కపరిచితులు గారు. "విజయవిజయము లేక కర్మవిక్రమము" అను రూపకమును రచించినవారే.

ఈ సందర్భమునం దాంధ్రనాటకములఁ గూర్చి కొంత వ్రాయవలసి యున్నది. సంస్కృతంబునం దతిప్రాచీనకాలంబునుండియు నాటకరచనము కలదు. అందు రూపకభేదములు పది. అవి మధ్య నుప్పతిల్లినవి. వ్యాయోగములు, భాణములు, సమవాకారములు, డిమములు మొదలగునవి సంస్కృతంబునం దసంఖ్యాకములుగా నున్నవి. అవి యన్నియు ధనంజయ విరచితమయిన దశరూపకంబున లక్షణీకృతములయినవి. ఆంధ్రభాషయందు నరసభూపాలీయకర్తయగు మూర్తికవి కాలమునకు నాటకములు లేవు. కావుననే నాటకప్రకరణము నతఁడు ప్రతాపరుద్రీయాను సరణమునందు విడిచెను. కొందఱు నాటకములు పందొమ్మిదవ శతాబ్దపు టుత్తరభాగంబుననే రచింపఁ బడినవనియు, నంతకుఁ బూర్వము తెలుఁగున నాటకములు లేవనియు భ్రమపడుచున్నారు. ఇది చిన్నయసూరిగారికిఁ బూర్వము వచనగ్రంథములు లేవను నూహవంటిదే. చిన్నయసూరిగారికి రెండువందల యేండ్లకు ముందే సంజరాజు రచించిన హాలాస్యమాహాత్మ్యము, చేమకూర వేంకటపతిచే విజయవిలాస, సారంగధరచరిత్రము లంకితముగాఁ గొన్న రఘునాథభూపాలుని కృతియగు వాల్మీకిచరిత్రము, మొదలగు గ్రంథములు బయల్పడినవి. అట్లనే తంజాపురపు సరస్వతీపుస్తక

పాండ్య దేశముల నేలిన యాంధ్రరాజులును, సమకాలమున బతికియుండిరని 'రాయవాచకము'నను (ఆంధ్ర సాహిత్యపరిషత్ప్రకటితము) 'తంజావూరి యాంధ్రరాజుల చరిత్రము'నందును గలదు. ఇంతకంటె నీగీతలకుఁ బ్రాచీన కాలమునుండిగల ప్రాశస్త్యమును వేఱుగఁ జెప్ప నక్కఱ లేదు. ఇది యనేక కర్తృక గ్రంథములనుండి వైష్ణవభక్తి ప్రతిపాదకములగు శ్లోకముల నేర్చి కూర్చినదానిగాఁ దోఁచుచున్నదిగాని యేకకర్తృకముగాఁ దోఁపదు. ఇందలి యొక్కొక్క శ్లోకమును, పాండవులు, కౌరవులు మొదలగు రాజులు, మహర్షులు, దేవతలు మొదలగు వారలలో నొక్కొక్కరు విష్ణుమహిమఁ గొనియాడుచుఁ జెప్పినట్లున్నది.

ఇందలి పద్యములను మంత్రివాది కస్తూరి రంగకవి తెలిగించినాఁడు. ఇతని తండ్రి వెంకట్రావు. ఈవిషయమును గ్రంథకర్త యిట్లు చెప్పికొన్నాఁడు.

చ. పటుతర వాగ్విలాసమునఁ బాండవగీతలు సంస్కృ
తోక్తిను న్నటులు దెనుఁగుబాస వెలయంగ రచించితి
మంత్రివాది వేంకటపతి కూర్మినందనుఁడఁ గస్తూరిరంగ
కవిం గవేరజాతటమున రంగనాథుఁ డను దానవ
వైరికి నర్పణంబుగన్.

ఈకవి యేకాలమువాఁడో యెక్కడివాఁడో తెలియరాకపోవు టాంధ్రవాఙ్మయ చరిత్రమునకుఁ గొంత కొఱంతయే. ఇతని కవిత్వము ధారాశుద్ధిగల్గి రసవంతముగ నున్నది. చాలచోఁ గవి శ్లోకములయందలి భావములను స్వతంత్రించి పెంచి సుగ్రాహ్యముగనుండు నటులు దెలిఁగించినాఁడు, చూడుఁడు:—

శ్లో. సకృన్నారాయణేత్యుక్త్వా, పుమాన్ కల్ప శతత్రయమ్;
గంగాది సర్వతీర్థేషు స్నాతో భవతి పుత్రక!

మ. వినుమీ! పుత్రక! నాదు వాక్యము మనోవీథిన్
దృఢంబైన భక్తిని నారాయణనామ మొక్కపరి
పల్కెమానవుండున్నటన్, ఘనుఁడై కల్పశతత్రయంబు
మహిలో గంగాది పుణ్యాపగాంబునిమజ్జం బొన
రించునట్టి ఫలముం బొందు నత్యహోభ్యున్నతిన్.

శ్లో. ఏవం బ్రహ్మాదయో దేవాః, ఋషయశ్చ తపో
ధనాః; కీర్తయంతి సురశ్రేష్ఠం, దేవం నారాయణం
ప్రభుమ్.

మ. వనజాతోద్భవముఖ్యులైన విబుధవ్రాతంబులున్
సత్తపో, ధనులై మించిన మౌనివర్యులును మోదం
బొప్పఁ గోలాహల ధ్వనితోఁ జేతులు మోడ్చి కీల్కొ
లిపి దేవశ్రేష్ఠ! నారాయణా! యనుచుం గీర్తన
సేసి మ్రొక్కుదురు నిత్యంబు నన్మనోజ్ఞాకృతిన్.

శ్లో. ఇదం శరీరం శతసంధిజర్జరం, పత త్యవశ్యం పరి
ణామదుర్బలమ్; కిమౌషధం పశ్యసి మూఢ! దుర్మతే!
నిరామయం కృష్ణరసాయనం పిబ.

ఉ. నమ్మఁగ రాదు దేదు పరిణామ మరయా శతసంధిజర్జ
రం, బెప్పుడొయిఁజాఁ బినం బడుటదే సహజం బిటువం
టి దీ శరీరమ్మున కొక్కఁ డుండదె నిరామయ విష్ణు
రసాయనంబు పానమొనరింపు దుర్మతి! ఘనమ్మగు
జాడ్యము మాను నిత్యమున్.

ఇట్లే యిందలి శ్లోకములు పద్యములు నొండొంటిని మిగిలి పాఠకజనహృదయక్షేత్రముల విష్ణుభక్తి బీజముల నాటుకొనఁజేయుననిన నతిశయోక్తి కానేరదు. ఇతని కవిత్వమునఁ గ్వాచిత్కముగ స్ఖాలిత్యములు చూపట్టుచున్నవి కాని భక్తి ప్రధాన మగు నీ గ్రంథమున కది యొక లోటు కాఁజాలదు.

ఈ పాండవగీతలను పెక్కుమాతృకలతో సరిచూచి పాఠభేదములను, అధికపాఠములను సమకూర్చి శ్లోకములకుఁ బ్రతిపదార్థమును దాత్పర్యమును వ్రాసి మిక్కిలి సుగమముగాఁ జేసిన బ్రహ్మశ్రీ కనుపర్తి మార్కండేయశర్మగా రాంధ్రలోకమునకుఁ జిరపరిచితులు. ఈగ్రంథసంపాదనమున వీరిపరిశ్రమ పేర్కొనఁ దగినది.

గ. సు.

* * *

## పోతన వేమనలయుగము.

ఈయాంధ్రవ్యాసము శ్రీయుత దిగవల్లి వేంకటశివరావు బి. ఏ. బి. ఎల్. గారిచే రచియింపఁబడి చెన్నపురి రాజధానీకళాశాలవారి 1922 సంవత్సరపు పవెల్ అండు మోర్ హెడ్డు బహుమానము (రు 150 లు) పొందినది. వీరు పోతనకాలమునుగూర్చికాని వేమనకాలమునుగూర్చి కాని నిర్ధారింపకయే వీరిద్దఱును సమకాలికులన్న భావముతో నీవ్యాసమును రచియించియున్నారుగాని వీరు సమ

కాలికు లగఁదురో కారో యింకను స్థిరపడలేదు. ఇంతియ కాక 'వేమనపద్యము' లన్నప్పుడు నేవి వేమనపద్య ములో యేవి కావో యింతవఱకును విమర్శకులు పద్య ములను విమర్శించి నిర్ధారింపలేదు. సంవత్సరములు గడ చినకొలఁది, ముద్రణములు వెలిగినకొలఁది వేమనపద్య ములయొక్క సంఖ్యయుఁ బెరుఁగుచున్నది. నిశ్చ యముగాఁ గొన్ని పద్యములు వేమనయోగివి కావని నిర్ణ యించుటకు సాధనములు కలవుగాని లేకపోలేదు. ఇందుకు భాషాసమాజములవారుగాని, సాహిత్యపరి షత్తులవారుగాని పూనుకొన్నచో నీకార్యమును గొన సాగింపవచ్చును. అంతవఱకును, వేమనమతమును, ఇట్టి దని నిర్ధారింపఁజాలము. అతనికాలము స్థిరపడినఁగాని పోతనకాలముతో ముడిపెట్ట వలనుగాదు. అయినను వేంకటశివరావుగారును 'పెద్దలు పూజ్యులు నగు, ఈకాలపు పండితులు, చరిత్రపరిశోధకులు, నీవిషయ ములను చర్చించి, విమర్శించి నిర్ణయించువఱకును, ప్రస్తు తము చేయఁబడిన సిద్ధాంతములను నమ్మి, పోతనయు, వేమనయు నించుమించుగ నొకేకాలమున పదునైదవ శతాబ్దమున నుండిరని తలంచి ఆకాలమునాఁటి ఆంధ్ర దేశపు రాజకీయస్థితియు సాంఘికస్థితియు నెట్టులుం డెనో, అవి పోతన వేమనల కృతులం దెంతవఱకు నాదర్శి తములయ్యెనో పరిశీలించి కృతివిమర్శనమునకు వత్తు' మని వ్రాసియున్నారు. ఈ భావముతోనే యీ వ్యాస మును వ్రాసి తమయభిప్రాయములను దెలిపియున్నారు. తమ సరసములయిన యభిప్రాయములను, విమర్శలను తేటతెలుఁగు పదములతో సమకూర్చియుంచుటచే నీవ్యాస మాంధ్రభాషావ్యాసంగముఁ జేయఁగోరు విద్యార్థుల కత్యంతోపయుక్తముగా నుండఁగలదు. ఇందు ౭౮ పుటలుగలవు. వెల 8 అణాలమాత్రమే. వలయువారు బెజవాడలోనున్న గ్రంథకర్తగారికి వ్రాసి కొనవలయును.

చి. వీ.



# నిర్మలాత్మ

చింతలపూడి సీతారామయ్య గారు

మణి హేమఘటితభూషణ వితానములలోఁ, దళుకు లీనుచు జీవకళలు దోఁచు
శారీరసౌందర్యసౌకుమార్యములలో, వెలుఁగుఁ జూపుచు జీవకళలు దోఁచు
వచనామృతరసప్రవాహవీచికలలోఁ, దొలఁకి యాడుచు జీవకళలు దోఁచు
కార్యసందోహసక్రమ విక్రమములలోఁ, గలయఁ బ్రాకుచు జీవకళలు దోఁచు
నాంతరంగికనైర్మల్యకాంతి యున్న, నన్నిటికి నెన్నఁగాఁ దగు వన్నె దోఁచు
జీవితంబున కదియ సంజీవిఫలము, పడయుమా దీనిఁ బూన్కిమై భరతపుత్ర!

ఉ. శారదకౌముదీ రజతశైల మరాళసితాభ్ర చంద్ర నీ
హార వియన్నదీ ఘనరసాబ్జపయోజలరాశికుందము
క్తారమణీయకాంతు లొకగవ్వకుఁ గావె వినిర్మలాత్మ వి
స్ఫారసుఖద్యుతుల్ మెఱయుపట్టుల దీని నెఱుంగు టొప్పగున్.

గీ. నిఖిలమహిమాలవాలంబు నిర్మలాత్మ, నిఖిలశక్తినిధానంబు నిర్మలాత్మ
నిఖిలవస్తుస్వరూపంబు నిర్మలాత్మ, నిరతమానంద నిలయంబు నిర్మలాత్మ.

గీ. అన్నరసురంచు నిట్టూర్పు లార్చుకొనుచుఁ, దనసమాగమన ప్రయాసను దెలుపుచు,
యాచకుఁ డతిప్రవేశదోషాచరణుఁడు, రిత్తగూలును మార్గణ రీతిదోఁప.

ఉ. శ్రీమణి చంద్రధేనుహయ సింధురబంధుర సంపదున్నతిన్
నేమముగన్న రాజకులసింధువుఁ గన్గొని యాశ్వరత్నముల్
ప్రాముకొనందలంచి మతిమాలినభృత్యుఁడు స్వీకరించెడున్
భూమిప సేవనంబనెడు భూరిమహోజ్జ్వల కాలకూటమున్.

గీ. "విడుము విడుమోయి పాంథుఁడా విఱుగవంగఁ, గాచినరసాలమిదిగాదు ఖదిరము సుమి
నిష్ఫలం"బని యితరులనినను గూడ, నాశచే దుష్ప్రభుని విడనాడఁ డర్థి.

ఉ. మూలతెఱంగునన్ మఱల మార్దవమందదు వాడువాఱినన్
వ్రీలిన నింక సంధిలదు వేర్పడిపోవును గాజుమాడ్కిఁగాఁ
జాలని బీదయింటి దివె చాడ్పున దైన్యపు టార్పుగాడ్పులన్
గూలును స్నేహసౌఖ్యమయి, కుత్సితసేవ పొసంగఁ ద్రోచినన్.

సీ. మ్రోయఁగాఁ దలుపులు ద్రోయుటచేతను, నత్యంతమును గుపితాత్ములగుచు
నెత్తిపై నెడనెడ మొత్తుచుఁ దలుపులు, దెఱవక పొమ్మనుచుఁ దీవరించి
ద్వారపాలకులు దుర్వార బాహుబలుల్ ని,వారింపఁగాఁ జింతవంతఁ జివికి
చీకాకుఁ జెంది కుబ్జీభూతుఁడై వారి, కాళ్లసందుననుండి యల్లనల్ల.

గీ. లోనికిం జొరఁబాఱి కాలానకుండ, నిలిచి వాయెత్తకుండఁ దా వెలికివచ్చు
వారలను రాజదర్శనావసరమడుగు, నయ్యయో! యాచకున కెన్ని యటతటములు.

ఉ. ఎవ్వఁడ వేఁగ దెచ్చుటికి? భృత్యుఁడ నే, నృపదర్శనార్థమై;
క్రవ్వెడులాభమేమి యట? కల్గును దన్నులు తాపు; లయ్యయో! యా
నోవ్వికి మన్నుఁబూసెదె? కనుంగొనరాదట మాదుత్రొక్కిడిన్
దువ్వయుఁ; జాలు నాసఖుఁడ! దుష్ప్రభుఁడా! పదివేలుదండముల్!

మ. ముకుద్రాడుం దలపించునట్టిదయి పెన్మోహంపు దైన్యంపుఁ దా
నకమై సేవకతా శ్రమమ్ము కడుఁజింతంగూర్పఁగా విత్తలే
శక్యతాపేక్షను సైచెడున్ మనుజుఁ డెంచన్ రత్నముక్తాదిల
బ్ధికి యాదోబడబాగ్నిభీకరము నబ్ధిన్ జొచ్చు టిట్లేకదా!

ఉ. ఊరకరాకపోకల సముద్యతుఁడై వెతలందు, మందిర
ద్వారముఁజూచుచున్ నిలుచుఁ, దా భటపాలినిరస్యమానుఁడై
ఘోరపుయత్నమున్ జలిపి కొండొక లోఁజని దూషితుండగున్
పేరిమిదక్కి కుక్కవలెఁ బెన్వెత లందుఁ గుసేవకుం డిలన్.




## వైదికధర్మచరిత్రము

ఈ చరిత్రగ్రంథము శ్రీశ్రీశ్రీ పరమహంసపరివ్రాజకాచార్యవర్య శ్రీ కళ్యాణానంద భారతీమహాంతాచార్యస్వామి విరచితమై 'స్వధర్మప్రకాశిని' లోఁ బ్రకటింపఁబడి బ్రహ్మశ్రీ కనుపర్తి మార్కండేయశర్మగారిచేఁ బునర్ముద్రితము కాఁబడిన యీచిన్నపొత్తము గ్రంథప్రకాశకులచే మాకుఁ బంపఁబడినది. వెల ౪ అణాలు మాత్రమే.

వైదికధర్మమునుగూర్చి శ్రీస్వాములవారికి గల యభిప్రాయములను దెలిపెడు నిట్టి చిన్నపొత్తమునకు వైదికధర్మచరిత్రమని పెద్దపేరుపెట్టుట సమంజసముగ గన్పట్టదు. "ఇట్టి వైదికధర్మమార్యావర్తమున నెప్పుడు ప్రప్రథమమున బయలువెడలెనను విషయము నూహింప యత్నించుట సాహసముయొక్క పేరను నెరుకయత్నించుటయు" అనుటచేతను, 'వైదికధర్మమునకు మూలకారణంబగు వేదరాశియొక్క కాలమును నిర్ణయించుట దుర్ఘటమే. ఏలయన ఈవేదరాశి పరమేశ్వరునిచే సృష్ట్యాదియందు మానవకోటికి నీయఁబడె ననువచనమొక్కటిదక్క వేఱొండువచన మార్యావర్తము నలంకరించు గ్రంథరాజములందుగాని వేదములందుగాని యెచ్చటను గానరాదు.' అనుటచేతను, వీరు కాలమును గ్రంథనిదర్శనములచే లెక్కించుటకు నవకాశము నొసంగని కాలమనియు, గ్రంథనిదర్శనములచే లెక్కించుట కవకాశము నొసంగుకాలమనియు రెండువిభాగములను జేసి 'మొదటిదానిని కృత, త్రేత, ద్వాపరములనియెడు మూఁడవస్థలుగను, రెండవదానిని (శ్రీకృష్ణావతార, శంకరావతార, విద్యారణ్యావతార) కాలములనియెడు మూఁడవస్థలుగను విభాగించి యీ యా యుగకాలములలో వైదికధర్మ మెట్టిస్థితిగతుల నుండెనో యద్దాని నూహించవలెను' అనుటచేతను, ఇందు వైదికచరిత్రము లేదనియును వీరు వ్రాసినది వీరియూహలే యనియు వీరి వాక్యములే స్పష్టముగాఁ దెలుపుచున్నవి. మఱియు నీచిన్నపొత్తమున వీరు వైదికధర్మములని తెలిపినవైదికధర్మములలో మూఁడుపాళ్ళువిషయములు శ్రుతిస్మృతిపురాణేతిహాసములలోఁ జెప్పఁబడినవానికి భిన్నములై యున్నవనికాని, భిన్నాభిప్రాయములు గలవనికాని చెప్పవలెను. వర్ణాశ్రమధర్మములయొక్క చరిత్రమే యిందు సక్రమముగా వక్కాణింపఁబడి యుండలేదు. ఈగ్రంథము కావలసినవారు క. మార్కండేయశర్మగారు బృందావనం, కీల్‌పాకుపోస్టు, మదరాసు అని వ్రాసి కొన్నఁ బడయఁగలరు.

చి. వీ.

* * *

## పాండవ గీతలు

ఆంధ్రటీకాతాత్పర్య పద్యసమన్వితములు. డిమ్మి ౬౮ పుటలు. వెల రు ౦-౮-౦. విలాసము:— బ్రహ్మశ్రీ కనుపర్తి మార్కండేయశర్మగారు, 'బృందావనము' కీల్‌పాకు, మదరాసు.

విష్ణుభక్తి ప్రతిపాదకములగు స్తోత్రరాజములలో నెన్నఁదగిన దీగ్రంథము. ఇందలిశ్లోకములు రసవంతములై సులభముగ మానవులను భక్తిమార్గమునకుఁ ద్రిప్పఁజాలినవి. సంసారదావానలసంతప్తులకమృతపుఁ జినుకులై యాహ్లాదమును గూర్చునవి. అనుదినమును బ్రాతఃకాలమునఁ బఠింపఁదగినవి. ఈ గీత లనుదినము విద్యానగర రాజులగు శ్రీ కృష్ణదేవరాయలు మొదలగువారును, భోజ

తోంగితోంగిచూచును. కొంద ఱిట్టి భావలఁ బ్రయోగింపఁ గూడదని యందురు గాని, యట్లు ప్రయోగించుటవలన నాటకమునకుఁ గొంత వికాసమును గలిగించి, నాటకప్రయోగమును దర్శించువారికి సంతసమును గలిగించును.

సందలికవిత్వము పేశలమయి శ్రావ్యముగ నున్నది. గద్యమువలెనే పద్యములు యథేచ్ఛముగా వాడఁబడినవి. సార్వజనీనమగునట్లు పద్యములు సులభశైలియందే వ్రాయఁబడినవి. సంస్కృతాంధ్రము లలవోకగాఁ బ్రయుక్తము లయినవి. తన కవితను గూర్చి గ్రంథకర్త యిట్లు చెప్పించియున్నాఁడు :—

చ. జిలజిల పూవుఁదేనియలు చిప్పిలు చొప్పున
ముద్దులొల్కఁగన్, బలుకులఁ జొన్పి
కావ్య మనపద్యముఁ జేసినఁ జాల
లెస్సకా, వలసిన సంస్కృతంబుఁ జొను
పందగు నెయ్యముఁ దోఁచుపట్లను,
ల్కులవలెనుండు వాఁడిపలుకుల్ చొనుపం
దగ దెట్టివానికిన్.

సూత్రధారునిచేఁ బైపద్యము కవితాస్వభావమునుగూర్చి చెప్పించినను ఈనాటక కవిత్వమున కన్వయించును. రంగప్రయోగము నీనాటకము లెస్సగ నుపచరించును. ఈప్రదేశముల (అనఁగా గంజాము, విశాఖపట్టణపు జిల్లాలయందు ఈనాటకమును నాట్యమాడుచుండఁగఁ జూచినవా రనేకులు "బాగుబాగ"ని శ్లాఘించిరి. ఈవిషయము నేను స్వయముగఁ గనుగొంటిని. ఈనాటకమునందుఁ బాపారాయనిగూర్చి యేమియు లేదనికొందఱు సందేహింపవచ్చును. నన్ననేకులు దీనింగూర్చి ప్రశ్నించిరి. వారి కీరీతి సమాధానము చెప్పితిని.

బొబ్బిలియుద్ధము ప్రారంభము కాకమునుపే పాపారాయఁడు రాజాముకోటకుఁ బంపఁబడెను. అతఁడు ఆరణమంతయు నయిన తర్వాతఁగాని బొబ్బిలికి రాలేకపోయెను. అందఱు చచ్చిన యనంతరము వచ్చి విజయరాముని జంపి తనపగఁ దీర్చుకొనెను. అందుచే నాటకమునందుఁ బాపారాయనికిఁ దావిచ్చుట కెడములేదు.

ఈనాటకము మిగిలిన జిల్లాలయందుఁ గూడ ప్రయోగింపఁ బడుటకు నెంతయో యనుకూలముగ నుండును.



# సేవ్య సేవకోపదేశము

(క్షేమేంద్రుని సంస్కృతకృతికిఁ దెనుఁగు)

శ్రీ రాజా వాసిరెడ్డి దుర్గా సదాశివేశ్వర ప్రసాద బహద్దరు గారు

సీ. తమ జరుపును దాస్యంబు వ్రతమువలెను, ఎల్లచో జీవితవినాశ మెన్నుకొనును
ద్వారపాలకుల్ పొమ్మని తఱిమి తన్న, నను జనుఁడు యాచకుండు వినష్టగుణుఁడు.

గీ. తీవ్రమగు విషయేచ్ఛను దిగనడంచి, తోషపోషహా కుశల మందుకొనుమనుచు,
కడఁగి సుఖసేవకై యాత్మనడిగికొనఁగ, నదియె సమకూర్చునరులకు నఖిలసుఖము

గీ. చలికిఁ జీకటి కెండవానలకు దైన్యమునకుఁ జింతకుఁ దను వెల్ల ముద్దగాఁగ,
సౌఖ్యమోహంబుగొని మూర్ఖజనుడు, సేవఁ జేయు దుఃఖసహస్రంబుఁ జెందుచుండి.

ఉ. పోవుచు వచ్చుచున్ గడపిపుచ్చితి నాళుల నెన్నినాళ్లకా
భూవిభుఁ జూడఁగా నదను పుట్టకపోయె నటంచు దుఃఖభా
రావిలచిత్తుఁడై వగపులందుచు భృత్యుఁడు జీర్ణదేహుఁడై
పోవునుగాని వానిమదిఁ బాంగెడు తృష్ణ తుయింప దింతయున్.

చ. పిలువని పేరఁటమ్ముగఁ బ్రవేశముగాంచుచుఁ బట్టుగాని ప
ట్టుల వెలుఁగొందు దివ్వియయటుల్ చెడఁగొట్టుచు నేకతంబులన్
వలువకులోపలంబడి యవస్థఘటించెడు నీఁగమాడ్కిఁగాఁ
దలఁపడు భృత్యుఁ డేవిభునిదగ్గఱ నేనియు గర్హ్యుఁడే కదా!

గీ. కనులనులుకించుఁ బాగవోలెఁ గానఁబడుచు, చాటుగాథలఁ జెవులకు జ్వరముఁ గూర్చు
ఎడప కడుగడ్డునకుఁ గాలఁబడుచు ముల్లు, వలెను దుస్సేవకుఁడు విభు నలఁచుచుండు.

గీ. ఒకఁడు దివిఁజూచుఁ జూచు నింకొకఁడు భువిని, ఒకఁడు నిర్జనార్థియు మఱియొకఁడు గాథ
నక్తుఁ డిట్లుండఁగా నెట్లు సాగఁగలరు, సేవ్యుఁడొకఁడై మఱొక్కఁడు సేవకుఁడయి.

చ. కడఁగినరూపుఁడైన శనిగాని విధంబున వెంబడించుచున్
జెడుగులుగూర్చుచున్ హితముఁ జెర్చుచు వృశ్చికనిశ్చలుండునై
కడుమద మూనుచో నడుమ గడ్డయుఁబోలె నకాలపాతియై
యొడయని కెంతయేని యవయోగముఁ గూర్చుఁ గుసేవకుండిలన్.

గీ. త్రోపు వడియును బోఁడు తీవ్రోపరోధ, పరిచితుఁడు జడభృత్యుండు ప్రభునిదయకుఁ
బాత్రతను గాంచఁ బలుపాట్లు పడుచునుండు, నదియె ప్రభుకోపకారణమగు కొఱఁగఁడు.

భాండాగారమునందుఁ బూర్వులు రచించిన నాటకము లనేకములు గలవు. పూర్వు లనఁగా నూఱేండ్లకుఁబూర్వులు. ఆంధ్రశబ్దచింతామణి వ్యాఖ్యానమును రచించిన బాలసరస్వతి రంగకౌముదియనెడు నాటకమును రచించినట్లు రాఘవయాదవ పాండవీయంబునందుఁ జెప్పియున్నాఁడుగాని, యీనాటక మాంధ్రనాటకమో, గీర్వాణభాషానాటకమో తెలియదు. శ్లేషకావ్యస్రష్టయగు పింగళిసూరన్న తన ప్రభావతీ ప్రద్యుమ్నమునందు నాటకములఁ గూర్చి ప్రస్తావించియున్నాఁడు. నాటకము రీతినే తన గ్రంథమునందుఁ బాత్రపోషణ మొనరించియున్నాఁడు. ఇట్లు నాటకము లాంధ్రంబునకుఁ గ్రొత్తలుకావు. అయినను పూర్వనాటకము లెవ్వియును ముద్రింపఁబడలేదు. సుమారేఁబది యేండ్లనుండి యాంధ్రమున నాటకరచన ప్రబలియున్నది. సంస్కృతంబునం దింకొక విశేషముకలదు. అందు విషాదాంత నాటకములుగాని, చారిత్రక విషయనాటకములు (ముద్రారాక్షసనాటకము విశాఖదత్తకృతము తప్ప) గాని లేవు. ఆంగ్లభాషాసంపర్కంబున నియ్యవి యాంధ్రభాష కబ్బినవి. అట్టి చారిత్రక నాటకములలో మన బొబ్బిలియుద్ధవిషయసంబంధనాటకము లనేకులు తెలుఁగున రచించిరి. అందఁ 'ప్రతిజ్ఞావిజయరామరాజీయ' మొకటి. ఈనాటకమున విజయరామరాజు రాజనీతి ప్రయోగము, తదనుగుణచర్యలు, పద్మనాయకవీరుల రణసంరంభము మొదలగు విషయములు మిక్కిలి మెలఁకువతోఁ బాత్రల యౌచిత్యానుగుణముగా వ్యక్తీకరింపఁబడినవి. రాజనీతి యెట్లుండవలెనో గ్రంథకర్తచెప్పిన పద్యములలో రెండిట నుదాహరించెదను:—

గీ. నిద్దురం జెందియుండియు నిద్రలేని
విధము, చూచియుం జూడని విధము, కోప
ముండియుఁ లేని విధము నృపోత్తముండు
చారనేత్రుఁడై శతకర్ణుఁడై రహించు.

గీ. అల్పమగు నంశ మత్యంత మధిక మనుచుఁ
బురుషకార్యంబునం గార్యముల నొనర్చి
మెలఁకువంబూని వర్తింపవలయునృపుఁడు
కోర్కెలీడేఱుఁ గాలానుకూలముగను.

ఇట్లు బుద్ధిబుచ్చన్న చేతఁ దొలుత రాజనీతిఁ జెప్పించి యున్నాఁడు.

వెలమవారు శూరత్వమున నీక్రిందిపద్యమున విజయరాముని గుండెలు తల్లడిల్లునట్లు వర్ణించియున్నాఁడు:—

సీ. ఒక్కరూఁకున సేనఁ జక్కాడు నుక్కరి
మిరియాల సీతన్న మురువెఱింగి
కొండపిండుల నెల్ల గుండపిండిగఁ జేయు
చలికాని వెంకన్న బలమెఱింగి
బ్రహ్మాండభాండంబు బ్రద్దలఁ గావించు
వెంగళరాయని వెర వెఱింగి
ముజ్జగంబులనొక్క పజ్జ స్రుక్కఁగ చేయు
ధర్మరాయనిబాహు దర్పమెఱిఁగి

గీ. బలుని బొబ్బిలి బెబ్బులిం బలుక నేల?
ఒడలుగలవాఁడెవఁడు దాడివెడలఁగలఁడు
దురభిమానంబునం బోరఁ దొడరఁ జనునె
విజయరామభూపాలకా! వినుము వఱదు.

స్వభావమే లోకమునకు నీతిధర్మము సద్గురువయి బోధించుటను గ్రంథకర్త యిట్లు చక్కఁగఁ జిత్రించియున్నాఁడు:—

సీ. తుంగతరంగసందోహంబుఁ గల్గియు
మేరఁదప్పక యబ్ధి మెలఁగుచుండఁ
దశిఁ దప్పకుండఁగఁ దరణియుఁ జంద్రుఁడు
గగనభాగమునందుఁ గ్రాలుచుండ్ర
పూన్చిన హయముల పోలికఁ నొకరీతిఁ
బంచభూతంబులు వఱలుచుండఁ
గాలానుకూలంబుగా జగచ్చక్రంబు
పరివర్తనంబులఁ బడయుచుండఁ
గీ. క్రమముమీఱక నిర్దిష్ట కాలమునకు
గ్రహములు సతంబు మెలఁగుచుఁ గ్రాలు
చుండఁ, బ్రకృతి యంతయు ధర్మంబుఁ
బట్టియుండు, ధర్మమే పాలనముఁ జేయు
ధరణినెల్ల.

షష్ఠాంకమునందుఁ గల కరుణారసప్రయోగమునకు: పాషాణము సహితము కరఁగిపోవలసినదే. రంగారాయఁడు కుమారు నెత్తికొని యేడ్చుట, మల్లమ్మ దేవ్యాదు లగ్నిహోత్రమునం బడి మడియుటయును రెండుస్థలంబులఁ గ్రమముగఁ గరుణారసమును, బీభత్సరసమిళితకరుణారసంబును నస్వాయించును. ఈయంకమునందుండి పైరసంబుల నిరూపించుటకు రెండుపద్యముల నుదాహరించెదను.

చ. పుడమిని బేదవాఱునకుఁ బుత్త్రుఁడవై జని
యించియున్న యీ, యిడుమలు లేక
వర్ణితయి యెచ్చటనైన మెలంగి కాలముఁ,
గడపఁగ నోడియుందువు సుఖంబులఁ
జెందుచు నాదుపాపపుం, గడుపున నేల
పుట్టితివి త్మ్మాపతులెల్లను గొడ్డువోయిరే!
ఇచ్చటఁ గరుణారసనిరూపణమును,

చ. భగభగ మంచు నొక్క మొగి జ్వాలలు
మంటికి మింటి కేఁకమై, మెగయుటఁ జూడ
భీకరపు మృత్యువు జిహ్వాలటంచుఁ జెప్పఁ
గాఁ దగవె? నరాధముండయినఁ దాళు
నె? చూచినయంత గుండియల్, వ్రగు
లకయుండునే? పరశురాముని కియ్యవి
ప్రీతిఁ గొల్పునే?

ఇయ్యెడ బీభత్సమిళిత కరుణారసమును గలవు.

రంగారాయఁడు ధీరోదాత్తుండుగదా, తనకుమారునిజూచి యేడ్చుట యేమి సమీచీనముగా నున్నదని కొందఱు సందేహింపవచ్చును. ఇందుకు సమాధానము:—

యుద్ధభూమియందుఁ బరుల నెదురించుచో ధైర్యము కొలఁతఁ బొందకుండ నుండవచ్చును గాని నిర్భాగ్యులయిన తనపుత్త్రుని, భార్యను జూచినచో నెట్టిధీరునకైనను విచారమువచ్చుట ప్రకృతి. రసనిరూపణమొనర్చుచో స్వభావమును వీడఁబుచ్చుట రసభంగము. సంస్కృతంబునందేమి, తెలుఁగునందేమి దీనిం గూర్చి లక్ష్యలక్షణము లనేకములు గలవు గాని గ్రంథవిస్తరభీతిచే నాచర్చ యిట విసర్జింపఁబడినది.

ఈనాటకమునం దేపాత్రకుచితమయిన భాష యాపాత్రకుపయోగింపఁ బడినది. హైదరుజంగు మొదలగు మ్లేచ్ఛపాత్రలు మాటలాడుచున్నప్పుడు హాస్యరస మక్కడక్కడ

# సాభిప్రాయ విశేషములు

## కాంగ్రెసు మహాసభ

సీ. సత్యహితాలాప చతురత యర్ఘ్యంబు, సంతత సుజనపూజనము వలయు
విను క్రోధసంరంభ విద్వేషములఁ జేసి, మతి గలంగినను ధర్మంబు దప్ప
కుండంగ నడచు టత్యుత్తమసరణి యప్రియములయందును బ్రియములందు
దైన్యహర్షంబులఁ దగులక యున్నట్టి, కల్యాణవర్తన కాంతు లెన్న
తే. యొగ్గు సేసినవారికి హితము సేత, యార్యజనములు గీర్తింతు రన్యదోష
కారి దనదోషమునఁ దాన కాలి పోవు, వేఱ వానికిఁ గీడు గావింపనేల?

భా. అర. అ. ౨ ప. ౩౯.

బెల్గామునకును కాకినాడకును నైసర్గిక స్థితియందు దూరమున్నను భావమునందు దూరములేదు. బెల్గాముకాంగ్రెసు కాకినాడకాంగ్రెసును సకలవిధములను బాహ్యస్వరూపమునందు సంస్మరింపజేసినది. ఖద్దరుమహామంటపము ఖద్దరుకుటీరములు సభాధిపతి శ్వేతమందిరము ధ్వజారోహణము విజయనగర నిర్మాణము బాహ్యస్వరూప సామ్యత్వమును విశదముచేసినను అభ్యంతర వ్యవహారములు వ్యక్తిత్వమును విశదము చేసినవి. మహాత్ముని సభాధిపత్యము బెల్గాము సభ కనిర్వచనీయమైన ప్రతిభను గలుగ జేసినది. నాయకులందరును బెల్గామునకు రెండుమూడు దినములకు బూర్వమె చేరి యుండిరి. మహాత్ముడు కార్యవిధానమును నాయకులతో చర్చించి సంప్రతించి నిర్ణయించెను. తదనంతరము వ్యవహారమునంతయును విద్యుద్వేగముతో ముగించి కాంగ్రెసు వ్యవహారనిర్వహణమార్గమును భారతీయులకు విశదముచేసెను. మహాత్ముని స్థిరప్రజ్ఞ, మందహాసము, వినయపరిజ్ఞానము, సౌమ్యస్వభావము, సమయపాలనము, నిగ్రహానుగ్రహశీలము పండిత పామరుల కాదర్శములుగ నుండగలవు. మహాత్ముని ప్రతిష్ఠను విజయనగరమహాసభ సుస్థిరము చేసినది.

* * * *

సమయపాలనము

మహాత్ముని సందర్శనమునకు వేలకొలది ప్రజలు వేచియుండిరి. నాయకులు ప్రతినిధులు నిరంతరము సంప్రతింపును సంశయ విచ్ఛేదమును గోరుచుండిరి. విషయ నిర్ధారణసభ మహాత్మునిలక్ష్యమును గోరుచుండెను. వివిధసభలు మహాత్ముని సన్నిధిని ప్రసంగములను నాకాంక్షించుచుండెను. మహాత్ముడు ప్రొద్దున మూడవ యామముననె లేచి రాత్రి రెండవ యామమునరకును బాటుపడి సమయపాలనవిధానమును సంకల్పసామర్థ్యమును విశదముచేసెను. పనిలేనివారికి విసుగుదలగలుగుచుండునుగాని ప్రతిక్షణము పనిగల మహాత్మునకు విసుగుదల గనుపడలేదు. విలక్షణములుగను బరిగణింపబడెడి యల్పాహారము స్వల్పకాయము కౌపీనధారణము సాధువులందు సలక్షణములుగను గనుపడును. గౌరవమునకు లక్షణము ధర్మపాలనము గాని దృఢకాయము భోజన సామర్థ్యము వస్త్రాలంకరణము గాదని మహాత్ముని పవి

త్ర జీవితము ప్రత్యక్ష ప్రమాణముగ నున్నను వస్త్రాహార వ్యామోహము నాయకులను బాధించుట విచిత్రముగ నున్నది. వేకువను లేచి విశ్వకల్యాణమూర్తిని సంకీర్తనము చేసి ప్రసన్నవదనముతో గార్యముల నారంభించెడి మహాత్ముని సంకల్పసిద్ధి కాటంకములు గలుగజాలవు. ప్రజలును నాయకులును మహాత్మునివలె సమయనియమపాలనముచేసి ధర్మారాధకులైన కృతార్థులు గాగలరు.

* * * *

ఆత్మనిగ్రహణము

విజయనగరమునందు మహాత్ముడు ప్రత్యక్షము చేసిన విజయసాధనము సకలజనుల కనుష్ఠానయోగ్యమై సంతరణోపాయముగ నున్నది. విషయ నిర్ధారణ సభావేదికయందును మహాసభావేదికయందును మహాత్ముడు చూపిన యాత్మనిగ్రహము విస్మయమును గలుగజేయగలదు. మహాత్మునకు భేదాభిప్రాయములు క్రోధరాగావేశములను గలిగింపవు. ప్రతిపక్షులవాదమును శాంతముగను విని నాలుగువాక్యములతో తనవాదమును ముగించును. దీర్ఘ ప్రసంగములను జేయవలయు ననెడి వ్యామోహము మచ్చునకైనను గనుపడదు. జ్ఞానసంపన్నులకు మౌనము సహజాలంకారము. మహాత్ముని మాటలు ముక్తాఫలములవలె సవర్ఘములైనను మితసంభాషణ మనర్ఘతమమై యనుష్ఠానయోగ్యమైనది. మహాత్ముడధ్యక్షోపన్యాసమును ప్రతినిధులకు పూర్వదినముననె యందజేసి సభాకాలమును నుపన్యాస పఠనముతో వ్యర్థము చేయలేదు. ఆంగ్లహిందీ భాషలందు సంభాషణమును నరగంట కాలములో ముగించి కార్యనిర్వహణ సాధనమును విశదము చేసెను. ఉపన్యాసమునందు ముద్రితోపన్యాసమునందు లేనినూతనాంశములను దెలిపి సభ్యులను రంజింపజేసెను. ఆహ్వానసంఘాధ్యక్షులు గంగాధరరావు దేశపాండ్యగారును నుపన్యాసమును జదువుటను మాని హృదయంగమంబైన భావములతో భారత జాతీయ మహాసభకు స్వాగతం బొసంగెను. వాగ్వివాదములతో గాలహరణము చేసెడి దేశాభిమానులకు దేశపాండ్య మహాత్ముల యాచరణము వివేకోదయమును గలుగజేయునుగాత! ప్రాజ్ఞులు మండనఖండనములందు రాగద్వేష భావములను గనుపఱచకను విషయావగాహనమును మాత్రముచేసి ధర్మనిర్ణయభారమునందు స్వాతంత్ర్యమును గలుగజేయుదురు. మహాత్ముడు వ్యతిరేకభావములు గల సభ్యులకు వారి వాదసమర్థనమునకు సంపూర్ణావకాశముల నొసంగియును నియమానురూపముగను సభావ్యవహారములను ముగింపగలిగెను. మహాత్ముని ఆత్మనిగ్రహము విజయనగర కాంగ్రెసును విజయవంతము చేసినవిధము దేశారాధకులకును నితరులకును మననారాధన యోగ్యముగ నున్నది.

* * * *

కాంగ్రెసు ప్రయోజనము

కాంగ్రెసు ప్రయోజనమును తీర్మానముల రూపముననగాకను క్రియారూపముననను నిర్ణయింప వలయును. అంతర్భేదములతోను వాదప్రతివాదములతోను నిండిన దేశమునందు కార్యఘటనము దుష్కరము. రెండేండ్లనుండియును కలవరమునకు మూలమైన శాసనసభాసమస్య కాంగ్రెసు బలమును క్షీణింపజేసినది. నిరంకుశబలమును వృద్ధిచేసినది. దేశమునందు

సహనముపోయి అసహనము పెరిగినది. వివిధ సంఘములందును పక్షములందును పరస్పర విశ్వాసముపోయి అవిశ్వాసము హెచ్చుపెరిగినది. అవిశ్వాసవాతావరణమునం దే పక్షమునకు పని జేయుటకు స్థైర్యము గలుగకున్నది. స్వరాజ్యపక్ష శక్తిసామర్థ్యములు బహిష్కారపక్ష శక్తిసామర్థ్యములు పరస్పర రంధ్రాన్వేషణమునకును నిందావ్యాపనమునకును వినియోగపడినవి. హిందూమహమ్మదీయ విభేదములు బలీయములైనవి.

ఈ విషమపరిస్థితులందు దేశమునం దన్ని పక్షములయందును మైత్రిని స్థాపించుట స్వరాజ్యప్రస్థానమునకు మూలసాధనమని మహాత్ముడు గ్రహించెను. మహాత్ముడు నమ్మినదానిని జేయుటకు దీక్షను బూనుకొనును గాని కాలహరణమును జేయుట కంగీకరింపడు. అసహాయోద్యమము నిరంకుశ ప్రభుత్వమును ప్రతిఘటించుట కేర్పడినను పరస్పర ప్రతిఘటనము సంప్రాప్తమైనది. కాంగ్రెసుసంఘములందును భిన్న పక్షములందును రాగద్వేషములు ప్రబలినవి. ఆక్షేపణలు ఎత్తిపోటులు నిరసనభావములు నిందారోపణలు ప్రబలి కార్యనిర్వహణమును దుర్లభము చేసినవి. అహమదాబాదునందు స్థాయిసంఘసమావేశమునందు వ్యక్తమైన వికలత్వము మహాత్మునకు సంయోగావసరమును తెలియచేసినది. ఈ యవసరమును వంగరాష్ట్ర నిర్బంధశాసనము మహాత్మునకు విస్పష్టము చేసినది. మహాత్ముడు నిరంకుశ ప్రభుత్వమును ప్రతిఘటించుటకును స్వరాజ్యమును నిర్వహించుటకును అనుభవించుటకును వివిధసంఘములకును వివిధపక్షములకును సంయోగముగావలయునని నిర్ణయించి కార్యసిద్ధికి బూనుకొనెను. కలకత్తాయందు స్వరాజ్యపక్షమునను దాసుగారును బహిష్కారవాదుల పక్షమునను గాంధిమహాత్ముడును నుభయపక్షముల సంయోగమునకును నొడంబడికను జేసిరి. ఆయొడంబడిక బొంబయియందు గూడిన స్థాయిసంఘసమావేశము సమర్థించినది. బొంబయి సమావేశ మేకగ్రీవముగను వంగరాష్ట్ర నిర్బంధాయుధమును నిరసించినది. మహాత్ముడు విజయనగరమునందు కాంగ్రెసువేదికయందు తిరిగి సంయోగావసరమును సువ్యక్తము చేసెను. హిందూమహమ్మదీయ సంయోగము, అస్పృశ్యతా నివారణము, ఖద్దరు నిర్మాణము సంయోగమునకును స్వరాజ్యమునకును సాధనములు. మహాత్ముని విజయనగర సందేశ మీలక్ష్యమును విస్పష్టము చేసినది.

* * * *

ఖద్దరు నిర్మాణము

ప్రపంచమునందు స్వయంపోషణ సంరక్షణ సామర్థ్యము స్వాతంత్ర్య చిహ్నముగ నున్నది. ముప్పదికోట్ల ప్రజలకు స్వయంపోషణ సంరక్షణ సామర్థ్యముండియును నిశ్చేష్టతను వహించి పారతంత్ర్యము ప్రబలినది. స్వయంపోషణమున కన్ని జాతులకును నన్నవస్త్రము లవసరములు. వస్త్రనిర్మాణ సాధనములు దేశమునం దున్నను విదేశ వస్త్రము లాధారములై పరావలంబనము పరిపాటియైనది. విదేశవస్త్ర ప్రవాహము నరికట్టుటకు భారతీయులు సమర్థులైనయెడలను స్వరాజ్యమునకును నధికారు లగుదురు. విదేశవస్త్ర విసర్జనమునకు స్వదేశ వస్త్రాభిమానము స్వదేశవస్త్ర నిర్మాణమును సాధనములు. అరువదికోట్ల రూప్యముల మహాప్రవా

హమునునిలుపుటకు సామర్థ్యమును బడయుటకు రాటపు యోగాభ్యాసావసరమును మహాత్ముడు విజయనగరవేదికయందు తిరిగి పూరించెను. భారతీయ అహింసాయుతమైన కర్మోపాసనను జేయుటకు నూలువడుకుటను సాధనముగ నిర్ణయించెను. ఆసాధన మనుష్ఠాన యోగ్యమని కాంగ్రెసు నిర్ణయించినది. కాంగ్రెసుసభ్యత్వమున కర్హత్వమునకుసాధనములు విద్యాధనములుగాకను ౨౦,౦౦౦ గజముల నూలును ఖద్దరుధారణమునుగను నిర్ణయింపబడినవి. నూలును స్వయముగ వడకక పోయినను కొనియైనను పంపవచ్చును. ఖద్దరును సర్వకాల సర్వావస్థలయందును ధరించక పోయినను రాజకీయసందర్భములందైనను ధరించిన చాలును. ఈయేర్పాటు లుభయపక్షములకును సంతృప్తిని గలుగజేసినవి. ఖద్దరునందువిశ్వాసములేనివారికి నూలు ఖద్దరు నియమములు ప్రతిబంధకము లైనవి. ఖద్దరునందు సంపూర్ణలక్ష్యముగలవారికి నిస్పృహ గలిగినది. మహాత్ముని లక్ష్యము జాతియసౌభాగ్యము స్వరాజ్యసిద్ధిగాని పక్షప్రాబల్య సమర్థనముగాదు. రెండుపక్షములకును ఖద్దరు వేదికయందు సమావేశమును గలుగజేసిన మహాత్ముని భక్తిత్యాగయోగములు సమస్త జనులకును ననుష్ఠాన యోగ్యములు. విజయనగర వేదికయందు మహాత్ము డుపదేశించిన ధర్మయోగప్రభావమును కాంగ్రెసుసభ్యులందరును గ్రహించి యనుష్ఠించి మహాత్ముని సంకల్పమును జాతీయైక్యమును సాధించుదురు గాక!

* * * *

స్వరాజ్యస్వరూపము

గాంధిమహాత్మునకు స్వరాజ్యస్వరూప నిర్ణయ మప్రస్తుతమైనను మిత్రులకు సంతృప్తిని గలుగ జేయుట కుపన్యాసమునందు స్వరూపమును సూచించెను. ఆ సూచనలందు మహత్తరమైన భావపరివర్తనముగలదు. భారతసామ్రాజ్యము బ్రిటీషు సామ్రాజ్యాంతర్గతమైన స్వతంత్ర రాజ్యమైనను బాహ్యగతమైన స్వతంత్ర రాజ్యమైనను మహాత్ముని సూచన లపర్యాప్తములుగ నున్నవి.

భావిస్వరాజ్యము దాల్చవలసిన రూపము భారతీయుల హస్తమునందు గలదు. భారతదేశావృతములైన సంఘము లన్నియును స్వప్రయోజనముల నాకాంక్షించుచున్నను స్వరాజ్యానుతాపమును విశదము చేయుచున్నవి. స్వరాజ్య బృందావనమునందన్ని సంఘములును నిర్బంధములు లేకను యథావిధిగను వికసించుటకు ప్రేమత్యాగపాశములు సాధనములు గావలయును. నిర్బంధవిమోచనమును గోరుచున్న ప్రపంచమునకు నిర్బంధము తరణోపాయము గాజాలదు. జాతి మత కుల ప్రతిబంధకములు స్వరాజ్య బృందావనమును శుష్కింపజేయగల విధమును వర్తమానదుఃఖవేదనానుభవము విశదము చేయుచున్నది. భారతీయులు మహత్తరమైన సంస్కారమున కధికారులు. "సర్వం ఖల్విదం బ్రహ్మ" "తత్త్వమసి" ఇత్యాది మహాధర్మములను ప్రతిపాదించిన మహర్షులసంతానులు. అవతార పురుషుడు గాంధిమహాత్ముడు మహర్షుల ధర్మసందేశమును భారతప్రజాముఖమునను లోకమునకు వెల్లడిచేసి భారతదేశకల్యాణమును లోకకల్యాణమును జేయుటకు బూనిన యజ్ఞదీక్షను నిర్విఘ్నమును సఫలము చేయుటకు భారతీయులు దీక్షాపరాయణులై పరమేశ్వరానుగ్రహమునకు పాత్రు లగుదురు గాక!

Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No. 7 Thumbu Chetty Street, G. T. Madras